చక్కని ఇంగ్లీషును సులభంగా రాసేందుకు ఇంగ్లీషు గ్రామరును సులభశైలిలో వివరించిన పుస్తకం!




# విశాలాంధ్ర
# ఇంగ్లీషు గ్రామర్ & కాంపొజిషన్

ఆర్వియార్




*Visalaandhra*

# ENGLISH GRAMMAR & COMPOSITION

R. V. RAO

చక్కని ఇంగ్లీషును సులభంగా రాసేందుకు
ఇంగ్లీషు గ్రామరును సులభశైలిలో వివరించిన పుస్తకం




# విశాలాంధ్ర ఇంగ్లీషు గ్రామర్ & కాంపొజిషన్

ఆర్వీయార్




*Visalaandhra*

# ENGLISH GRAMMAR & COMPOSITION

R.V.RAO



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

Visalaandhra English Grammar & Composition (Eng-Tel) - By R.V. Rao

ప్రచురణ నెం. : 2350 / 2205 2R

ప్రథమ ముద్రణ : ఏప్రిల్, 1995
ద్వితీయ ముద్రణ: నవంబర్, 1998
తృతీయ ముద్రణ: ఏప్రిల్, 2000
చతుర్థ ముద్రణ : సెప్టెంబర్, 2003
పంచమ ముద్రణ : జూన్, 2005


టైటిల్ డిజన్ : రాజా

వెల : రూ. 100-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
E-mail : visalaandhraph@yahoo.com

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్ / సుల్తాన్ బజార్–హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్ - 500 029.

# ఇంగ్లీషు నేర్చుకోవడం కోసం

ఈత వచ్చాక కాలవలో దిగాల్నా? కాలవలో దిగి ఈత నేర్చుకోవాల్నా? ఇలాంటిదే భాషని నేర్చుకోవడమూనూ, ఈత గ్రామరు అయితే, కాలవ భాష అనుకోండి. దిగితేగాని ఈత రాదు. ఈత వస్తేనే గాని లోతుకి వెళ్లడం కుదరదు.

భాషని నేర్చుకోవడమూ అంతే చేపకి నీళ్లల్లో ఈదడం సహజమైనట్టే మాతృ భాష వాళ్లకి ఆ భాష వ్యవహారం సహజంగా పట్టుబడుతుంది. కాని పరాయి భాషని నేర్చుకోవడం అలా కాదు, పరాయిభాష వ్యవహారం అంత సులభంగా అందదు. ఏ పరాయి భాషైనా పట్టుబడాలంటే, చేతికి అందాలంటే ఏం చెయ్యాలి?

మనుషుల్లో వివిధ జాతులు, తెగలు వున్నట్లే భాషల్లోనూ వున్నాయి. అయితే దగ్గరి సంబంధాలు వున్న జాతులు, దూరపు సంబంధాలు వున్న జాతులు, ఎంతో భిన్నంగా వుండే జాతులు మనకి కనిపిస్తూవుంటాయి. ఒకే సాంఘిక చట్రం వాళ్లల్లోనూ, ఒకే కుటుంబం వాళ్లల్లోనూ పోలికలు, సారూప్యతలు ఎక్కువగా వుంటాయి.

భాషలు కూడా అంతే ఒకే భాషా కుటుంబానికి చెందిన భాషల మధ్య సారూప్యతలు ఎక్కువగా వుంటాయి. ఆ సాంఘిక చట్రం వాళ్లనే, ఆ కుటుంబం వాళ్లనే దత్తత చేసుకుంటే తేలిగ్గా అతుకుతారని భావిస్తూ వుంటాం. అలాగే ఒకే రకమైన పడికట్లు, పద్ధతులు, మడికారం వున్న భాషల్ని తేలిగ్గా నేర్చుకోవచ్చు. ఎబ్బెట్టు లేకుండా వ్యవహరించుకోవచ్చు. అలా లేనప్పుడు ఆ పడికట్లని, పద్ధతుల్ని జాగ్రత్తగా అధ్యయనం చేసి నేర్చుకోవాలి.

ఉదాహరణకి భారతదేశంలోని భాషలు చూడండి. నాగరికత, సంప్రదాయాలు మొత్తం అందరికీ ఒకటిగానే వుండడం వల్ల మనసులోని భావాలకి సంబంధించి పరాయితనం తక్కువ. పోతే భాషల్లో వెల్లడించే తీరు మారవచ్చు. భారతదేశ భాషల వర్ణమాలలు కూడా ఒకటి రెండు మినహాయింపులు తప్పిస్తే సమంగానే వుంటాయి. వాక్య నిర్మాణ పద్ధతులు కూడా కుటుంబసభ్యుల పోలికలతోనే వుంటాయి. అంచేత ఒక భాషవాళ్లు మరొక భాషని నేర్చుకోవడం అందని మాని పండుకాదు. మడికారం పట్టుకోవడంలో కొంత తేడా వుండవచ్చు.

ఇంగ్లీషు భాష అలాంటిది కాదు. 'పరాయి' అనే అర్థం పూర్తిగా అందించే భాష యిది మనకి. వాక్య నిర్మాణం దగ్గర్నుంచి శైలీ విన్యాసం దాకా ఎన్నో తేడాలతో వుంటుంది ఈ భాష మనకి.

ఉదాహరణకి, వర్ణక్రమం చూడండి. కొన్ని ధ్వనులకి అక్షర సంకేతాలు లేవు. మొత్తం వున్నవి యిరవై ఆరు అక్షరాలు. అందులో మళ్లీ అచ్చులనేవి – అయిదు మాత్రమే.

ఇక వాక్య నిర్మాణం అందామా అదీ మన భాషా సంప్రదాయానికి భిన్నంగానే వుంటుంది. మన భాషలో క్రియ వాక్యాంతంలో వుంటే ఇంగ్లీషు భాషలో కర్తని అనుసరించే వస్తుంది – అంటే subject ని అనుసరించి. ఇక articles అనేవి వున్నాయి. ఇవి లేకుండా ఇంగ్లీషు వాక్యం పట్టుబడడం కష్టం. వాటిని ఎక్కడ వాడాలో అక్కడ వాడకపోయినా, ఎక్కడ వాడకూడదో అక్కడ వాడినా దోషమే. Prepositions వున్నాయి. వీటిని నిర్దుష్టంగా వాడడం తెలియకపోతే తప్పులు దొర్లుతాయి. Tense విషయమూ అంతే. క్రియ correct tense లో లేకపోతే ఫలితం దక్కదు. Auxiliary verbs, conjugation of verbs లాంటి వన్నీ ఇంగ్లీషు భాషకి ముఖ్యమైనవే.

అందుచేత ఇంగ్లీషు భాషని నేర్చుకోవడానికి యివన్నీ తెలుసుకోవాలి.

పూర్వం రోజుల్లో ఇంగ్లీషు నేర్చుకోవడానికి, నేర్పడానికి; వ్యాకరణం మీద ఎక్కువ ఆధారపడేవారు. ఇంగ్లీషు గ్రామర్ ఎంత బాగా వస్తే అంతలా ఆ భాష వచ్చినట్టు – ఎక్కాలు కంఠస్థం చేస్తే లెక్కల కష్టం తీరినట్టు. పెద్దవాళ్ళు బళ్లో చదువుకునే పిల్లల్ని ఒరేయ్ ఇంగ్లీషులో ఎన్ని మార్కులు వచ్చాయి? ఏదీ ఈ వాక్యం parsing చెప్పు అని వాళ్లకి (అ)జ్ఞాన పరీక్ష పెట్టేవాళ్ళు. ఇంగ్లీషు parsing – శబ్ద లక్షణాన్ని వివరించి చెప్పడం – వస్తే భాష వచ్చేసినట్టే! ఇప్పటికీ "ఆయన old B.A.", ఆయన old matriculate అంటూ వాళ్ల "భాషా పరిజ్ఞానాన్ని" తెలియచెయ్యడం వింటూ వుంటాం.

ఇంతకీ ఏభాషకైనా ప్రయోజనం మనభావాల్ని అవతలివాళ్లకి అర్థమయ్యేట్టు తెలియచెయ్యడం. మాతృభాషలో అయినా అంతే, పై భాషలో అయినా అంతే. ఇంతకుముందే చెప్పుకున్నట్టు మాతృభాష సహజంగానే పట్టుబడుతుంది. పరాయి భాషని నేర్చుకోవాలి, ఈ నేర్చుకునే పద్ధతికి వ్యాకరణ సూత్రాలు సహకరిస్తాయి. అలా సహకరించేందుకు వ్యాకరణ సూత్రాల్ని ఎలా, ఎంతమేరకు అధ్యయనం చేయ్యాల్సి వున్నదీ వ్యాకరణ గ్రంథాలు తెలియచేస్తాయి. పాతకాలం పద్ధతిలో ముందుగా రెన్ అండ్ మార్టిన్, నెస్‌ఫీల్డ్ గ్రంథాల్ని ఆపోశన పట్టడం విధాయకం అనిపించేది. ఇప్పుడా ధోరణి మారింది ఏ పద్ధతిలో నేర్పాలో, నేర్చుకోవాలో శాస్త్రీయంగా పరిశోధనలు చేసి మార్గదర్శక సూత్రాలు తయారుచేశారు. చేస్తున్నారు, పాతపద్ధతి పనికిరాదని అందరూ అంగీకరిస్తూ వున్నా ఖచ్చితంగా యీ కొత్త పద్ధతే సర్వం సంపూర్ణం అని చెప్పలేకపోతున్నారు.

నేర్చుకునే సాధనాలు ఎలా వున్నా లక్ష్యం ఒకటిగానే వుంది – భాషని నేర్చుకోవడం. ఇంగ్లీషు భాష అధ్యయనం మీద ఇవాళ ఎక్కువ ఆసక్తి కనబడుతోంది. ఓ మాదిరి బస్తీలనుంచి పెద్ద నగరాల దాకా 'ఇంగ్లీషు గ్రామరు తరగతులు', 'స్పోకెన్ ఇంగ్లీషు బోధన' అంటూ అనేక సంస్థలు వెలుస్తున్నాయి ఓ బస్తీలో అయితే అసలు grammar అనే పదం spelling నే తప్పుగా రాశారు. మరి ఎంత మంచి "grammer" చెప్తుతారో ఏమో!

వీటన్నిట్నీ దృష్టిలోవుంచుకుని సుబోధకంగా వుండాలన్న సంకల్పంతో యీ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాం. ఇది హైస్కూలు స్థాయి నుండి కళాశాల స్థాయి వరకూ విద్యార్థులకి ఉపకరిస్తుందనే ఉద్దేశంతో కూర్చాం. అన్ని విభాగాల కింద వివరంగా విషయాన్ని అందించే ప్రయత్నం జరిగింది. మామూలుగా వ్యాకరణ గ్రంథాల్లో 'అభ్యాసాల'ని పేజీలు పేజీలు కూర్చి, విద్యార్థులని వాటిని చెయ్యమని ఆదేశిస్తారు. ఈ గ్రంథంలో అభ్యాసాల్ని అలా యివ్వలేదు. ఆ విషయానికి సంబంధించిన correct, incorrect వాక్యాల్ని యిచ్చాం. అభ్యాసాలు ఎవరికి వారే చేసుకోవడం బాగుంటుంది.

ఇంగ్లీషు భాషలో వ్యవహరించడానికి తగ్గ పరిజ్ఞానం ఈ పుస్తకం అందిస్తుందనే మా ఆశ. ఇంగ్లీషు భాషా "సముద్రము దరియుంగనీదను" ఈ చిన్న యత్నం దోహదపడితే మా కృషి ఫలించినట్టే.

- ప్రచురణకర్తలు

# CONTENTS

# 1 The Sentence

ఈ రోడ్డు చాలా రద్దీగా వుంటుంది.
ఇవాళ టీవీ.లో సినిమా యేమిటి?
గాస్ సిలిండర్ అయిపోయింది.
అక్కడ చాలా రష్‌గా వుంది.
వాణ్ణి యేం అనకు, చాలా ఫీలవుతాడు

పై వాక్యాల్లో వంకరగా ఉన్న మాటలు చూడండి. అవి తెలుగు మాటలు కావు. కాని మనకి అర్థం బోధపడుతోంది. అయితే ఆ మాటలు వాడేవంత మాత్రాన మనకి ఆ భాష వచ్చినట్లేనా? యివన్నీ ఇంగ్లీషు మాటలే. మన నిత్య వ్యవహారంలో యిలాంటి పదాల్ని యెన్నిట్నో మన వాక్యాల్లో వాడుతూ వుంటాం. అంత మాత్రాన మనకి ఆ భాష వచ్చని అనగలమా? అనలేం. యేమంటే వొట్టినే పదాలు వాడితేనే భాష వచ్చినట్టు కాదు. యీ మాటలు మన భాషలో భాగం అయేయి. యీ మాటల అర్థం అందరికీ అందుతుంది కాని ఇంగ్లీషు భాషవచ్చును అని చెప్పుకోవడానికి ఆ భాషలో వాక్యం ప్రయోగించాలి. పదాలు ఆ భాషలోవి కాదా? అంటే ఆ భాషలోవే. అయితేనేం భాష ఉద్దేశ్యాన్ని విడిగా పదాలు అందించవు. ప్రతి భాషలోనూ అన్య భాషాపదాలు వుంటాయి. వాటిని ఆ భాష మాట్లాడే వాళ్లంతా వాడుతూనే వుంటారు. అంతమాత్రంచేత ఆ పరాయి భాషలు వాళ్లకి వచ్చినట్టు కాదు.

ఇంతకీ భాష యేం చేస్తుంది? ఒకళ్ల భావాలు వొకళ్లకి తెలియచేస్తుంది. ఒకళ్ల ఆలోచనలను వొకళ్లకి తెలియచేస్తుంది. భాష మానవ నాగరికత పురోగమనానికి పునాది.

భాష వాక్యాలతో యేర్పడుతుంది. వాక్యాలు పదాల కూర్పుతో యేర్పడతాయి. పదాలు శబ్దాలతో యేర్పడతాయి. భాషకి ఉచ్చారణ, రాత వుంటాయి. రాత గుర్తులే అక్షరాలు. ఉచ్చారణలో భాషవాడకంలో వున్నా రాతగుర్తులు లేక పోవచ్చును. అంటే లిపి లేకపోవచ్చును. లిపి లేని భాషలు యింకా ప్రపంచంలో అక్కడ అక్కడ వున్నాయి. ముఖ్యంగా ఆదివాసి ప్రాంతాల్లో. కాని నాగరికత అభివృద్ధి చెందిన

భాషలన్నిటికీ లిపి సంకేతాలున్నాయి. యీ లిపి సంకేతాలే అక్షరాలు. అక్షరాల కూర్పు లిపిలో శబ్దసంకేతం అన్న మాట. యెన్ని ధ్వనులు పలుకుతామో అన్ని అక్షరసంకేతాలే వుండేభాషలున్నాయి. పలికిన ధ్వనులకంటే లిపిలో యెక్కువ అక్షర సంకేతాలుండే భాషలూ వున్నాయి, ఉదాహరణకి తెలుగు భాష. యెన్ని ధ్వనులు ఉచ్ఛరిస్తున్నామో అన్నే అక్షరసంకేతాలు కనిపిస్తాయి దీన్నే ఇంగ్లీషు లిపిలో 'Telugu Bhasha' అవి 12 అక్షరాల్తో రాయాల్సివుంటుంది. దీన్ని Phonetics అంటారు. సరే, అదంతా తర్వాత చూద్దాం.

భాష వాక్యాలతో, వాక్యాలు పదాలతో, పదాలు ధ్వనులతో యేర్పడతాయి అని కదా చూశాం. యీ శబ్దాల రాత గుర్తులే అక్షరాలు అనీ చూశాం.

ఇంగ్లీషు భాషకి 26 అక్షరాలు రాతగుర్తుగా వున్నాయి. యే భాషలోనైనా రాతకి వాడే అక్షరాల సముదాయాన్ని Alphabet అంటారు. అదే వర్ణమాల. ఇంగ్లీషు భాషలో శబ్దాల్ని Sounds అంటారు. అక్షరాల్ని Letters అంటారు. పదాల్ని Words అంటారు యీ పదాల కూర్పుతో యేర్పడేదాన్ని Sentence అంటారు. ఈ Sentence అనే దాన్నే మన భాషలో వాక్యం అంటాం.

మనిషి పుట్టుకతోనే యేదో వో భాషా కుటుంబంలో పుడతాడు. తల్లి వొడిలో వున్నప్పుడే భాషకి స్పందిస్తూ వుంటాడు. ఆ భాష అతని ఉనికిలో భాగం అవుతుంది. ప్రత్యేకం దాన్ని నేర్చుకోనక్కర్లేదు. తన మనసులో మాట చెప్పకోడానికితగ్గ భాషా పరిజ్ఞానం ఆ దశమంచే అబ్బుతుంది అంచేతనే ఆ భాషని మాతృభాష అన్నారు. కాని పరాయి భాష పట్టుబడాలంటే? ఆ భాషని నేర్చుకోవాలి భాషని నేర్చుకోవడమంటే యేం చెయ్యాలి. మొట్టమొదట్లో చూసినట్టు ఆ భాషాపదాల్ని నేర్చుకోవడమా? ఆ భాషవర్ణమాలని పుక్కిట పట్టుకోవడమా? యేదో కొన్ని మాటలు నేర్చుకున్నంత మాత్రాన ఆ భాష వచ్చినట్టుకాదని ముందు చూశేం. Alphabets ని వొడిసి పట్టడమూ భాషని నేర్చుకోవడంకాదు. మరేమిటి? ఆ భాష వాక్య నిర్మాణ సంప్రదాయాల్ని, నుడికారాన్ని, సొగసుల్ని అవగతం చేసుకోవడమే ఆ భాషని నేర్చుకున్నామన్న దానికి ఆధారం.

ఇంగ్లీషు భాషని, అనేక చారిత్రక కారణాలవల్ల, ప్రపంచ జనాభాలో చాలా హెచ్చు శాతం ప్రజలు వాడుతున్నారు. Of all the languages of the world French is the most beautiful, Italian is the most poetic, German is the most solid and Russian is the most powerful. But more business is done in English than in any other language అని పెరల్ బక్ కామోసు యెక్కడ్నో రాసింది.

సరే, యే భాష గొప్పది, యేదికాదు అనేది కాదు ప్రస్తుత సమస్య. యే భాషనైనా నేర్చుకోవాలంటే యెలా అనేది మన ప్రస్తుత విషయం.

భాష వాక్యాలతో యేర్పడుతుందని కదా చూశాం. యీ వాక్యాలు యెలా యేర్పడతాయో తెలుసుకుంటే ఆ భాష నిర్మాణ ప్రాతిపదికని పట్టుకున్నట్టే. ఆ వాక్యాల నిర్మాణ సంవిధానాన్నే వ్యాకరణం అంటారు. ఇంగ్లీషు భాషలో Grammar అంటారు. భాషానియమాలని, అంటే ఆ rule ని వివరించేదే Grammar. యే కొత్త భాషనేనా నేర్చుకోవాలీ అంటే ఆ నియమాలు యేమిటో తెలుసుకోవాలి. దాన్నే Grammar Study అంటాం. యీ తెలుసుకొనే పద్ధతిలో రెండు రకాలున్నాయి. వీటిని Formal Grammar, Functional Grammar అని పిలవవచ్చును. ప్రతివాడూ మాతృభాష మాట్లాడతాడు. ఆ భాషా వ్యాకరణ నియమాల్ని ఆపోశనబట్టి మాట్లాడుతున్నాడా? లేదే! అదే రకంగా పరాయి భాషనీ నేర్చుకోవచ్చును, అని కొందరు అంటారు. దాన్ని Functional Grammar అంటారు. అలా కాక భాషకి వున్న నియమ నిబంధనల్ని ముందు తెలుసుకుని భాషని నేర్చుకోవాలని కొందరంటారు, దాన్ని Formal Grammar అంటారు. యే పద్ధతి మంచిది అనే చర్చని ప్రస్తుతానికి పక్కనపెట్టి ప్రాథమిక నియమాల్ని ముందు తెలుసుకుని, ఆ రకంగా ఇంగ్లీషు భాషని నేర్చుకునేందుకు యే పద్ధతి అనుకూలిస్తే దాన్ని వాడుకుందాం.

భాష వాక్యాలతో యేర్పడుతుంది. ఆ వాక్యాలు యేర్పడే పద్ధతేమిటో వ్యాకరణం వివరిస్తుంది.

The sun rises in the east.
What do you know about language?
May you live long !
Beware of thieves !
How beautiful the rainbow is !
What a pity you have not come !

యీ ఉదాహరణలన్నీ వాక్యాలే. వాక్యాలు యెన్ని రకాలుగా వుంటాయో కూడా వీటిని బట్టి తెలుసుకోవచ్చు. మనం వెల్లడిచేసే భావాలని బట్టి అయా వాక్యాల రకాలు వుంటాయి. అలా చూస్తే నాలుగు రకాల వాక్యాలున్నట్టు తెలుస్తుంది. అవి :

Assertive Sentence–అంటే పూర్తి అర్థాన్ని అందిస్తూ వొక Statement వుండేదన్నమాట.

The sun rises in the east లో వొక Statementని చెప్పడం కనిపిస్తుంది.

Interrogative or asking a question, Who, Whom, Whose, What, Where, When, Which, Why, How అనే మాటలతో అడిగే ప్రశ్నలు. అలాగే మామూలు క్రియతో అడిగే ప్రశ్నలు, అంటే Are you ready? లాంటివి.

Imperative Sentence: ఈ వాక్యాల్లో ఆజ్ఞలు, అభ్యర్థనలు వుంటాయి. ఇవి Verb తో ప్రారంభం అవుతాయి. కర్త, Subject, ఇమిడి వుంటుంది.

తర్వాత Exclamatory Sentence, అంటే ఆశ్చర్యార్థకం. Assertive sentence full stop తో ముగుస్తుంది. Interrogative sentence question mark ? తో వుంటుంది. Imperative sentence కూడా full stop తో ముగుస్తుంది. Exclamatory sentence ఆశ్చర్యార్థక చిహ్నంతో ! ముగుస్తుంది.

వాక్యాల రూపం ఇలా వుంటుంది. ఆ వాక్యాల్లో వుండే మాటలు అవిచేసే పనిని బట్టి విభజితం అయ్యాయి. అంటే The sun rises in the east లాంటి వాక్యం వుందనుకోండి ఇందులో sun, rises, in, east లాంటివన్ని వొక్క విధమైన పనిసే చెయ్యడంలేదు.

వాక్యంలో అవి వున్న తీరుని బట్టి అవిచేసే పని వుంటుంది. దాన్నే భాషా భాగాలు, Parts of speech అంటారు. మాటల్ని వాటి ఉపయోగాన్ని బట్టి, వాక్యంలో వున్న పద్ధతిని బట్టి ఎనిమిది భాషా భాగాలుగా చేశారు. Words are divided into eight parts of speech. అవి యేమిటీ అంటే ·

| | |
|---|---|
| *Noun* | నామవాచకం |
| *Pronoun* | సర్వనామం |
| *Verb* | క్రియ |
| *Adjective* | విశేషణం |
| *Adverb* | క్రియా విశేషణం |
| *Preposition* | విభక్త్యర్థకం |
| *Conjunction* | సముచ్చయం |
| *Interjection* | ఆశ్చర్యార్థకం, Oh, Ah ! లాంటివి. |

ఈ parts of speech తో బాటుగా ఇంగ్లీషులో Articles అనే ఉపపదాలున్నాయి. ఇవి adjectives లో చేరతాయనచ్చు కాని వీటిని ప్రత్యేక విభాగంగానే అధ్యయనం చేస్తారు. తెలుగు భాషలో ఇలాంటి విభాగంలేదు.

ప్రతివాక్యంలోనూ Subject భాగం అని, Predicate భాగం అని వుంటాయి. The sun rises in the east అన్న వాక్యంలో 'Sun' అనేది Subject విభాగం తరవాతది Predicate విభాగం. Subject అయిన దాన్ని గురించే ఆ వాక్యం తెలియచేస్తుంది. Subject గురించి Predicate భాగం తెలియచేస్తుంది

మరికొన్ని ఉదాహరణలని బట్టి ఈ subject, predicate అనేవి ఏమిటో చూద్దాం. తర్వాత Subject గా Predicate గా యే భాషా భాగాలు వుంటాయో తెలుసుకుందాం

Rao is a Lecturer.
He teaches in a college.
Students like him.

ఈ వాక్యాల్లో 'Rao', 'He', 'Students' అనే పదాలు వాక్యంలో 'Subject', ఈ 'Subject'ని గురించే ఆ వాక్యాలు మనకి తెలియచేస్తున్నాయి. ఈ subjectని గురించి తెలియచేసేది Predicate. Subject గురించి తెలియచేసేదాన్నంతట్నీ Predicate అంటారు Subject గా వాక్యంలో వుండే దాంట్లో Noun గాని, Pronoun గాని, Noun equivalent గాని కనిపిస్తాయి అంటే వాక్యానికి Subject నామవాచకతుల్యమైందే వుంటుందన్నమాట.

Predicate భాగంలో ముఖ్యమైంది Verb క్రియ. 'teaches in a college' మొత్తం Predicate. కాని ఇందులో ముఖ్యమైంది 'teaches' అనే క్రియ. Subject గురించి వివరించే ఈ క్రియని అర్థపూర్తికి అంటే complementకి, కర్మ object, క్రియా విశేషణం adverb లాంటివి వుండచ్చు. వాక్యంలో భాషా భాగాలన్నీ ఈ పనిచేసేవే. అయితే వాక్యంలో Subject, Predicate అనేవి మాత్రం ముఖ్య విభజనగా వుంటాయి Subjectలో నామవాచకం (లేదా తత్తుల్యం) ముఖ్యం, Predicateలో Verb ముఖ్యం. Imperative వాక్యంలో మాత్రం Subject వెల్లడిగా వుండదు, కాని ఉద్దేశించి వుంటుంది 'Stand up', 'Come on', 'Read this' అనే లాంటిచోట్ల 'You' అనేది లోపించింది కాని ఉద్దేశించింది మాత్రం Subjectగా అదే

పైన రాసిన వాక్యాల్ని చూసి ఇంగ్లీషు వాక్య నిర్మాణానికీ, తెలుగువాక్య నిర్మాణానికీ తేడా గమనించండి. ఇంగ్లీషు వాక్య నిర్మాణంలో మొదట Subject తర్వాత Verb వస్తాయి. తెలుగులో క్రియ, Verb, ఆఖర్న వస్తుంది. ఇంగ్లీషులో వాక్య నిర్మాణం Subject Verb Object పద్ధతిలో వుంటుంది. (మధ్యలో వచ్చే మిగిలిన భాషా భాగాల గురించి ప్రస్తుతం చెప్పుకోవడంలేదు. వాక్య రచన, Syntax గురించి వివరంగా అధ్యయనం చేసేటప్పుడు వాటి గురించి తెలుసుకుందాం) "Rao teaches English అనే పద్ధతి ఇంగ్లీషు వాక్య నిర్మాణం అయితే "రావు ఇంగ్లీషు బోధిస్తారు" అనేది తెలుగు వాక్య పద్ధతి.

## Exercise-1

*1. Break the following sentences into subject and predicate.*

Shakespeare wrote plays.
The clock runs fast.
After a long time he returned.
Give me your book.
Show me your notes.
We heard a loud noise.
This is a black pen.
They are at home.
We work sincerely
Students are preparing for the examinations.

2. యిప్పుడు వాక్యంలో వుండే యింకో విశేషం చూద్దాం

The sun rises *in the east*

He met his friend *in the hotel*

He kept the book *on the table*

She went home *after school*

I work *in that room*

కింద గీతగీసిన యీ మాటల సముదాయాల్ని పరిశీలించండి. పైన చెప్పుకున్న subject, predicate లాంటివి లేవు. అంటే subject, verb అని విభజించ గలిగేవిలేవు. మాటలు మాత్రం వున్నాయి. ఆ మాటలు subjectని గురించి తెలియచేస్తున్నాయి కూడా. యిలాంటి మాటల సముదాయాన్ని "Phrase" అంటారు Phrase అంటే two or more connected words not including a finite verb with its subject. వాక్యంలో వుండే మాదిరీ పూర్తి అర్థాన్ని యివ్వగలిగే క్రియ, finite verb, subject ఈ Phrases లో వుండవు. Phrase లు Preposition తో వాక్యంలో introduce అవుతాయి వీటికి idiomatic, అంటే నుడికార, ప్రయోగం కూడా వుంటుంది. యీ Phrases వాక్యంలో వొక భాషావిభాగానికి, అంటే a single part of speechకి – noun లాగా, adjective లాగా, adverb లాగా – అనురూపంగా వుండచ్చు.

I advised him *to apply for the post*. (Noun Phrase)
The boy *in that house* is lazy. (Adjective Phrase)
She *as well as* her husband is at fault. (Conjunctive Phrase)
My house is *in front of* a bank. (Prepositional Phrase)
We watch the TV *in this room*. (Adverb Phrase)

Phrase లాగే వాక్యంలో clauses అనేవీ వుంటాయి. Phrase లో మాటల సముదాయం మాత్రమే వుంటే clause లో Subject, Predicate వుంటాయి అయితే అవి స్వతంత్రంగా వుండలేవు ఒక వాక్యంలో భాగంగా మరో దానిమీద ఆధారపడతాయి. అప్పుడే పూర్తి అర్థం బోధపడుతుంది.

Though he is rich, he is not happy.
Unless you work hard, you cannot pass the examination.
We know that Gopal is a good boy.
I shall not go, if it rains
Where Rama was born is unknown

యీ వాక్యాల్లో Though he is rich, Unless you work hard, that Gopal is a good boy, if it rains, Where Rama was born లాంటివన్నీ clauses. యివి మరోదాంతో వుంటేనేగాని పూర్తి అర్థాన్నియ్యవు. ఈ clauses,

Main caluse అని, Sub-ordinate clause అని, Co-ordinate clause అని మూడురకాలు.

Main clause వాక్యంలో main fact ని తెలియ చేస్తుంది. మిగిలిన వాక్యం దీనిమీదే ఆధారపడి వుంటుంది. Sub-ordinate clause అంటే Main clause మీద ఆధారపడి వుండేది అని. దీనికీ Subject, Predicate వుంటాయి కాని Main clause తో కలిసే వాక్యంలో అర్థాన్ని బోధపరుస్తాయి

Co-ordinate clause అంటే Co-ordinating Conjunctions తో కలిపేది అని. and, but, or, nor, either or, neither, nor, for, yet, so లాంటివి Co-ordinating Conjunctions,

He is rich, but he is not happy.
You must work hard, otherwise you will not pass.

Sub-ordinate clauses కూడా వాక్యంలో (Phrase లాగా) యేదో భాషా భాగానికి చెంది వుంటాయి. Noun Phrase, Adjective Phrase, Adverb Phrase ల్లాగా యివి Noun Clause, Adjective Clause, Adverb clause గా వుంటాయి.

Noun clause "that, whether, where, when, why, who, what"అనే మాటల్తో introduce అవుతాయి.

He said that he was not present.
What you write is not correct.
Find out where he has gone.

Adjective clauses వాక్యంలో adjective చేసే పనినే చేస్తాయి. అంటే noun ని, Pronoun ని qualify చేస్తాయి. యీ clauses "who, whom, whose, which, that" అనే మాటలతో వాక్యంలో introduce అవుతాయి.

The boys who come late should pay some fine.
I met my teacher whose hair turned grey.
I donot know the people whom you refer to.
The pen which you gave me is writing well.

Adverb clauses adverb లాగా verb ని గాని, adjective ని గాని, మరో adverb ని గాని modify చేస్తాయి. Adverb లాగానే adverb clauses కూడా అనేక రకాలుగా వుంటాయి. Adverb clauses of time, place, purpose, result, cause, condition manner, of degree, concession లకి సంబంధించి వుంటాయి.

*Adverbial clauses of time :* 'when, while, before, after, till, until, since, as soon as, no sooner than',అనే వాటితో introduce అవుతాయి.

*Adverbial clauses of place* 'where, whenever' అనే Conjunctions తో introduce అవుతాయి. Come *whenever* you like.

*Adverbial clauses of purpose* . 'that, so that, best, in order that అనే conjunctions తో introduce అవుతాయి.

He worked hard *so that* he could earn money

*Adverbial clauses of result* · 'that, so that, such that' అనే లాంటి Conjunctions తో introduce అవుతాయి.

The student behaved in such a way *that* he was sent out of the class

*Adverbial clause of reason* · 'as, because, since, soon అనే Conjuctions తో introduce అవుతాయి

I did not attend the class *since* I was unwell.

*Adverbial clauses of condition :* 'if, unless' లాంటివి Conjunctions తో introduce అవుతాయి.

*Unless* you run fast, you cannot catch the train.
*If* you work hard, you will pass the examination

*Adverbial clauses of manner : 'as'* లాంటి Conjunctions తో introduce అవుతాయి

She did exactly as her husband told her to do.

*Adverbial clauses of degree :* as, than లాంటి వాటితో introduce అవుతాయి.

He is more intelligent *than* his brother.
The pen is *as* strong *as* the sword.

*Adverbial clauses concession :* 'though, him though, although, even if లాంటి వాటి చేత introduce అవుతాయి.

Though he is rich, he is not happy.

యిప్పటిదాకా చెప్పుకున్నది స్థూలంగా అయా conjunctions అయా adverbial clauses introduce చేస్తాయని మాత్రమే. కొన్ని conjunctions యింకా యెక్కువ రకం clauses ని introduce చెయ్యవచ్చు అందుచేత గిరిగీసినట్టు ఈ conjunction యీ clause నే introduce చేస్తుంది అని చెప్పడానికి లేదు. శ్రద్ధగా యీవిషయం గురించి అధ్యయనం చెయ్యాలి.

Clause ని అధ్యయనం చెయ్యడంవల్ల వాక్యాల్ని మార్చడానికి, transformation కి, వీలవుతుంది.

## Exercise - 2

*Analyse the following sentences into clauses :*

1. If wishes were horses, beggars would ride.
2. I know the place where roses grow.
3. The dog that barks does not bite
4. His carelessness brought him such a ruin that he would never recover.
5. Never do anything that is silly
6. We cannot predict who wins the race
7. Though India has plenty of natural resources, it remains poor.
8. Kurukshetra was the place, where Mahabharata war was fought.
9. Even if you warn me, I shall do it.
10. While I was talking to him, the door was closed.
11. Why he became angry is not known
12. As he is a pilot in civil aviation, he has seen most of the world.
13. Les us wait until he arrives.
14. Do you know when India got independence?
15. All is well that ends well.

# 2 Articles

భాషా భాగాలని గురించి చెప్పుకున్నప్పుడు 'articles' ప్రస్తావన వచ్చింది ఇవి ఇంగ్లీషు భాషలోను, కొన్ని యూరపియన్ భాషల్లోనూ వున్నాయి. తెలుగుభాషలో లేవు రష్యన్‌భాషలో కూడా యిలాంటివి లేవు ఒక రష్యన్ ఓ ఇంగ్లీషువాణ్ణి 'What is time?' అని అడిగేడట. టైమెంత అయిందని అతని ఉద్దేశం. కాని article లేక పోవడంతో ఇంగ్లీషువాడు యింకోలా అర్థంచేసుకున్నాడు, 'కాలం అంటే యేమిటీ' అని. దాంతో 'Go and ask a Philosopher' అని చెప్పేట్ట. నిజమే మరి కాలం అంటే యేమిటో యెవళ్లు చెప్పగలరు, తత్వవేత్తలు తప్ప! అంచేత టైమెంతయిందో చెప్పమని ఇంగ్లీషువాణ్ణి అడగాల్సివస్తే వాళ్ల భాషా నియమాల ప్రకారం 'what is the time' అని అడగాలి. 'the' అని article లేకపోతే, టైమెంత అయిందో తెలియకపోగా Philosophers ని ఆశ్రయించాల్సి వస్తుంది.

ఇంగ్లీషు భాషలో articles అనేవి adjectives లాగా వున్నా, వీటిని ప్రత్యేక ఉపపదాలుగా అధ్యయనం చెయ్యాలి. మిగిలిన భాషాభాగాల్ని గురించి అధ్యయనం చేసేముందు వీటిగురించి తెలుసుకుంటే అక్కడికా chapter పూర్తవుతుంది.

Adjectives లాగానే వీటినీ నామవాచకాలకి ముందు వాడాలి.

Articles అనేవి మూడు. *a, an, the* వీటిలో a, an లని Indefinite articles అనీ, the ని definite article అనీ వ్యవహరిస్తారు.

*Definite article* వొక్కటే వుంటే indefinite articles రెండు వుండడమేమిటి?

*Indefinite articles* రెండువున్నా వాటి function మాత్రంవొకటే. మరిరెండు యెందుకు వున్నట్టు?

ఇంగ్లీషుభాషకి 26 అక్షరాలు వున్నాయని అనుకున్నాం వీటిలో a, e, i, o, u,అనే అయిదు vowels (అచ్చులు) మిగిలినవన్ని consonants (హల్లులు). యీ అయిదింటిలోనూ యేదోవొక అక్షరం మాటలో వుంటేనేకాని ఆ మాట యేర్పడదు. మాటకి ప్రాణభూతమైంది vowel. అయితే vowel లేని మాటలూ సక్కృత్తుగా వున్నాయి, sky, cry, fry లాంటివి. కాని వాటి ఉచ్చారణా vowel ధ్వనితోనే వుంటుంది.

యీ vowel sound తో మొదలయే మాటముందు 'an' వాడాలి, consonant తోనో, consonant sound తోనో మొదలయే మాటలముందు 'a' వాడాలి

an ant, an egg, an Indian, an Orange, an umbrella ఈ పదాలన్నీ vowel తో vowel sound తో వున్నవే.

అదేరకంగా 'h'తో మొదలైన మాటల్లో 'h' silent అయితే, అంటే నొక్కి పలక్కుండా తేలిగ్గా పలికేది అయితే, an వాడాలి. an honest man, Brutas is an honourable man, an hour లాంటిచోట్ల 'h' ధ్వని కంటే vowel ధ్వని వుండడంతో 'an' వచ్చింది.

అదేరకంగా మాట vowel letter తో ప్రారంభమైనా consonant ధ్వనితో వుంటే 'an' కాకుండా 'a' వాడాలి. a university, a European, a one rupee note అని 'a' తో చెప్పాలి. యేమంటే 'u' "ఉ"ధ్వనిలా పలికితే vowel 'యూ'ధ్వనిలా పలికితే consonant. 'o' 'ఒ'ధ్వనిలా పలికితే vowel, 'వ'ధ్వనిలా పలికితే consonant. 'Eu' కూడా "ఉరోపియన్" అనికాకుండా "యూరోపియన్" అని consonant గా పలకడంవల్ల 'an' రాదు.

Indefinite articles గా a, an అని రెండు యెందుకు వున్నాయో చెప్పేందుకే యీ వివరణ. ఒక ఉదాహరణతో ఈ వివరణని ముగించి వీటిని యెలా వాడతారో తెలుసుకుందాం.

Vowel sound ముందు "an," consonant sound ముందు "a" వాడాలి అనికదా చూశాం. ఒకే రకం ఉచ్చారణగా కనిపించే రెండుపదాల ముందు వీటిలో యేది వాడాలోనని తెలుగు ఉచ్చారణలో ఇంగ్లీషు పదాల్ని వాడే వాళ్లకి తికమకవస్తుంది. ear, year అనే పదాలున్నాయి. వీటిని తెలుగువాళ్ళు అచ్చు, హల్లు భేదం తెలీకుండానే పలుకుతారు. దాంతో ఇంగ్లీషు ఉచ్చారణ పోయి articles ప్రయోగం తప్పుతుంది. 'an year' అని పలికేవాళ్లు, రాసేవాళ్లు చాలామంది వున్నారు. కాని తప్పేమిటో గ్రహించడం సులభమే. 'year' (యియర్)ని ear లాగా 'ఇయర్'అని భ్రమపడడమే. 'year' ఇంగ్లీషు ఉచ్చారణ ప్రకారం 'యియర్' కాని, 'ఇయర్' కాదు, ear లాగా. అచేత "a year" అని 'సంవత్సరం' గురించి చెప్పాలి, an ear అని 'చెవి'కింపుగా పలకాలి.

ఇంగ్లీషుభాషలో articles ని యెక్కువగా వాడుతూ వుంటారు. Articles ని యెలా, యే సందర్భంలో వాడాలో – అంటే both indefinite and definite articles – తెలుసుకోవడం ఇంగ్లీషు భాషని బాగా నేర్చుకోవడానికి ముఖ్యం

యెప్పుడు వాడాలో ముందు చూసి, తర్వాత యెప్పుడు వాడ కూడదో తెలుసుకుందాం.

## Indefinite articles a/an

*Indefinite article a/an* అని రెండురూపాలుగా వున్నా function వొకటే (a/an యే ధ్వనులముందు వాడాలో పైన చూశాం). ఆ function గురించి తెలుసుకుందాం.

*'Indefinite'* అనే పదానికి 'అనిర్దిష్ట' 'అనిశ్చిత' 'కచ్చితంకాని' అని తెలుగులో అర్థాలు.

Send for a doctor అనే చోట ఫలానా డాక్టరుకోసం కబురు చెయ్యమన్న ఉద్దేశంలేదు. 'any' అనే ఉద్దేశం, యే డాక్టరుకో ఓ డాక్టరుకి అనే ఉద్దేశం.

Give me a pen
There is a tall man calling you
I saw a cow,

లాంటి వాక్యాల్లో ఫలానా అని కచ్చితంగా నిర్దేశించడంలేదు ఏ pen అయినా సరే, ఏదో వొక pen, ఎవరో పొడగాటి ఆయన, ఒక ఆవు అని మాత్రమే.

a/an అనేవి అసలుకి one అనే అర్థం యిచ్చేవి. అంచేత countable nouns ముందు, అదీ singular number ముందు మాత్రమే వుంటాయి. Un countable nouns ముందు వీటికి ప్రయోగంలేదు. ఇంగ్లీషుభాషలో nouns countable అనీ un-countable అనీ వున్నాయి. రకరకాల పదార్థాలు, material nouns వున్నాయికదా. వీటికి యిన్ని అన్ని అని లెక్క పెట్టలేం. అంచేత అవన్నీ un-countable nouns Gold, water, wool, oil, weather, iron, sugar, bread, advice, information లాంటివన్నీ un-countables. నిఘంటువుల్లో u అనీ c అనీ nouns ని un-countable, countable గా నిర్దేశిస్తూ వుంటారు. అభ్యాసం చేత వాటిని గ్రహించాలి అయితే un-countable nouns ని countable nouns గా మార్చేవిధానమూ వుంది.

| | |
|---|---|
| *Water* | a glass of water |
| *Gold* | an ornament of gold |
| *bread* | a piece of bread or a loaf of bread |
| *furniture* | a piece of furniture |
| *advice* | a piece of advice |
| *news* | a piece of news |
| *information* | a piece of information |

యీ మాదిరిగా un-countable nouns ని countable nouns గా వాడవచ్చును. "Nouns" భాషాభాగాన్ని అధ్యయనం చేసేటప్పుడు a singular, plural number, un-countable, countable తేడాలగురించి యింకా బాగా చూద్దాం. ప్రస్తుతం indefinite article గురించి తెలుసుకుందాం

1 Indefinite article 'a/an' ఒక వొక, 'one', అనే అర్థంలో వాడతారు. అంటే singular nouns ముందే వాడాలి

A beggar came to me.
A stray cow has come this way.

2 యేదోవొక, certain, అనే అర్థంలో

I saw a film
A man had three sons.

యిక్కడ 'a man' గురించి చెప్పేవాడి దృష్టిలో ఒకప్రత్యేక వ్యక్తి వున్నట్టే. కాని వినేవాళ్లకి ఆ వ్యక్తి యెవరో యింకా నిర్దిష్టంకాలేదన్న మాట. తరవాత నిర్దిష్టం కావచ్చు.

3. Common noun ని singular number లో ఆ class మొత్తాన్ని denote చేసేందుకు

A cow has horns.
A dog is a true companion.

4. అదే తరగతికి చెందిన అనే అర్థంలో, అంటే of the same అనే అర్థంలో వాడే nouns ముందు: Birds of a feather flock together.

5. యెవళ్ల గురించేనా ప్రస్తావించే సందర్భాల్లో, ఆ speaker కి ఆ వ్యక్తి నామమాత్రంగానే, by name only, తెలిసివుంటే అప్పుడు· 'A Mr. Rao'. అంటే ఆ 'రావు' యెవరో Speaker కి పేరు తప్ప తెలీదన్నమాట Speaker కి తెలిసివుంటే 'a' వాడడు

6. Proper noun ని Common noun గా మార్చుకునే సందర్భాల్లో a/an వాడచ్చు:

He is a Shylock.
He is a Bhima in strength.
He is an Arjuna

యిక్కడ 'cruel money lender' అనే అర్థంలో Shylock ని, బలంలో భీముణ్ణి సామాన్యవాచకం చేస్తున్నారన్నమాట.

7. Professions ముందు trade names ముందు occupation, class, religionల ముందు a/an వుంచాలి: a doctor, a clerk, a teacher, a Hindu, a Muslim, a Jain వగైరా.

8. ప్రతి, every, అనే అర్థంలో price, speed, ratio, measurement లాంటి వాటిని చెప్పేటప్పుడు: one rupee a litre; forty kilometres an hour; thousand rupees a month; four times a week;

9 Numbers, dozen, gross, hundred, thousand ముందు·

He gave me a thousand rupees.
She bought a dozen apples

10. Singular countable nouns exclamations లో వున్నప్పుడు·

What a hot day! What a pity!

11. in apposition phrases, అంటే వొక వ్యక్తిని గురించిగాని, మరిదేన్ని గురించిగాని వివరిస్తూ చేర్చిన పదబంధాల్లో

Milton, a blind poet, wrote Paradise Lost

12. few, little అనే వాటిని positive sense లో వాడేటప్పుడు; యీపదాలకి indefinite article వాడకపోతే negative sense వస్తుంది.

I have a few friends (some friends అని 'a' లేకపోతే not many అని అర్థం).

13 అస్పష్టత, ambiguityని, తొలగించడానికి:

A black and a white cat, విడివిడిగా యిలా చెప్పకపోతే a black and white cat రెండు రంగులున్న వొకటే అని అర్థంవస్తుంది.

14. Singular nouns ముందు certain phrases లో

I have seen many an accident.
I donot like such a statement.

**Definite article 'the'.**

Definite అంటే నిర్దిష్టమైన, కచ్చితమైన అని అర్థం. Definite article వొక్కటే వుంది. అది 'the'. దీన్ని 'ది' అని, 'ద'అనీ కూడా పలుకుతారు. Before vowel sounds 'the' ది అని, గబగబా మాట్లాడేటప్పుడు 'దె'అని, యితర సందర్భాల్లో 'ద'అని, పలుకుతారు. గబగబా మాట్లాడ్డం సంగతి అలా వుంచినా vowel sound ముందు 'ది'అని హల్లుతో మొదలయే మాటల ముందు 'ద' అనీ పలకడం వుంది. the ant (ది ఏంట్), the man (ద మాన్)

"The definite article may be used before singular as well as plural nouns". దీన్ని యే noun కి ముందు వాడుతున్నామో ఆ noun కీ ఈ article కీ మధ్యవేరే మాటలు కూడా వుండవచ్చు. " It may be separated from its noun by one or more other words." The next house, "the most unreliable man" లాగా.

Definite article ని ఎలా వాడతారో చూద్దాం.

1 ప్రతి common noun ముందు వేసే article వస్తుంది మొదటిసారి అనిర్దిష్టంగా వున్నప్పుడు a/an వస్తే దాన్ని మళ్లీ refer చేస్తూ వున్నప్పుడు the వస్తుంది.

I saw a beggar. The beggar was blind

2. Before nouns of which there is only one: అంటే అలాంటివి ఒకొక్కటే వున్నప్పుడు: The sun, the moon, the poles, the world the north, the last వగైరా.

3 Before singular nouns representing the whole class, అంటే మొత్తం ఆ జాతినంతట్నీ ఉద్దేశించినప్పుడు:

The cow is a useful animal

4 Before the names of rivers, before the names of the groups of islands, before the names of gulfs or Oceans, before the ranges of mountains, before the descriptive names of the countries or provinces:

The Ganges, the Godavary, the Andamans, the West Indies, the Arabian gulf, the Persian gulf, the Indian Ocean, the Bay of Bengal, the Himalayas, the Deccan, the Punjab వగైరా.

5. Before certain names of famous books:

The Ramayana, the Mahabharata, the Bible, the Koran, the Upanishads, the Vedas;

6 Before a proper noun only when it is qualified by an adjective;

The great Shakespeare, the famous Kalidasa, the wise Soleman, the innocent Ramarao.

7. Before nouns which represent one particular thing by reason of locality;

Mother is in the kitchen (ఆ యింటి వంట గది అని)
Father is in the garden (ఆ తోట అని)

8. Before ordinals, అంటే సంఖ్యావాచక విశేషణాలున్నప్పుడు;

He is the first boy.
King George the sixth
Sumitra is the third wife of Dasaradha.

9. With a superlative stress, అంటే అదే అన్నిట్నీ మించి అన్న అర్థంలో
He is the leader of the gang.

10. Before superlative adjectives, తర తమ భేదాల్లో అత్యున్నతమైన దాన్ని ఉద్దేశించినప్పుడు:

Demosthenes was *the greatest* orator in ancient times.
Everest is *the highest* mountain peak in the world.

11. As an adverb with comparatives, అంటే comparative degree లో వున్న adjective ను adverb గా వాడినప్పుడు, వొకే వాక్యంలో రెండు comparative లు వచ్చినప్పుడు:

The sooner the better
The higher you climb, the better the view

12. When we speak of a thing as the best of its kind, ఆ రకానికి సంబంధించి అదే అన్నిట్నీ మించిందైతే·
This is the book on the subject

13. Proper noun ని common noun చేసే సందర్భంలో

Kalidasa is the Shakespeare of India
Bombay is the Manchester of India
Viswanatha is the Nannaya of our age

14. before adjectives used as nouns to denote a whole class:

The rich and the poor have been fighting for ages. ఇక్కడ rich అంటే rich people, poor అంటే poor people.

15. with abbreviations,
The U.S.A., the U.S.S.R., the U.N.O., the I.A.S., the W.H.O

16. before trades and professions following a proper noun· Rakesh Sarma, the astronaut, Mayakovsky, the Poet; Birla, the businessman, Tata, the industrialist; Krishna Menon, the advocate;

17. Before the names of ships, newspapers, aeroplanes etc.
The Jala Usha, the Vijayanti, the Hindu, the Kanishka;

18. To refer to a whole family
The Nehrus, the Gandhis, the Tagores,

19. before adjectives used as nouns to express an abstract idea or a quality,

The good lives on after a man has died.

20 In a number of phrases the definite article has weakly demonstrative force, అంటే చాలా పద బంధాల్లో 'the', 'this', 'that' అనే అర్థానికి అనురూపంగా వుంటుంది.

Tell him I am busy at the moment
I could not remember it at the time.

యిప్పుడు రాతలో యీ కింది విధంగా వున్నా పలికేటప్పుడు యెలావుంటాలో చూడండి.

Charles II (Charles the second)
May 10th, 1950 (May the tenth, nineteen fifty)

యిప్పుడు articles యెక్కడ వాడక్కర్లేదో చూద్దాం.

1. Collective లేదా abstract sense లో Man, Woman అనే పదాల్ని వాడేటప్పుడు definite article రాదు

   Man can not live by bread alone
   Is woman inferior to man?
   This place is untouched by the hand of man

2. Abstract nouns like history, art, life, literature, lore, antiquity లాంటి అనేకమైన వాటికి article రాదు, వాటిని ప్రత్యేక అర్థంలో వాడితే తప్ప.

   Life begins at forty.
   History does not repeat itself.
   All art is great.
   Love is noble.

   అయితే 'This book gives a very good idea of *the* life of an airman' అన్నచోట ప్రత్యేక అర్థం వుంది, కాబట్టి the వచ్చింది.

3. before proper nouns,

   Delhi, London, Kalidasa వగైరా.
   (కాని ఈ proper nouns ని Common noun గా వాడినప్పుడు article వుంటుందని చూశాం. see 13 పైన)

4. Abstract nouns కి ముందు article రాదు.

   Honesty is the best policy.
   Truth alone succeeds.

5. Plural class of nouns used in a general sense:

   The lion is the king of animals.
   Poets love nature.
   After that, events moved swiftly.

(అయితే 'The events of the following days are described అని article వాడచ్చు) అదేరకంగా people ని collective noun గా వాడినప్పుడు article అక్కర్లేదు

People began to wonder what he was upto.

(అయితే *the young* people of these days are not money-minded అని specify చెయ్యచ్చు.)

6. Before names of materials article వుండదు.

Gold is a precious metal

7. Names of meals hardly ever take an article, unless specially qualified: Dinner is ready

He will be back for supper.

(అయితే At the dinner given in his honour అని, bring in the tea అనీ qualified sense లో అనవచ్చు)

8. School, College, Church, Hospital, Prison లాంటి వాటిని వాటి నిర్దేశిత use లో ఉద్దేశిస్తే article వుండదు.

He went to college (to study అనే అర్థం కాబట్టి article వుండదు. I went to the college అంటే యెవర్నో కలుసుకుందుకో, వేరే పనిమీదో అక్కడికి వెళ్లినట్టు అయితే article వుంటుంది).

9. Before names of seasons in abstract sense article వుండదు.

Summer is the best time for picnics.

(అయితే general statement లో, అంటే they keep cows there in the summer లాంటి చోట వుండచ్చు. I remember the winter I spent in the U.S.S.R.)

10. Before nouns indicating time, ముఖ్యంగా school life కి సంబంధించిన సందర్భాల్లో article అక్కర్లేదు. అదే రకంగా day, night, morning, evening, dawn, twilight, dusk అనే వాటికి abstract గా లేక general sense లో వాడినప్పుడు article అక్కర్లేదు.

Meet me during break.

Term was drawing to a close.

We get up at dawn.

(అయితే 'early in the term', అని వొక ప్రత్యేక term గురించి చెప్పవచ్చు).

11. 'Day' లాంటి nouns (Monday, Tuesday లాంటి వారంలో రోజులు) months, week, year అనే వాటికి ముందు article అక్కర్లేదు.

I shall see you on Sunday.
I met him last month

12 Before names of 'diseases', 'sciences', 'sports', 'things' single in kind, అంటే వ్యాధుల పేర్లముందు, శాస్త్రాల పేర్లముందు, క్రీడల పేర్లముందు, ఆ కోరకం అయిన వస్తువులముందు article వుండదు

Hockey, Cricket, Plague, Cholera, Medicine, Dancing, Heaven, God, Mathematics, Physics.

13. Cook, nurse, father, mother aunt, brother, sister etc. take no article. అంటే in the sense of our cook, our father take no article

Mother is angry
Nurse is cross.

14. Before concrete nouns like Heaven, Hell, Paradise, Parliament Congress and abstract nouns like Fortune, Fate, Nature, Providence లాంటి వాటికి కొంచెం యించుమించులో proper nouns గా వాడేటప్పుడు article అక్కర్లేదు Concrete noun అంటే 'a thing as opposed to quality, state, or action, not abstract.

Fate has decided otherwise.

15. Adverbial superlative లో దీన్ని వాడ్డం సందర్భాన్నిబట్టి మారుతుంది. Wheat grows best in the South of England. యిక్కడ లేదు.

Predicative adjective ముందు absence of the definite article is the rule.
He turned against the very people who had been kindest to them, యిక్కడ article రాదు.

అయితే predicative superlatives కనక semi-independent గా వుంటే definite article రావచ్చు.

The potatoes John has grown were the biggest.

16. The majority of, the greater part of, అనే అర్థంలో most (of) వాడితే, దాని ముందు సామాన్యంగా definite article రాదు.

Most of the arable land was under cultivation.
Most people prefer to take a soft line.

అయితే ఆ పదబంధంలో comparative value వుంటే most కి ముందు definite article వస్తుంది. Who made the most mistakes?

17. కొన్ని idiomatic phrases లోని Nouns ముందు the వుండదు.

take to heart, at day break, to bring wood, at breakfast, catch fire, by air, by sea, by car, by train, by boat, by plane, by bus, by

name, in debt, by fair or foul means, on horse back, to lose heart, to set foot, to set sail, to give ear, to take out, to take offence, on foot, by leaps and bounds, at dead of night, out of reach, by dint of, by word of mouth, to shake hands, to leave school, to take oath, to follow suit, out of place, to live from hand to mouth;

18. Before certain titles, names indicating relation-ship: Emperor Kanishka, President Sarma, Prime Minister Nehru, Rai bahadur Naidu.

19. అదేరకంగా విస్తృత అర్థంలో, widest sense లో, noun ని వాడినప్పుడు article అక్కర్లేదు.

    Man is mortal.
    What kind of flower is it?

20. Before plural nouns used to denote a class in general sense,

    Lawyers are generally clever.
    Poets love nature.

21. అదేరకంగా speaker's 'home'ని ఉద్దేశించినప్పుడు 'home'కి ముందు the అక్కర్లేదు.

    Go home, Stay at home

    యీ అధ్యాయాన్ని కొన్ని Exercises తో ముగిద్దాం :

## Exercise 3

యీ కింది వాక్యాల్లో a/an articles ని ఉపయోగించండి: అవసరంలేని చోట (x) గుర్తు పెట్టండి.

1. He lent me – few rupees.
2. There are – great many trees in that jungle.
3. This is – historical event.
4. *This is quite – novel scheme.*
5. Sri Aurobindo was – great philospher and seer.
6. This poem is – call to brave men.
7. My friend is – M.A. in Literature.
8. She is – M.B.B.S. doctor, not RMP.
9. He is – European.
10 I heard – noise.
11. I have – head-ache.
12. I shall stay here for – few days.

13. This is – news to me.
14. She is in – hurry.
15. Bring me – umbrella.
16. They start in – hour.
17. He is – Shylock.
18. He wants to buy – ox.
19. – apple – day keep the doctor away.
20. Have you ever seen – elephant?
21. What – expensive book !
22. What – wonderful day !

## Exercise 4

*Put articles where necessary :*

1. Dinner is ready.
2. Sun rises in east.
3. Camel is ship of desert.
4. French are more civilized than Hindus.
5. Cow is useful animal.
6. Himalayas are to north of India.
7. Man cannot live by bread alone.
8. Garden seemed untouched by hand of man.
9. More he gets, more he wants.
10. Tell him I am busy at moment.
11. Book you mentioned is out of print.
12. He is ablest speaker of college.
13. Andamans are group of islands.
14. Judge in him revolted.
15. Sooner it is done, better it is.
16. I replied to him in negative.
17. Cricket is game of choice.
18. U.N.O. is international body.
19. Which colour do you like, the blue or brown?
20. He has had holiday, and looks better.
21. History is different subject.
22. Earth rotates round sun.

# 3 Nouns

Parts of speech లో ఎనిమిది భాగాలున్నాయని చూశాం మొదటగా వుండేవి nouns, నామవాచకాలు. Nouns, వాటికి తుల్యమైనవి, అంటే noun లాగా పనిచేసేవి వాక్యంలో subject గా, object గా వుంటాయి

యీ nouns యేమిటి? యివి యెన్నిరకాలు? Nouns ని తెలుగులో నామవాచకాలు అంటారు. 'నామ' అంటే పేరు, Noun అంటే name. వేటిపేర్లు? అన్నిటివీనీ, మనుషులపేర్లు, వస్తువులపేర్లు, ప్రాణులపేర్లు, స్థలాలపేర్లు, అన్నీ యీ భాషాభాగం కిందికే వస్తాయి.అయితే అన్నీ వొక్కలాంటి పేర్లే కాదుకదా 'మనిషి' అనేది noun అయినా ఆ మనిషికి proper name వుంటుంది, పెట్టుపేరు.

Rajiv is a man. యిక్కడ 'man' అనేది సామాన్య వాచకం. 'మనిషి' అనే వర్గీకరణ కిందకి వచ్చే వొక proper noun Rajiv. యిక్కడ Rajiv, man అనేవి రెండు nouns అయినా రెండు విధాల వర్గీకరణ కిందికి వస్తున్నాయి. యీ రకంగా యెన్నివిధాలు వున్నాయో ఆ వివరాలు అధ్యయనం చేద్దాం.

Nouns ని concrete అనీ, abstract అనీ విభజించారు. concrete అంటే material formలో మూర్త రూపంలో వున్నటు వంటిది 'That can be touched and felt ! స్పర్శకి అందేది.

The lamp is concrete, but light is abstract. దీపం బల్బు రూపంలోనో, హరికెన్ లాంతరు రూపంలోనో, ప్రమిద వత్తి రూపం లోనో, కొవ్వొత్తి రూపం లోనో కనిపిస్తూ వుంటుంది. అంటే it can be touched and felt. అయితే వెలుతురు? దీనికి వొక నిర్దిష్ట రూపంలేదు. తాకలేం, పట్టుకోలేం. అంచేత యిది abstract, గ్రహించాలంతే.

Concrete nouns can be seen and touched, which really exist Abstract nouns అలా కాదు. ఒక గుణాన్ని (quality) స్థితిని (state or condition) అనుభూతిని (feeling) కళని (art and literature) నిర్దేశించేవి యివి.

The quality of mercy is not strained.
దయాగుణం – దీనికి నిర్దిష్ట ఆకారం, పరిమాణం, చిహ్నాలు యేవి?

వాడి తెలివి అమోఘం.
'తెలివి' యెంతటిదని కొలుస్తాం?

యీరకంగా Nouns concrete and abstract అని విభజన చేశారు.

Concrete nouns లో Rajiv is a man అన్నలాంటి చోట్ల మనిషిపేరు, ఆపేరు వున్న మనిషి వొక సామాన్యవాచకానికి చెందుతాడనీ కూడా వుంది.

అంచేత concrete nouns ని ఇంకా వర్గీకరించేరు. యివి నాలుగు రకాలు.

1. Proper
2. Common
3. Material
4. Collective

Proper noun అంటే వొక నిర్దిష్ట వ్యక్తి పేరునో, దేశంపేరునో, వస్తువుపేరునో తెలియచేసేది. Proper noun capital letter తో మొదలవుతుంది.

Asoka was a great emperor of India. Asoka, India అనేపేర్లు proper nouns. ఒకటి మహాచక్రవర్తి పేరు, రెండోది దేశంపేరు.

Common noun అంటే 'the same class or kind of persons or things కి సామాన్యంగా వర్తించేది.

Indiaలో చాలామంది emperors వున్నారు, వాళ్లల్లో Asoka గొప్పవాడు అనేచోట emperor common noun.

అదేరకంగా, ప్రపంచంలో అనేక దేశాలున్నాయి. India కూడా వొకటి. Country common noun అయితే India proper noun.

Proper nounని common noun గా మార్చవచ్చు.

Kalidasa is the Shakespeare of India.
యీ వాక్యంలో భారతదేశంలో Kalidasa ఇంగ్లండ్ దేశ నాటకకర్త Shakespeare లాంటి వాడని అర్థం. యిక్కడ Shakespeare అనే proper noun నాటకకర్త అనే అర్థంలో common noun అవుతుంది.

Material noun వొక particular kind of substance ని పేర్కొంటుంది ఈ substance విడిగా కాకుండా యేకమొత్తంగా వుండేది. ఉదాహరణకి gold, silver, water, milk, oil, sugar, sand, coal వగైరా. ఈ material nouns ఆ substances లో వుండే భేదాల్ని గాని వాటి భాగాల్ని కాని తెలియ చేస్తూవుంటే common nouns అవుతాయి. gold, వొక gold ornament; oil–material noun గా – దీన్ని oils అని వాడితే రకరకాల oils అని అర్థం.

Collective nouns సమూహంమీద వర్తిస్తాయి. విడివిడిగా వస్తువుల్ని, వ్యక్తుల్ని కాకుండా ఆ విడివాటి సమూహంపేరు collective nouns.

crowd, army, herd, bench, cattle, people, mob లాంటివన్నీ collective nouns.

౪ క Abstract nouns: quality, state or condition, arts, sciences, process of thought,

quality : goodness, kindness, anger, sympathy, redness, whiteness,
state or condition : pleasure, happiness, youth, childhood, health etc.

art · Poetry, music, dance,
sciences : mathematics, astronomy, grammar, logic,

నిర్దిష్ట వస్తువులలో, వ్యక్తులలో వర్తించేటప్పుడు యీ abstract nouns/common nouns అవుతాయి.

Beauty is skin deep అనేచోట 'beauty' abstract 'she is a beauty' అనేచోట common noun.

గమనించాల్సిన యింకో విషయం యేమంటే 'proper, abstract and material nouns have no plural except when they are used as common nouns !

Kalidas, Shakespeare లకి plural లేదు కాని 'Shakespeares' అని నాటకకర్తలని ఉద్దేశించి సామాన్యవాచకం అయినట్లు చెప్పే సందర్భంలో వాడచ్చు

అదేవిధంగా proper nouns, material nouns, abstract nouns యే article లేకుండానే వుంటాయి. కాని వాటిని common nouns చేస్తే articles వస్తాయి.

Kindness is a virtue.
The kindness he showed was unforgettable.

## 1. The Noun - gender

నామవాచకం, స్త్రీ, పురుష భేదం. నామవాచకాలన్నిటికీ స్త్రీ, పురుషభేదం వుంటుంది, దీన్ని లింగ భేదం అని అంటూ వుంటారు. తెలుగులో మహద్వాచకాలనీ, అమహద్వాచకాలనీ వ్యవహరిస్తారు. కొన్నిభాషల్లో వాస్తవంగా వుండే స్త్రీ, పురుష భేదాలు కాక పదాలే ఆ భేదంతో వుంటాయి, సంస్కృతంలో వున్నట్టు. వాస్తవంలో వున్న భేదాలు, మనుషులకీ, జంతువులకీ వున్నటువంటి స్త్రీ, పురుష పరమైన తేడాలు వస్తువులకీ, అమూర్తభావాలకి (abstract) వుండవు. ఒకో సందర్భంలో స్త్రీ, పురుషులిద్దరికీ వర్తించేటట్టు పదాలు వుంటాయి. వీటిని బట్టి gender విభజన చేశారు.

1. Masculine gender
2. Feminine gender
3. Neuter gender
4. Common gender

*Masculine* పురుష, *Feminine* స్త్రీ ;

యీ రెండింటికీ చెందనిది neuter ; రెండింటికీ వర్తించేది common gender గా grammar లో వ్యవహరిస్తారు

| | | |
|---|---|---|
| *Masculine gender* | : | Man, boy, bull, he; |
| *Feminine gender* | · | Woman, girl, cow, she, |
| *Neuter gender* | : | Pen, horse, book, it, |
| *Common gender* | . | Child, scholar, parent, teacher; |

she, he, it తప్ప మిగిలిన pronouns అన్నీ.

Masculine, feminine gender లకి క్రియారూపం తెలుగులో మారుతుంది, 'వాడు వచ్చేడు', ఆమె వచ్చింది అని. ఇంగ్లీషులో అలామారదు. He came, she came అని రెండింటికీ క్రియారూపంపొకటే అయినా లోకవ్యవహారంలో స్త్రీ, పురుష భేదాలున్నాయి కాబట్టి భాషలో అవి వెల్లడవుతాయి 'ఆడది పో ఆడసింహం' అన్నారనుకోండి. సింహానికి ఆడ చేర్చి gender తేడా తెలియచేస్తున్నాం. 'ఆడది సింహం' అనడం భాషా సంప్రదాయంకాదు ఇంగ్లీషులో masculine, feminine తేడాలు యెలా తెలుస్తాయి? ఆ రూపాలు యెలా యేర్పడతాయో తెలుసుకోవాలి.

Nouns కి feminine forms యెలా యేర్పడతాయో చూసి ఈ విషయం గ్రహించాలి.

1. different wordsని బట్టి తెలుసుకోవచ్చు·

   father, mother, brother, sister, uncle, aunt; bachelor, spinster, gentle man, lady, horse, mare, son, daughter.

2. - 'ess' అనేదాన్ని చేర్చడంద్వారా

   Master, Mistress; Tiger, Tigress; Emperor, Empress; Lion, Lioness; God, Goddess;

3. sexని తెలియచేసే మాటని ముందు గాని వెనకగాని చేర్చడం ద్వారా :

| | |
|---|---|
| land lord | landlady |
| grand father | grand mother |
| he goat | she goat |
| cock sparrow | hen sparrow |
| man-servant | maid servant |

4. ప్రత్యేకపదం వాడడం ద్వారా :

| | |
|---|---|
| boy | girl |
| lad | lass |
| hero | heroine |
| widower | widow |

చాలా nouns జతలుగా వుంటాయి, one referring to the male and the other to the female. కొన్ని పదాలు తెలుసుకుందాం

| *Masculine* | *Feminine* |
|---|---|
| Bachelor | Spinster, maid |
| cock | hen |
| nephew | niece |
| king | queen |
| Lord | lady |
| horse | mare |

| | |
|---|---|
| buck (మగ పావురాయి) | dove (ఆడ పావురాయి) |
| bull, ox | cow |
| bullock (కోడె దూడ) | heifer (పెయ్య దూడ) |
| colt (మగ గుర్రంపిల్ల) | filly (ఆడ గుర్రంపిల్ల) |
| drake (మగ బాతు) | duck (ఆడ బాతు) |
| drone (మగ తేనెటీగ) | bee (ఆడ తేనెటీగ) |
| gander (మగ బాతు) | goose (ఆడ బాతు) |
| monk (సన్యాసి) | nun (సన్యాసిని) |
| ram (మగ గొర్రె) | ewe (ఆడ గొర్రె) |
| stag (మగ దుప్పి) | deer (ఆడ దుప్పి) |
| wizard (మంత్రగాడు) | witch (మంత్రగత్తె) |
| hart (మగ దుప్పి) | doe (ఆడ దుప్పి) |
| jack-ass (మగ గాడిద) | jerry-ass (ఆడ గాడిద) |
| bull-calf (కోడెదూడ) | cow-calf (పెయ్యదూడ) |
| pea-cock (మగ నెమలి) | pea-hen (ఆడ నెమలి) |
| sir | madam |
| boar (మగ పంది) | sow (ఆడ పంది) |
| dog (మగ కుక్క) | bitch (ఆడ కుక్క) |

## 2. Noun - number (నామవాచకం - వచనం)

నామవాచకానికి స్త్రీ, పురుష భేదం వున్నట్టే వచనమూవుంది. వచనం అంటే సంఖ్యని తెలియచేసేది. 'A boy came here', 'some boys came here' అన్న వాక్యాల్లో సంఖ్య సూచితమవుతుంది, ఒక అబ్బాయి, కొంతమంది అబ్బాయిలు అని.

యీ వచనం ఏకవచనం, బహువచనం అని రెండురకాలు. ఏక (singular) అంటే ఒక, బహు (plural) యెక్కువ. ఒక అబ్బాయి, కొంతమంది అబ్బాయిలు అనేటప్పుడు 'ఒక' singular ని 'కొంతమంది అబ్బాయిలు' plural నీ తెలియచేస్తున్నాయి. యీ వచనాన్ని బట్టి nouns countable, uncountable, singular, plural అని వ్యవహృతమవుతున్నాయి. లెక్కపెట్టే వాటికి సంబంధించి singular, plural

వుంటాయి అంటే countable అయినవాటికి singular, plural వుంటాయి. uncountable అయినవాటికి singular, plural అని వుండవు

యీ బహువచన రూపాలు యెలా యేర్పడతాయో చూద్దాం.

1. majority of nouns 's' చేర్చుకోవడం ద్వారా singular రూపంనుంచి plural రూపానికి మారతాయి

| | | |
|---|---|---|
| boy | - | boys |
| girl | - | girls |
| king | - | kings |
| son | - | sons |
| daughter | - | daughters |
| zean | - | zeans |
| book | - | books |
| day | - | days |
| cat | - | cats |
| rat | - | rats |

2. Nouns కి కనక s, sh, x, ch అనే అక్షరాలు చివరవుంటే అవి 'es' చేర్చుకుని plural అవుతాయి. 'ch' 'క' ధ్వనితో కాక 'చ' ధ్వనితో వుండాలి.

glass - glasses, bush - bushes, box - boxes, bench - benches; అయితే monarchలో 'క' ధ్వని కాబట్టి, monarchs అవుతుంది. దీనికి exception: conch - conchs. ఇక్కడ "చ" ధ్వని అయినా 'es' రాలేదు.

3. Nouns కి చివర 'f', 'fe' వున్నట్లయితే యీ 'f' 'fe' 'ves'గా మారతాయి.

calf - calves, leaf - leaves, wife - wives, loaf - loaves, knife - knives, thief - thieves, అయితే కొన్ని పదాలు అలాకాక వొట్టి 's'తోనే plural అవచ్చు, 'ves' చేర్చుకునీ plural అవవచ్చు.

scarf - scarfs or scarves
kerchief - kerchiefs or kerchieves
hoof - hoofs or hooves;

4. Nouns ending - of, ief, ff" take 's' in plural. roof - roofs; chief - chiefs; cliff - cliffs;

5. Nouns 'o' తో అంతమై, ఆ 'o' కి ముందు consonant వుంటే plural లో 'es' రూపం వస్తుంది.

hero - heroes; potato - potatoes;
motto - mottoes; volcano - volcanoes;
cargo - cargoes; buffalo - buffaloes;

echo - echoes, mango - mangoes, దీనికి exceptions వున్నాయి.

Photo - Photos;
piano - Pianos;
solo - solos;

6. 'o' తో end అయ్యే అదే nouns కి, ఆ 'o'కి ముందు vowel వుంటే plural లో పొట్టి 's' మాత్రమే వస్తుంది.

cuckoo - cuckoos; portfolio - portfolios;
taboo - taboos, bamboo - bamboos,

7. Nouns 'y'తో end అవుతూ, ఆ 'y'కి ముందు consonant వుంటే, ఆ 'y' drop అయి 'ies' చేర్చుకుని plural అవుతాయి.

lady - ladies; baby - babies;
army - armies, city - cities,
fly - flies, sky - skies - country - countries;
copy - copies, library - libraries;
beauty - beauties, family - families;

8. అలాగే 'y'తో end అవుతూ, ఆ 'y'కి ముందు vowel వుంటే మామూలుగా 's' చేరి plural అవుతాయి.

boy - boys; day - days, key- keys,
bay - bays; kidney - kidneys; play - plays,
journey - journeys, donkey - donkeys;

9. కొన్ని nouns వాటిలో వుండే vowel మారి plural అవుతాయి ఇవి old plural forms.

Man - men; woman - women; foot - feet,
tooth - teeth, goose - geese; louse - lice;
thesis - theses; mouse - mice;

10. కొన్ని nouns 'en' గాని, 'ren' గాని చేర్చుకుని plural అవుతాయి·

ox - oxen; child - children,

brother కి brethren అనే plural form, brothers అనే దాంతోబాటుగా ఇంగ్లీషులో నిలిచివుంది, కాని వేరే అర్థంలోనే అలా మిగిలింది 'తోటి సంఘసభ్యులు' అనే అర్థం, దీన్ని religious context లోనే వాడతారు. Christian brethren అని.

11. compound nouns లో, అంటే రెండు మూడు మాటలతో వుండే nouns కి 's' చేరి plural అవుతాయి, అయితే ఆ 's' ప్రధానమైన nouns కి చేరుతుంది.

son-in-law - sons-in-law
brother-in-law - brothers-in-law
sister-in-law - sisters-in-law
mother-in-law - mothers-in-law
father-in-law - fathers-in-law
commander-in-chief - commanders-in-chief
looker-on - lookers-on
passer-by - passers-by
man-of-war - men-of-war
step-son - step-sons

12 అదేరకంగా groups or compounds with man or woman for their first element to indicate sex usually pluralize in both parts

man-servant - men-servants
man-friend - men-friends
woman-doctor - women-doctors

అయితే fellow-travellers, school-master - school-masters, man-eater - man-eaters, on looker-onlookers, good-for-nothings, అనే వాటిని గమనించండి.

13 కొన్ని nouns కి పొకటే, one number form, మాత్రమే వుంటుంది, they never take a plural suffix; వీటిలో abstract and material nouns వుంటాయి. వీటికి plural form రాదు.

courage, haste, despair.
అదేరకంగా cattle, police.
జంతువులలో deer, sheep - వీటికి plural suffix లేదు.
That is a deer - Those are deer.

14. కొన్ని nouns singular form లో కనిపించినా plural గానే వాడాలి:
poultry, people, mankind, cattle
people ని common noun గా వాడితే singular గానూ, plural గానూ, ఆరూపంతో వాడచ్చు.
Most people are good at heart
Most peoples (races) have a country of their own.

కొన్ని collective nouns భావాన్నిబట్టి plural గానూ, singular గానూ కూడా వుంటాయి.

The committee is enquiring into it.
The committee are divided on the issue.

15. Definite numbers and measurement లో nouns ని వాడేటప్పుడు plural చెయ్యక్కర్లేదు

hundred, thousand, million, dozen, score

gross, stone, hundred-weight;

A hundred pages; Two hundred dollars;

Three thousand four hundred men

The normal span of a man's life is three score and ten (years)

అయితే indefinite numbers తో normal plural వుంటుంది.

All that happened thousands of years ago.

I have told you dozens of times, hundreds of times.

కాని gross, head (of cattle) do not occur in a separate plural form. 'foot', as a measurement can occur in the plural as well as singular form He is six *foot* or *feet* tall

16. కొన్ని nouns plural రూపంలో వుంటాయి, రూపానికి సంబంధించి వాటికి singular లేదు, Trousers, scissors లాంటివి వీటిని plural గానే వాడతారు అయితే కొన్ని చోట్ల singular రూపంకూడా కనిపిస్తుంది.

The beggar asked for an alms.

Alms are given to the poor.

All possible means have been adopted.

Every means has been tried.

The headquarters of the Army are at Windsor.

The general directed his armies from a remote headquarters.

plural రూపంలో వుండే nouns కొన్ని:

Trousers, pincers (శ్రావణం) tongs (పట్టకారు) bellows (కొలిమితిత్తి) spectacles, billiards, measles (పొంగు) mumps (గవదలు) annals, arears, auspices, clothes, belongings, congratulations earnings, goods, manners, odds, outskirts, police, pains, premises, particulars, proceeds, provisions, quarters (lodgings), regards, remains, riches, surroundings, thanks, tropics, tidings, whereabouts;

Innings, series, species లాంటివి one unit కి refer చేస్తూవుంటే singular verb వాడచ్చు.

tongs, bellows, spectacles, scissors, trousers లాంటి రెండు సమాన భాగాలువున్న వస్తువుల్ని సంఖ్య తెలియచేసేటందుకు గాను వాటి ముందు pair of వాడచ్చు.

He has ten pairs of trousers.

This pair of trousers is too tight for me.

These trousers (అంటే యీ లాగు) are too big for me.

17. Names of sciences, - 'ics'తో అంతమయేవి, plural గా కనిపిస్తాయి కాని వాటిని singular గానే వాడాలి

Politics is taught in this college

Physics is a difficult subject.

అదేరకంగా mathematics, linguistics, statistics, accoustics.

అయితే యీరకం మాటల్లో నేరుగా ఆ subject ని ఉద్దేశించకపోతే plural verb వాడచ్చు

The acoustics in this room are unreliable.

These statistics are not correct.

అదేరకంగా, His mathematics is/are not so good as it was/were అనీ అనచ్చు.

యిలా plural గా రూపంలేకపోయినా కొన్ని మాటలు singular గానే వాడకంలో వుంటాయి, వాటికి plural రూపం వుండదు

advice, nonsense, furniture, information, scenery, progress. 'News' రూపం plural గా వున్న singular గానే వాడాలి.

These items of news, this piece of information, a good piece of advice, a fine part of scenry అని countable చెయ్యొచ్చునంతే.

18. ఇంగ్లీషు భాషలో అనేక విదేశీపదాలు వచ్చిచేరాయి. లాటిన్, గ్రీక్, ఫ్రెంచి, ఇటాలియన్ భాషా పదాలు వీటిలో వున్నాయి. ఇంగ్లీషు భాషా నియమాల్నిబట్టి వాటికి బహువచనం రూపొందించుకోవాలని బలమైన దృక్పధమూ వుంది. scientific context కే foreign plural ని పరిమితం చెయ్యాలనీ వుంది. అంచేత ద్వంద్వ రూపంలో కొన్ని plurals కనిపిస్తాయి.

(a) singular రూపం -usతో అంతమైతే pluralలో -'i' రూపం వచ్చేవి వున్నాయి.

radius -radii, stimulus - stimuli – యిదేరకంగా bacillus, cactus, fungus, nucleus, terminus. అయితే terminuses, cactuses, radiuses అనేరూపాలూ వచ్చేయి

genius అనే మాట geniuses అనీ genii అనీ బహువచనంతో వుంది. అయితే బహువచనంలో వున్న రెండు రూపాలకీ అర్థాలువేరు. బహువచనంలో రెండురూపాలు వుండి అర్థం వేరుగా వుండే మాటలు యేమిటో కింద చూద్దాం;

యీ రెండింటి అర్థాలూ యిప్పుడే తెలుసుకుందాం:

geniuses ప్రతిభావంతులు, genii భూతాలు.

ప్రతిభావంతులు భూతాలు కదా !

(b) singular లో -us తో అంతమై plural లో -'era', 'ora' అనే రూపాలు వచ్చేవి. genus - genera, corpus - corpora;

(c) singular లో '-a' తో అంతమైతే plural లో 'ae' (pronounciation ఎమ్, ai, or i (ఈ))

amoeba, antenna, formula, nebula అనేవి amoebae, antennae, formulae, nebulae అవుతున్నాయి అయితే formulas అనేరూపం ప్రాచుర్యంలోకి వస్తోంది, formulae అనేది scientific contexts కే పరిమితం అవుతుంది.

(d) -'un' తో end అయేవి plural లో 'a' తో వుంటాయి. Curriculam Curricula

అదేవిధంగా bacterium, erratum, medium, memorandum, stratum, symposium అయితే agenda, data అనేవి plural ending తో agenda, data లు రెండూ countable గా, singular గా వాడకంలో కనిపిస్తున్నాయి

(e) Is there an agenda for the meeting?

'data' countable గా plural తోనూ, mass noun గానూ వుంది.

There is/are not enough data yet

'-is' తో end అయేవి plural లో 'es' గా మారుతున్నాయి.

analysis - analyses, oasis - oases, యిదే మాదిరి basis, crisis, diagnosis, hypothesis, neurosis, synopsis, thesis అనేవి plural లో 'es' తో వుంటాయి.

(f) singular లో "on" తో end అయేవి plural లో 'a' గా మారతాయి. criterion - criteria

phenomenon - phenomena

(g) singular లో 'ex', 'ix' తో అంతమయేవి plural లో 'ices' గా వుంటాయి appendix, matrix, index plural లో appendices, matrices, indices గా వున్నాయి అయితే indexes, matrixes అనేరూపాలూ వచ్చాయి indexes అనేది పుస్తకాల అఖర్న lists కి, matrixes అనేది gramophone records reference లకీ వాడుతున్నారు. Indices అనేది scientific usage కి పరిమితమైంది

(h) -'eau' తో అంతమయే singulars కి plural లో 'eaux' వస్తుంది.

bureau - bureaux

plateau, postmorteau, tableau అనేవి యిలానే plural అవుతాయి.

19. కొన్ని nouns కి plural లో రెండురూపాలు వేరేవేరే అర్థాలతో వున్నాయి.

brother brothers (మామూలు అర్థంలో సోదరులు అని plural form)

brethern (మత సంఘ సభ్యులు)

cloth, cloths (కుట్టని బట్టలు)
clothes (వాడుకునే బట్టలు)
dye (అద్దకం, రంగు) dyes (రంగులు)
die (అచ్చు) dies (అచ్చులు) dice (పాచికలు)
genius geniuses (మేధావులు) genii (భూతాలు)
penny pennies (పెన్నీ నాణేలు) pence (విలువ)

20. కొన్ని nouns కి singular లో రెండర్థాలు బహువచనరూపంలో ఇంకో అర్థం వున్నాయి.

practice (వృత్తి, ఆచారం) practices (ఆచారాలు)
light (వెలుతురు, దీపం) lights (దీపాలు)
people (ప్రజ) peoples (ప్రజలు, జాతులు)

21 కొన్నింటికి singularలో వో అర్థం, బహువచనంలో రెండు అర్థాలు వున్నాయి.

manner (పద్ధతి, వైఖరి) manners (నడవడిక)
damage (నష్టం) damages (నష్టాలు, పరిహారాలు)
letter (అక్షరం) letters (అక్షరాలు, ఉత్తరాలు, సాహిత్యం)
number (సంఖ్య) numbers (సంఖ్యలు, పద్యాలు)
quarter (పావు) quarters (పావులు, నివాస స్థలం)
effect (ఫలితం) effects (ఫలితాలు, సొంతవస్తువులు)
colour (రంగు) colours (రంగులు, జెండాలు)

22. కొన్ని nouns singular లో వో అర్థంతో వుంటే plural రూపంలో వేరే అర్థాన్నిస్తాయి

air airs (తెచ్చిపెట్టుకున్న ప్రవర్తన)
force forces (సైనికపటాలం)
iron irons (సంకెళ్ళు)
advice (సలహా) advices (సమాచార విషయం)
minute minutes (సమావేశంలో రికార్డు చేసే సమాచారం)
saving (ఆదా) savings (ఆదాచేసే సొమ్ము)

23. 'number' అనే మాటకి ముందు 'a' వుంటే plural verb, 'the' వుంటే singular verb వాడాలి.

A large number of people were present.
The number of candidates appearing for interview is negligible.

24. 'half' అనే singular form కి, 'heaps', 'lots' అనే plural formsకి,

a. singular noun గాని, 'of'తో pronoun గాని follow అయినప్తే singular verb వస్తుంది.

Half of our task is done
There is heaps of ammunition left in the field.
There is lots of work to do.

b plural noun గాని, pronoun గాని follow అయి వస్తే plural verb వస్తుంది.

Half of them are coming.
Lots of people do like this.
Heaps of these things are there.

## 3. Noun - Case (నామవాచకం – విభక్తి)

వాక్యంలో nouns అనేక పద్ధతులుగా వుంటాయి. వాక్యంలో subject గా వుంటాయి, object గా వుంటాయి; subject గా వున్నవీ, object గా వున్నవీ వొకే సంబంధంతో వాక్యంలో వుండవు. క్రియచేసే పనిని subject చేయించేదైతే object గా క్రియచేసేదాన్ని లక్ష్యంగా వుంటాయి.

Rama killed Ravana.

'Rama' subject. Rama killed. ఎవర్ని 'Ravana'. అంచేత Ravana objectగా క్రియకి వుంటుంది. యిలాంటి సందర్భాల్లో 'Rama' 'Ravana' వున్న స్థానాల్నిబట్టి వాటి case నిర్ణయం అవుతుంది.

తెలుగులో 'విభక్తి'ని ఇంగ్లీషులోని 'case'కి సమానార్థకంగా చెప్తూ వుంటారు. అయితే అది స్థూలంగానే నిజం. తెలుగుభాషలో ప్రథమావిభక్తి నుంచి సప్తమీవిభక్తి దాకా, సంబోధన ప్రథమా విభక్తితో సహా వుంటే ఇంగ్లీషులో caseలు నాలుగేవున్నాయి.

అర్థం అయేటందుకుగాను తెలుగు విభక్తుల్ని చెప్పుకున్నా ఇంగ్లీషు case ని యధాతథంగా విభక్తులకి కలపకూడదు.

ఇంగ్లీషులో Nominative case, Objective or Accusative case, Genitive or Possessive case, Vocative case.

Accusative or objective case కి చెందిందే Dative case.

Nominative case నే subjective case అనీ అంటారు.

a. *Nominative case :* ఒకవాక్యంలో subjectగా వున్నప్పుడు ఆ noun nominative caseలో వుందని అంటారు, అప్పుడది subjective case కూడా అవుతుంది. అయితే వాక్యంలో nominative case వాక్యానికి (i) subjectగా వుండచ్చు. ఉదా. Water flows. (ii) complementగా వుండచ్చు. She is my sister. (iii) in apposition to another noun in the nominative, He is my friend, Raju. (iv) Used absolutely: we went away, my wife having finished her work

b. *Accusative case* : (i) direct object, He wrote the letter, (ii) governed by the preposition the book is on the table, (iii) complement of a transitive verb they made him king, (iv) in apposition to another noun in accusative case, He married Shaila, his colleague. (v) as an adverb does, modifies words expressing time, place, cost, distance, weight, degree etc He arrived last night, Let us play the game, This TV costs ten thousand rupees. He ran five miles. The patient is a bit better now.

Dative case అంటే indirect objectగా వున్నటువంటిది

I gave him a gift, యీ వాక్యంలో రెండు objects వున్నాయి, 'him' and 'gift'. రెండు objects వున్నప్పుడు వొకటి వ్యక్తిని, రెండవది వస్తువుని సూచిస్తాయి. వస్తువుని తెలియచేసే object, direct object, వ్యక్తిని తెలియచేసే object, indirect object. Indirect objectగా వుండే noun dative caseలో వుంటుందని చెప్పచ్చు.

c *Genitive case* కి వెళ్లేముందు vocative caseని గురించి చూద్దాం. ఏమంటే genitiveకి నియమాలు యెక్కువ. Vocative case అంటే addressing a person or thing.

Boy, come here.
O, Sleep ! Where are you !
దీన్ని సంబోధన ప్రథమావిభక్తి అనచ్చు.

d. ఇక genitive case : యిది షష్ఠీవిభక్తి. possessionని తెలియచేస్తుంది, 'యొక్క' అనే అర్థం. తెలుగులో వ్యవహారంలో 'యొక్క' అని వాడకపోయినా ఆ నామవాచకాన్నిబట్టి దాన్ని గ్రహించవచ్చు. 'వాడి పుస్తకం' అన్నచోట పుస్తకం వాడికి చెందిందని బోధపడుతుంది. 'వాడి యొక్క పుస్తకం' అని అక్కర్లేదు

ఇంగ్లీషులో యిది యేర్పడే పద్ధతులు తెలుసుకుందాం.

Genitive case personal nounsకి, personal indefinite pronounsకి apostrophe's తో యేర్పడుతుంది. యిది possession ని indicate చేస్తుంది.

John's book –జాన్ (యొక్క) పుస్తకం apostrophe 's' అంటే 's, s కి ఎడం వేపు పైన తిరిగేసిన కామా వున్న అని. అలా అని సర్వదా possession indicate కానక్కర్లేదు, 'కలిగివుండు' అనే అర్థంలో. ఉదాహరణకి John's present అనేలాంటిచోట John అందుకున్న present కావచ్చు, అందుకోబోయేది కావచ్చు, John యిచ్చింది కావచ్చు, యివ్వబోయేది కావచ్చు.

(i) 's ని singular nouns చేరిస్తే genitive అవుతుంది. The boy's cap

(ii) pluralలో s లేని nounsకి 's చేరి genitive యేర్పడుతుంది

Children's toys
men's clothes
women's rights

(iii) 's'తో end అయే nounకి genitive form 's తోనే అంటే apostrophe 's తో యేర్పడుతుంది, extra syllable వచ్చి

St James's palace
St. Thomas's hospital

కొన్ని సందర్భాల్లో extra syllable లేకుండా వొక్క apostropheతోనే genitive యేర్పడచ్చు.

Keats' poetry (poetry of Keats)
Pepys' Diary (Diary of John Pepys)

Greak classical names 's'తో ముగుస్తే వాటికి వొక్క apostrophe మాత్రమే వచ్చి genitive యేర్పడుతుంది

Socrates' pupils, Archimedes' law

(iv) Inanimate nounsకి apostrophe 's' సామాన్యంగా రాదు, యిటీవలికాలంలో రేడియోల్లో చదివేటప్పుడు కొంచెం యీ ధోరణి కనిపిస్తూ వున్నాగానీ (ఉదాహరణకి chemical's effects లాంటివి). Inanimate nouns 'of' తో మొదలయే phrase తో వుంటాయి. అంచేత 'chair's leg is broken' కాకుండా 'leg of the chair' అని వుంటుంది. the foot of the mountain, the side of the hill, the side of the road, the bank of the river అనే ప్రయోగం వుండాలి. అయితే alternative గా, hill-side, road-side, river bank అనవచ్చు.

(v) apostrophe 's'తో genitiveని వొక group of peopleకి, మనుషులు వుండే placesకి, human institutionsకి వాడచ్చు యివి inanimate అయినా.

Africa's future, the committee's report, the club's finances, the earth's surface, the nation's affairs, Delhi's traffic.

(vi) apostrophe 's', వొక సంఘటన duration lengthకి ఉద్దేశించే సందర్భంలో ఆ nounsకి వాడాలి.

a day's rest, an hour's drive, a month's time, a week's holiday, today's programme, a year's work

(vii) కొన్ని set phrasesలో thingsని denote చేసే అనేక nounsని యీ genitive వాడాలి.

The ship's company, the ship's doctor, to keep a person at arm's length, by only a stone's throw away, keep out harm's way, be at one's wit's ends, for goodness' sake, needle's eye

(viii) double genitive apostrophe 's' తో,

a friend of my father's, the book of Rama's లాంటివాట్లో వుంది

'one of the friends that my father has', 'the book that Rama has' అని అర్థం

(ix) ఒకే nounగా treat చేసే group of wordsకి apostrophe 's' ఆఖర్న వస్తుంది

my father-in-law's house, somebody else's money, the president of India's decree,

(x) బహువచనంలో 's' తో అంతం కానివాటికి మామూలుగానే apostrophe 's' రావడం వుంది ((ii) చూడండి, men's clothes)

యిక ముగింపుగా చెప్పుకోవలసింది:

genitive apostrophe 's', 'of' adjunct లేకుండా animate names కి, time ని denote చేసే nouns కి, place ని తూనికల్ని తెలియచేసే nouns కి, number of set phrases కి వస్తుంది

మొత్తం మీద genitive case four forms లో వుందని తెలుసుకోవాలి. apostrophe 's'తో యెలా వుండేదీ పైన వివరించుకున్నామంతే. ఆ four forms

(i) 's - genitive - the boy's cap వగైరాలన్నీ

(ii) of - genitive – యిది simple 's genitive మాదిరే అదే grammatical relationతో వుంటుంది. the man's son or the son of the man.

(iii) double genitive : a friend of my father's

(iv) personal pronounsతో యేర్పడే genitive - yours, his, hers, theirs, my, mine, ours

ఇప్పటిదాకా case గురించి తెలుసుకున్నాం.

Nounsకి బదులుగా వాడే pronounsకీ nounsకి వుండే రూపాలు వుంటాయి. ఆ pronouns గురించి చూద్దాం.

Pronounsకి వెళ్లేముందు "common errors in the use of nouns" కొన్నింటిని చూద్దాం:

| Incorrect | correct |
| --- | --- |
| I spent the holidays with my family members. | I spent the holidays with my family (or I spent the holidays with members of my family) |
| There is no more place in this compartment. | There is no more room in this compartment. |
| Our boarding full. | Our boarding house is full |
| The sceneries of Kashmir are very fine. | The scenery of Kashmir is very fine. |
| Where have you placed your furnitures? | Where have placed your furniture? |
| Have you received any informations? | Have you received any information? |
| The price of cattles has gone up. | The price of cattle has gone up |
| He told these news to his brother. | He told this news to his brother. |
| There are no breads in the kitchen. | There is no bread in the kitchen. |
| He took troubles to achieve this result. | He took trouble to achieve this result. |
| You should not find faults with my work. | You should not find fault with my work. |
| His merits are exceptional. | His merit is exceptional |
| His brother has gone to Delhi for further study. | His brother has gone to Delhi for further studies. |
| You should wear light-coloured trouser. | You should wear light-coloured trousers. |
| We have two dozens of eggs. | We have two dozen of eggs. |
| A five-men delegation arrived yesterday. | A five-man delegation arrived yesterday. |
| We had an hour talk with them. | we had an hours' talk with them. |
| Is is a girls's college. | It is a girls' college. |
| He is going on a month leave. | He is going on a month's leave. |
| He did not put his signs on this paper. | He did not put his signature on this paper. |
| I am reading a new poetry. | I am reading a new poem. |
| The population of this village is five thousands. | The population of this village is five thousand. |
| She had no issues. | She had no issue. |
| Summer vacations are near. | Summer vacation is near. |

| | |
|---|---|
| The floods have caused many damages. | The floods have caused much damage. |
| He weighs about ten stones. | He weighs about ten stone. |
| The house's walls are damaged. | The walls of the house are damaged. |
| He reached the age of two scores and one. | He reached the age of two score and one. |
| My scissor is blunt. | My scissors are blunt. |
| I need a spectacles | I need a pair of spectacles. |
| His hair are white. | His hair is white. |
| Give him two breads. | Give him two loaves (or two pieces) of bread. |
| My father gave me many advices. | My father gave me many a good piece of advice. |
| Tell me the content of the letter. | Tell me the contents of this letter. |
| My thank is due to him. | My thanks are due to him. |
| He has many brother-in-laws. | He has many brothers-in-law. |
| Mathematics are a difficult subject. | Mathematics is a difficult subject. |
| The fishes of this pond.... | The fish of this pond... |
| The police is unhelpful. | The police are (or the policeman is) unhelpful. |

# 4 Pronouns

Nounsకి గాని noun equivalentకి గాని బదులుగా వాడేవి pronoun యీ పదం అర్థమే దాన్ని తెలియచేస్తుంది, noun కి బదులుగా అని. యేదన్నావొకటి మరోదానికి బదులుగా రావాలంటే అసలు దాని లక్షణాలన్నీ వుండాల్సిందేకదా Noun వొక వాక్యంలో యే యే పన్లు చేస్తుందో వాటినన్నిట్నీ pronoun కూడా చేస్తుంది నామవాచకాలకి బదులుగా వాడే pronouns యీరకాలుగా వుంటాయి

1. Personal, 2. Possessive, 3 Demonstrative, 4 Relative, 5 Interrogative, 6. Distributive, 7 Indefenite, 8. Reflexive, 9 Reciprocal

## Personal Pronouns :

ఇంగ్లీషులో three classes of personal pronouns వున్నాయి. Person speaking or a group of persons speaking including the persons speaking, first person అంటే యెవళ్లైతే మాట్లాడుతున్నారో వాళ్లు first person. (తెలుగులో ఉత్తమ పురుష; తన్నుత్తమ, యెదుటమధ్యము, యెక్కడో ప్రధమ అని కదా వ్యవహారం) person spoken to – యెదుటి వాళ్లగురించి – second person. Other persons or things third person

First, second, third persons అనే మూడు పురుషల్లో first and third personsకి distinct forms వున్నాయి. అవేమిటీ అంటే,

First person singularకి I.
Third person singularకి He/she/it

First person plural 'we', third person plural 'they'.

First person, second person pronounsకి feminine gender form లేదు. Third person singularకి మాత్రమే feminine form 'she' అనివుంది.'It' neuter gender, వస్తువులకి, gender distinction లేని వాటికి దీన్ని వాడతారు

Nounకి బదులుగా వచ్చేవి కాబట్టి ఈ pronouns కూడా వాటికిలాగా 'case' రూపాలతో వాక్యంలో వుంటాయి, number (అంటే singular, plural తేడాలతో) వుంటాయి. అయితే verb ఆ genderని బట్టి మారదు, numberని

బట్టి మాత్రమే మారుతుంది తెలుగులో క్రియారూపం genderని బట్టి మారుతుందని మనకి తెలుసు.

ఆమె వచ్చింది, వాడు వచ్చాడు అని స్త్రీ, పురుషపరంగా క్రియారూపం వుంటుంది ఇంగ్లీషులో అలాకాక,

He *is* a student, she *is* a student అని క్రియ మారకుండానే వుంటుంది.

Case మార్పు యెలా వుంటుందో చూద్దాం

Number, case మార్పుల్ని తెలియచేసే table యిది :

| Person | Nominative | | Accusative or objective | | Possessive or genitive | |
|---|---|---|---|---|---|---|
| | sing | plural | sing. | plu. | sing. | plu. |
| first | I | we | me | us | My, mine; | our, ours |
| second | - | you | you | you | - | your, yours |
| third | He | - | Him | - | His | their |
| | she | they | Her | them | Her, hers | theirs |
| | It | - | It | - | Its | |

'you' అనే second person రూపమే అన్ని cases లోనూ, number లోనూ వాడుకలో వుంది. యీ second person singular రూపం 'thou' అనేది 'నువ్వు' అన్నట్టు, Bibleలో, poetryలో మిగిలివుంది. ఇప్పుడు అక్కడా పోయింది.

'we' అనే first person plural రూపానికి 'మేము/మనం' అని కూడా చెప్పుకోవచ్చు; తెలుగులో మాదిరి 'మనం' అనే inclusive plural form ఇంగ్లీషులో లేదు.

Genitive caseలో వున్న కొన్ని personal pronounsకి రెండు రూపాలున్నాయి కదా. వీటిలో my, our, your, her, their అనేవాటిని possessive adjectives గా కూడా వ్యవహరిస్తారు. అవి nouns తో వుండి adjective గా కూడా పనిచేస్తాయి.

This is my book.
It is your pen.
They are her relatives.
They do their duty.

First person I, we వాడేటప్పుడు gender తెలీదు– వాక్యంలో అలా నిర్దేశించే పదాలు వుంటేతప్ప.

I am a student అని వొక అబ్బాయీ అనచ్చు, అమ్మాయీ అనచ్చు. Second personకీ అంతే. Third personకి మాత్రం he, she అని gender తెలియచేసే పదాలు విడిగా వున్నాయి. మళ్లీ pluralలో 'They' అనే.

He, she అనే third person pronouns మనుషులకి సంబంధించి వాడేటప్పుడు చిక్కులేమీలేదు. అబ్బాయి, అమ్మాయి, అతను, ఆమె అనేవి యే genderవో పేచీయేలేదు కాని literary Englishలోనూ, భాషా సంప్రదాయంప్రకారం కొన్ని సందర్భాల్లో వస్తువులకీ, వాహనాలకీ, ఓడలకి, విమానాలకి feminine genderని సూచించేట్టు వాడతారు Personification of abstract nouns జరిగినప్పుడు వాడతారు. ఉదాహరణకి,

Death will come when he is least expected

He అని Deathకి వాడడం (Time, war etc లకి) బహుశా Death అనేది something strong and terrible అవటమ్టేమో కాని పైన చెప్పినట్టు moon, sea, earth, country, names of countries, city, (names of cities), personify చేసిన Nature, Fortune, Science, Liberty, Mercy, Peace లాంటి వాటిని feminine గా వాడతారు యిలావాడడానికి భాషా, సంస్కృతీ సంప్రదాయాలు కొంతవరకూ కారణం

మన సంప్రదాయంలో నదులు తల్లులు, నదీమాత; సముద్రుడు masculine అని అంటాం సూర్యుడు, (చంద్రుడు - చందమామ)- ఉదయిస్తున్నాడు అనే వ్యవహారం

ఇంగ్లీషు సంప్రదాయంలో sun masculine, చంద్రబింబం feminine

మనం వనదేవతలనీ, జలదేవతలనీ వ్యవహరించినట్టే ఇంగ్లీషులో Fortune, Mercy, Peace feminine Liberty తో వుంటాయి Statue of Liberty స్త్రీమూర్తి కదా!

యిక "it" వుంది Neuter genderని యిది నిర్దేశిస్తుంది. Masculine, feminine కానివి neuter కదా. అంటే life-less things అయితే పక్షులు జంతువులు gender వున్నవే (male, female); అయినా వాటిని సూచించడానికీ 'it' వాడతారు. చంటిబిడ్డలకి, gender నిర్దేశించనప్పుడు 'it' వాడతారు. అదేవిధంగా 'it' may refer to nouns denoting a number of persons when the group is thought of collectively.

యీ పైనచెప్పిన వాటికి ఉదాహరణలు చూద్దాం

So, this is your house - Yes, I bought it long ago
Please shut the door - It is shut.
The baby is crying - it cries like that
Inform the public, otherwise it will be furious
The government is weak, it will fall anyday

యిదికాక 'it' ని ఉపయోగించే సందర్భాలు యింకావున్నాయి.

a. *Grammatical subject*గా 'it'ని వాడడం వుంటుంది. (దీనికీ 'there'ని యిలా వాడడానికీ పోలికవుంది, యీ 'there' గురించి తర్వాత తెలుసుకుందాం)

It is 10 AM.
It is late.
It is time to close the shop.
It is Monday.
It is summer.
It is very near.
It is not heavy.

b. *impersonal verbs* (మనుష్యులకి చెందనివి) it తో వుంటాయి.

It rains It snows. It is thundering.

c. *clauses subject*గా వున్నప్పుడు itని predicate ముందు వుంచి వాక్యం చెప్పొచ్చు.

That he arrives late is certain.
It is certain that he arrives late.
Where he roams is a mystery
It is a mystery where he roams.

d. *The idea referred to by 'it' may also be expressed by a preceding word-group (esp. 'to' infinitive*తో వున్నప్పుడు) or by a clause or a sentence.

I am trying to overcome this hurdle - you won't find it easy.

I hope you understand that this is a matter of months, not weeks? – yes, you've made it quite clear.

e. *To stress or emphasise the noun - noun*ని నొక్కి చెప్పడానికి.

It was he who helped me. (మామూలుగా He helped me)
It was in Delhi that I met him. (మామూలుగా అయితే I met him in Delhi)

Personal Pronouns ముగించేముందు వొక idiomatic usage గురించి చూద్దాం. వాక్యంలో first, second and third person pronouns మూడూ subject స్థానంలో వున్నాయనుకోండి. అప్పుడు యేది ముందు, యేది వెనక వస్తాయో తెలుసుకోవడమే అది. you తర్వాత he వాడాలి.

I, you and he have done the work అనకూడదు.
You, he and I have done the work అనాలి.
He and you are both welcome అనకూడదు.

You and he are both welcome అనాలి

అయితే I and Gopal have spoiled this work అనాలి యేమంటే, యిక్కడ fault ని admit చేసే విషయం కాబట్టి

అదేరకంగా, 'than' తర్వాత వచ్చే pronoun case విషయమూనూ. మన భాషలో వాడే తీరుని బట్టి అదే రకంగా మనం ఇంగ్లీషులో వ్యవహరిస్తూవుంటాం. అది సరికాదు.

He is richer than me అని Indians వాడుతూ వుంటారు you are abler than him అటూవుంటారు కాని యీరెండు సందర్భాల్లోనూ caseని బట్టి,

He is richer than I యిక్కడ 'am rich' అనేది లోపించింది

You are abler than he (is able అని అర్థం)

Pronoun case ఆ సందర్భంలో ప్రయోగాన్నిబట్టి వుంటుంది.

## Possessive pronouns

Nounsకి లాగానే pronounsకీ possessive case వుంటుంది వీటి రూపాలు పైన పట్టికలో చెప్పుకున్నాం

అయితే అక్కడ రెండేసి రూపాలు కనిపిస్తున్నాయి కదా my, mine; your, yours అంటూ

Possessive కి రెండు రూపాలు వుండడం యేమిటి?

My, your, his/her/its, our, their అనేవాటిని adjectives లాగా వాడడం కనిపిస్తుంది. అంటే adjective దాని తర్వాత వచ్చే nounని qualify చేస్తున్నట్టు యివీ చేస్తాయి. అంచేత యివి genitives of the corresponding personal pronouns.

This is my book.

It is your turn.

Possessive pronouns "mine, yours, his, hers, its, ours, theirs" అనేవి యిలా adjectives లాగా వుండవు. వీటితర్వాత యిక noun రాదు.

This is my book - yes, it is mine

It is your turn - mine is over.

యిక్కడ 'mine' అనేది 'అc, నా పుస్తకం, నావంతు అయిపోయింది' అని తెలియచేస్తాయి.

This radio is mine అనాలి కాని This radio is my radio అనకూడదు, అదేరకంగా This is mine radio అనీ అనకూడదు

Possessive Pronoun adjectiveగా వున్నప్పుడు తర్వాత "own" అనేమాట ownership stress కోసం రావచ్చు, వొకరకంగా contrastని తెలియచేసేటందుకూ రావచ్చు.

I will not be dictated to in my own house

My own kith and kin to rebel!

Why don't you use your own pen instead of always borrowing mine?

"own"కి ముందు ఎప్పుడూ possessive pronoun వుండాలి, అంటే పైన చూపినట్టు my, your అనేవి అయితే own brother, own sister అనేలాంటివాట్ల exception, ఒకే తల్లిదండ్రుల బిడ్డలైతే అంటే half-brother, half-sister కాదని (మనం తెలుగులో కూడా అన్నదమ్ములని అన్నట్టు) 'own cousin' అని ఇంగ్లీషులో అంటారు, అంటే first cousin అని (ఇది విషయం గుర్తుంచుకోవాలి యీ బంధుత్వాల్ని తెలియచేసే పదాలు తెలుగులో వున్నట్టు ఇంగ్లీషులో వుండవు, తెలుగు వ్యవహారానికి ఇమడవు)

## Demonstrative pronouns

ఇంగ్లీషుభాషలో నాలుగు demonstrative pronouns commonగా వాడకంలో వున్నాయి Demonstrative pronoun అంటే ఫలానా అని నిర్దేశించేది

Look at this!

Give me that (pen)

Are those your children?

These are my friends.

యీ బొమ్మ, ఆ పెన్ అని నిర్దేశిస్తున్నాయి this, that అనే పదాలు అదేరకంగా బహువచనంలో those, these అపని చేస్తున్నాయి

యీ నాలుగూ – this, that, these, those అనేవి demonstrative pronouns.

యివే పదాలు demonstrative adjectives గానూ వున్నాయి. వాటికీ, pronouns కీ తేడాయేమిటి? Adjectives వాటి తర్వాత వచ్చే nounని quality చేస్తాయి. అంటే యీ పదాలు కూడా adjectives లాగా వాటి తర్వాత వచ్చే nouns ని సూచిస్తాయి. యీపదాల తర్వాత noun వున్నా, లోపించినా యివి demonstrative adjectives గా వుంటాయి. I want this pen, that book is mine, this book is better than that (book)

యిలా nouns లేకుండా ఈ this, that, these, those అనేవే ప్రత్యక్షంగా ఆ వస్తువుని తెలియజేస్తూవుంటే demonstrative pronouns అవుతాయి.

This is my house

The students of our college are better than those of your college.

యీ this, those అనేవి demonstrative pronouns. This, these దగ్గర్లో వున్నవాటికి, that, those దూరంలో వున్నవాటికి వాడతారు.

ఇలా Nounని సూచించడానికే కాక, అంతకుముందే ప్రస్తావించిన nounని refer చేసేటట్టు కూడా వాడతారు

He stopped telling her his story, 'why is he telling me all this', she wondered

యీ మాదిరి demonstrative pronounsగా 'such' 'so' అనేపదాల్ని కూడా వాడతారు

'Such'ని యిలా వర్గీకరించడం అర్థాన్నిబట్టి యిది kind or degreeని తెలియచేస్తుంది Such men are dangerous

'So' అనే మాటని to say, to tell, to think, to hope, to suppose, to believe, to be afraid వగైరా క్రియల తర్వాత వాడతారు ఆ సందర్భాల్లో యిది (so) అంతకుముందే వచ్చిన వాక్యానికో, clause కో మొత్తంగా వర్తిస్తుంది.

Will you be coming to night? - I think so

## Relative Pronouns

Relative pronouns అంటే అంతకుముందు వున్న నామవాచకాలకి మారుగా వచ్చేవి అని. ఓ వాక్యంలో వొక noun వుందనుకోండి, తర్వాత వాక్యంలోనూ అదే nounకి ప్రస్తావన వుందనుకోండి యీరెండు వాక్యాల్ని కలిపే సందర్భం వస్తే అప్పుడు relative pronouns వస్తాయి అలా కలపడానికి conjunctions వున్నాయికదా, మరి ఈ relative pronouns యేమిటి, యెందుకు అనిపించవచ్చు. Conjunctions రెండు వాక్యాల్ని కలుపుతూ వున్నా అవి అంతకుముందు వచ్చిన nounsకి మాత్రమే వర్తించేవికాదుకదా Relative pronouns మాత్రమే అలా వర్తించేవి అవుతాయి

ఉదాహరణకి "There is no rose but has a thorn" అనేవాక్యంలో but వుందికదా. యిది relative pronoun అవుతుంది. యిదే 'but' conjunctionగా కూడా వుంది. యీరెండింటికీ తేడా యేమిటీ అంటే మామూలుగా వాడితే 'but' conjunction, negative తర్వాత వాడితే relative pronoun.

రెండు వాక్యాల్ని conjunctions మాదిరీ కాకుండా, nounsకి వర్తించేటట్టు కలిపే ఈ relative pronouns ఎనిమిది వున్నాయి

who, whom, whose, which, that, what, as, but వీటిలో who, whose, whom, which, what, అనేవాటిని చూడండి. వీటిని ప్రశ్నలు వెయ్యడానికీ వాడతారు కదా? మరి ఆ సందర్భానికీ, relative pronounsగా వాడ్డానికీ తేడాయేమిటి? తేడా అల్లా questionsగా వాడినప్పుడు యివి Interrogative pronouns అవుతాయి. రెండు వాక్యాల్ని కలిపే సందర్భంలో relative pronouns అవుతాయి

Who are you? (Interrogative pronoun)
I know who you are. ( Relative pronoun)

యిలా వొక ప్రశ్నని మరోవాక్యంలో కలిపేటప్పుడు ప్రశ్నబదులు statement వస్తుంది. Direct, indirect speech లో యీ విషయం ఇంకా బాగా తెలుసుకుందాం.

పైన చెప్పుకున్న relative pronounsలో who, whomలని యెప్పుడూ మనుషులకి మాత్రమే వాడతారు. whose మనుషులకీ, వస్తువులకీ వాడతారు. యీ మూడూ యేయే సందర్భాల్లో వస్తాయి?

who - subjective form (కర్తబదులు)
whom - objective form (కర్మబదులు)
whose - adjective form (his, her, its, them బదులు)

అంటే యెలా వస్తాయి? ఒక వాక్యాన్ని యింకో వాక్యంతో కలిపేటప్పుడు మొదటి వాక్యంలోని చివరి పదం రెండో వాక్యంలోని మొదటిపదం వొకే దానికి చెందితే రెండో వాక్యంలో వచ్చే personal pronouns subjective form బదులు who వాడాలి. మనుషులైతే who, వస్తువు అయితే which వస్తుంది రెండోవాక్యంలో objective form. అయిన me, us, you, him, her, them బదులు whom వాడాలి. Adjective form అయితే (my, our, your, his, her, their) whose వస్తుంది.

| | |
|---|---|
| Subjective form | I have a friend. He is kind.<br>I have a friend who is kind. |
| Objective form | He loved a girl. He married her.<br>He loved a girl whom he married. |
| Adjective form | He married a poor girl. Her parents were dead.<br>He married a poor girl whose parents were dead. |

ఇక్కడ యింకో విషయం గుర్తుంచుకోవాలి. who, whose, whom, which బదులుగా that ఉపయోగించవచ్చు. వొకోసారి రెండింటినీ వదిలిపెట్టచ్చు.

The man who came to meet you, will come again.
The man that came to meet you, will come again.
(యిలాంటి ఉదాహరణలు యింకా చూసి నేర్చుకోండి)

యిదేరకంగా superlatives లో, all, everything, everyone, nothing, nobody, much, little లలో వచ్చే who, whom, which ల బదులు that వాడతారు. This is the best book that I have read.

All is well that ends well.
Everything that he did is useless.

ఇప్పుడు అసలు యీ ఎనిమిది relative pronouns నీ యెలా వాడతారో విడివిడిగా చూద్దాం.

## Who

రెండు వాక్యాల్ని కలిపేటప్పుడు రెండవ వాక్యంలోని pronoun మొదటి వాక్యంలోని nounని నిర్దేశిస్తూవుంటే ఆ pronoun బదులు 'who' వస్తుంది, అంటే ఆ pronoun subjective caseలో వున్నప్పుడు

*I know the man. He wrote this book*

దీన్ని కలిపితే I know the man who wrote this book అవుతుంది. రెండోవాక్యంలోని 'he' మొదటివాక్యంలోని 'the man' అనే nounని చెందుతుంది అంచేత, రెండోవాక్యంలో subjective caseలో వున్న 'he' బదులు 'who' అనే relative pronoun వస్తుంది. యీ 'who' ఆ 'man'ని సంబంధించి వుంది కాబట్టి 'who' అనేదానికి 'man' *antecedent* (అంటే ముందు వచ్చింది) అవుతుంది యీ antecedent తర్వాత relative pronoun వస్తుంది

అంటే relative pronoun antecedentకి refer చేస్తుంది కాని రెండువాక్యాల్నీ కలుపుతుంది. అంచేత యీ relative pronoun antecedentతో numberకి, genderకి, personకి సంబంధించి agree అవుతూ వుంటుంది Caseతో agree కానవసరంలేదు.

## Whom

Objective caseలో pronoun రెండవవాక్యంలో వుంటే, relative pronoun దాన్ని refer చేస్తూవుంటే ఆ relative pronoun objective case 'whom' వస్తుంది

You sent a boy for the interview. He will be appointed.

యీ రెండింటినీ కలిపేటప్పుడు,
The boy, whom you sent for the interview will be appointed

యీవాక్యంలో 'whom' relative pronoun. దీనికి ముందు వచ్చిన noun 'boy'. మొదటివాక్యంలో 'sent'కి object. అంచేత objective caseలో వుంది కాబట్టి objective caseలో వుండే relative pronoun రూపం whom వాడాలి.

యింకో ఉదాహరణ చూద్దాం.
He is our Lecturer I was talking about him

యీ రెండింటినీ యిలా కలపవచ్చు.
He is our Lecturer about whom I was talking.
He is our Lecturer whom I was talking about

యీవాక్యంలో relative pronoun 'whom'. దీనికి antecedent Lecturer, object of the (లేదా governed by) preposition 'about'

యీ relative pronoun 'whom' అనేది object గానూ, prepositions తర్వాతా కనిపిస్తుంది. Indirect objectగా it is accompanied by 'to'.

This is the man to whom I gave the letter.

## Whose

యిది possessive caseలో వున్న pronounకి వర్తించే relative pronoun. This is the writer. We bought his book.

దీన్ని కలిపితే This is the writer whose book we bought.

'We bought his book' అనే వాక్యంలోని hisకి, కలిపిన వాక్యంలోని 'whose' refer చేస్తోంది. 'his' possessive caseలో వుండబట్టి 'whose' అని వచ్చింది.

యీ relative 'whose' thingsకి కూడా వర్తిస్తుంది.

(i) The only words *whose* spelling requires special attention are given here.

(ii) It is a bench. One of its legs is broken.

దీన్ని కలిపితే It is a bench one of whose leg is broken.

## Which

దీనికి వున్న వొక్క మినహాయింపు యేమిటంటే, యిది వ్యక్తులకు వర్తించకపోవడం. The task which confronted him was big.

అయితే వొక descriptionగాని, classificationగాని ఉద్దేశించినట్లయితే వ్యక్తికి refer చెయ్యవచ్చు.

He looked like a doctor – which he was.

యిక relative which తర్వాత వొక noun (అంటే time, size, idea వగైరాల్లాంటివి) main clauseని క్రోడీకరిస్తూనో, దానిలోని భాగాన్ని repeat చేస్తూనో రావచ్చు.

It rained all might, during which time power supply was cut off.

A 5″ × 4″ camera (which size is now popular).

యిదేవిధంగా relative which వొక preceding sentenceకి, clauseకి, లేదా part of clauseకి వర్తించవచ్చు.

The decision was postponed, which was exactly what he wanted.

ఇప్పుడు ఇంకో విషయం గుర్తుంచుకోవాలి ఇలా వాక్యాల్ని కలిపేటప్పుడు antecedent collective nounగా వుంటూ ఆ collective nounలోని personsని ఉద్దేశిస్తూ వున్నట్లయితే, (individuals గురించి వూహాలో వున్నప్పుడు) 'who'ని plural verbతో వాడాలి అలా విడివిడి వ్యక్తుల్ని కాక మొత్తం group దృష్టిలో వున్నట్లయితే 'which'ని singular verbతో వాడాలి.

He joined the party who were walking before him

He joined the party which was in power

ఇలా పై వాక్యాల్లో partyలోని వ్యక్తుల్ని గురించి విడిగా దృష్టిలో వున్నప్పుడు 'who', మొత్తం group దృష్టిలో వున్నప్పుడు which సందర్భాన్నిబట్టి plural, singular verbsతో వాడడం వుంది. అయితే దేశాల పేర్ల తర్వాత which, who రెండు రావచ్చు అయితే verb మాత్రం singularలోనే వుంటుంది.

India, which ... ; India, who ,

రెండు వాక్యాల్ని కలిపేటప్పుడు పై relatives వాడినట్టు, which యెలా వుంటుందో చూద్దాం. ('which'ని personsకి refer చేస్తూ వాడడం వుండదని ముందే చూశాం)

He told me a story It was very interesting

దీన్ని *'which'*తో కలిపి రాయగల పద్ధతులు చూడండి .

He told me a story which was very interesting.

యిది మామూలుగా వున్న పద్ధతి.

Storyతో మొదలు పెట్టి రాస్తే the story which he told me was very interesting.

(ii) The story *which* was told by him was very interesting.

(iii) The story, *which* was very interesting, was told by him to me.

యిక prepositionsతో 'which'ని వాడడంచూద్దాం·

She bought six combs. Two of them were broken.

దీన్ని మార్చిరాస్తే,

She bought six combs, of which two were broken. (లేదా two of which were broken)

(ii) The house is mine I live in it.

దీన్ని కలిపితే The house in which I live is mine

Which లేకుండా The house that I live in is mine అనీ, The house I live in is mine అనీ రాయచ్చు

# That

Relative pronoun 'that'ని ఇంగ్లీషుభాషలో who, whichలకి పక్కనే వాడడం వుంది. అయితే who, whichలతో that మూడురకాలుగా విభేదిస్తుంది, అంటే that కీ, వాటికీ తేడావుంది.

(i) 'That' restrictive clausesలో తప్పకుండా వస్తుంది. (clauses లో restrictive అంటే antecedentకి referenceని restrictచేసేది, అలా referenceని restrict చెయ్యకుండా యింకా further information యిచ్చేది continuative or amplifying clause.)

(ii) 'That' personal as well as non-personal antecedentsని refer చేస్తుంది.

(iii) 'That'కి యెప్పుడూ preposition precedingగా వుండదు, యిది clauseని endలో prepositionతో open చేసినా.

యిక భాషావిభాగంగా యిది relative pronounకీ, conjunctionకీ మధ్యలో వుంటుంది.

'That' is specially used with reference to persons in clauses that are distinctly classifying, consequently in such as define an antecedent qualified by a superlative or by 'any' or only.

ప్రత్యేకంగా వర్గీకరిస్తూ, అరకంగా antecedentని, అదిగనక superlativeతోనో, 'any' 'only' అనేవాటితోనో qualify అవుతూ వుంటే, 'that'ని specialగా వాడాలి.

Gandhiji was a leader that could lead the nation.
Mary was one of the greatest philosophers that ever lived.
Call Ramu, or any other boy that was there.

(iv) Nominal predicate functionలో 'who'ని వదిలిపెట్టి 'that'ని వాడడం వుంది. అయితే 'that' restrictive clauseగా వుంటేనే యిలా వాడడం.

I let him have it - fool that I was - without asking for a receipt.

(v) antecedent personనీ, thingనీ రెండింటినీ denote చేసే సందర్భంలో 'that'ని వాడతారు.

The men and manners that he describes will be unfamiliar to most of his readers.

యిక యీకింద చెప్పుకునే syntactic variants వుండనే వున్నాయి; అంటే యిన్ని విధాలుగా అదే భావాన్ని వ్యక్తం చేస్తూ వాక్యాల్ని రాయచ్చు.

This is the book of which I spoke.
This is the book which I spoke of.

This is the book that I spoke of
This is the book I spoke of

ఇప్పుడు 'that' అనే యీ relative pronoun subjectగా, objectగా వున్న వాక్యాల్ని మరోసారి చూద్దాం యీపైన చెప్పుకున్న వాక్యాల్లో వున్న విషయమే యిది కాని సర్తిగా వుండేందుకు క్రోడీకరించుకుందాం

(i) This is the book. It costs ten rupees. యీ రెండు వాక్యాల్ని కలిపితే 'This is the book that costs ten rupees' అని that తో వాక్యం వచ్చింది

(ii) This book is his It costs ten rupees అనే యింకోవాక్యం చూద్దాం. దీన్ని thatతో కలిపి The book that costs ten rupees is his అనిగాని, It is his book that costs ten rupees అనిగాని రాయచ్చు.

యీ వాక్యాల్లో వున్న 'that' relative pronoun 'costs' అనే verbకి subject

యిక object యెలా వుంటుందో చూద్దాం

This is the book. I bought it yesterday.
యీ రెండోవాక్యంలోని 'it' book ని refer చేస్తోంది bought కి object.

This is the book that I bought yesterday

యిక్కడ 'that' bought అనే verbకి object. Objectగా that వుంది కాబట్టి, This is the book that I bought it yesterday అని మళ్లీ 'it' ని ఉపయోగించకూడదు.

## What

*'What'* అనగానే మామూలుగా interrogative గుర్తువస్తుంది అధికశాతం ప్రశ్నలు what, whoం తోనే మొదలవుతాయి కాబట్టి, వాటి అర్థం ప్రశ్నార్థకంగా వుండబట్టీ అది వింత కాదు అయితే interrogative 'what'కీ, relative 'what'కీ తేడా యేమిటి? నిజం చెప్పాలంటే రెండింటికీ తేడా చాలా సన్నని పొరగా వుంటుంది.

I asked him what he had found
He gave me what he had found.
యీ రెండింటిలోనూ మొదటిదాంటో interrogative meaning బాగా వుంది.

అర్థం కనక స్పష్టంగా non-interrogative అయితే 'what' వొక independent relative గా చెప్పుకోవచ్చు. Independent relative అంటే antecedent లేకుండా అని. యిది subject clause ని, object clause ని, predicate clause ని, ముందు preposition వుండే clauseని introduce చేస్తుంది

What surprised me most was that he didnot seem to have any luggage

He gave me what he had found.

But that is not what you promised us!

After what you have told me I think you ought to see a doctor

యీ వాక్యాలలో వున్న 'what' relative pronoun

Relative 'what'ని attributiveగా వాడవచ్చుంది, అంటే nounకి ముందు అయితే ఆ noun మామూలుగా వస్తువుని సూచిస్తుంది వాటి సందర్భంలో ఆ అర్థం depreciatoryగా (తక్కువగా) వుంటుంది

I shall receive what letters I please.

I gave him what help I could

యీ depreciatory meaning 'little' అనే పదంచేర్చడం ద్వారా వెల్లడి కావచ్చు

I gave him what little help I could

పైన 'which' గురించి చెప్పుకునేటప్పుడు, అది వొక preceding sentenceకి, clauseకి, లేదా part of a clauseకి వర్తించవచ్చని చూశాం అదేమాదిరే what కూడా. అయితే 'what' preceding కాక following clauseకో, part of a clauseకో refer చేస్తుంది.

Yes, I have the letter, and, what's more, I mean to keep it.

యిక who, which, what అనేవాటిని 'ever'తో compound (కలపడం) చెయ్యడంవుంది. యివి noun clauseని introduce చేస్తాయి, Adverbial clausesనీ చేస్తాయి.

Whoever said so, it is wrong.

The result will be unsatisfactory, whichever side wins

Do whatever you like

The Indian parties have lost whatever claim they had to speak for the people of India.

యిదికాక, whateverని 'at all' అనే అర్థంలో negative contextలో nounకో pronounకో జతచెయ్యొచ్చు.

There is no doubt whatever about it.

యిక ఆఖరిగా యింకోవిషయం చూసి 'what'ని ముగిద్దాం. వాక్యంలో 'what' స్థానంలో 'that which'ని వుంచి స్పష్టంగా అర్థాన్ని గ్రహించవచ్చు.

Show me what you have written అన్న వాక్యం తీసుకోండి. యిందులో వున్న 'what' బదులు 'that which' వాడి 'show me that which you have written' అని మార్చవచ్చు.

## But

Relative pronouns రెండువాక్యాల్ని కలుపుతాయని కొండగుర్తుగా అనుకున్నాం conjunctions (సముచ్చయం) కూడా అదే పనిచేస్తాయి కదా; and అనేది యిందుకు మంచి ఉదాహరణగా కూడావుంది. 'But' కూడా అలాంటి conjunction function నిర్వహిస్తుంది మరి relative pronounగా వుండడం యేమిటి? నిజానికి వొకే మాట అనేక రకాలుగా వాడుకలో వుండచ్చు. 'But' conjunction గానేకాదు adverbగా, prepositionగా కూడా వుంటుంది ఆ వివరాలు ఆయా సందర్భాల్లో చూద్దాం. ప్రస్తుతానికి but వాక్యంలో relativeగా యెలా వుండేదీ చూద్దాం. వాక్యంలో negative తర్వాత 'that not' అనే అర్థం యిచ్చేటప్పుడు 'but' relative pronoun అవుతుంది సామాన్యంగా కనిపించే ఉదాహరణ 'there is no rose but has a thorn'. అంటే there is no rose that has not a thorn అని

## As

'But'కి లాగానే asకీ చాలా uses వున్నాయి అయితే relative pronoun వర్గీకరణకింద యెలా వుంటుందోనన్నదే యిక్కడ చూడాలి

He is very tall as are his brothers.

యిక్కడ 'his brothers also'కి బదులు 'as' వచ్చింది.
This is not such a fine place as expected.
This is not such as expected

యిప్పుడు గమనించండి: such తర్వాత as తప్ప మరే relative pronoun రాదు.

అదేరకంగా as తర్వాత as తప్ప మరే relative pronoun రాదు He collected as many books as he could

అదేరకంగా 'same' తర్వాత as, that తప్ప మరే relative pronoun రాదు. This is the same news as I received.

I received some news. This news also is the same అనే వాక్యాన్ని same asతో కలిపితే వచ్చిన వాక్యం పైది

అదేరకంగా The world has changed It is not the same now అనే వాక్యాన్ని కలిపితే, The world is not the same now as before అని వస్తుంది. యిక్కడ "as it was" before అన్నమాట.

## Interrogative pronouns

*Interrogative* అంటే 'ప్రశ్నలు అడిగే' అని అర్థం వాక్యంయెన్ని రకాలుగా వుంటుందో మొదట్లో చూసేటప్పుడు Interrogative sentenceలుంటాయని తెలుసుకున్నాం. అక్కడ ప్రశ్నలు అడిగే మాటలు, క్రియలు యేమిటో స్థూలంగాచూశాం యిప్పుడు 'interrogative pronouns' యేమిటో చూడాలి

అసలుకి యివి మూడు who, which, what, యివి మూడూ relative pronounsలో కూడా దర్శనమిచ్చాయి మరి అక్కడికీ, యిక్కడికీ తేడాయేమిటి? Interrogative pronouns మూడు అని చెప్పినా whom, whose రూపాలు కూడా వుండడంతో లెక్కకి అయిదు తేలతాయి. ('case'ల విషయానికి వచ్చినప్పుడే who యీ రూపాలలో వుంటుంది కాని అసలురూపం who మాత్రమే.)

'who' వ్యక్తులగురించి అడిగేటప్పుడే వస్తుంది. (అయితే సందర్భవశాత్తూ) domestic animals విషయంలోనూ వాడతారు eg (to a dog) who did that?

Who did that?
Who is that knocking?
Do you know who did it?
Do they know who we are?

'who' ని exclamatory sentences లో వ్యతిరేకార్థక ద్యోతకంగా వాడడం వుంది.

Who would have thought it!
("యిలా అవుతుందని యెవళ్లన్నా అనుకున్నారా!" అంటే యెవళ్లూ అనుకోలేదని!)

'who' subjective case కి వస్తుంది 'whom' objective case కి వస్తుంది. 'whose' possessive case కి వస్తుంది

Interrogative అయినప్పుడు యీ case గొడవేమిటి అనిపించవచ్చు. వాక్యం యేదయినా subject, predicateలు తప్పవుకదా. అంచేత యీ caseలూ తప్పవు

Whom did you select?
Of whom are you thinking?

అయితే యీరెండవ వాక్యంలాంటి చోట్ల, spoken English languageలో prepositionని predicate తర్వాతకి చేర్చి మాట్లాడ్డంవుంది. ఆ సందర్భంలో 'who are you thinking of? అని వుంటుంది వాక్యం

Indirect objectగా 'who', 'whom' వున్నప్పుడు 'to' అనే preposition వస్తుంది.

To whom did you give the letter?
Whom did you give the letter to?

యిక genitive 'whose'

Whose pen is this?
Whose is this pen?

యీ మూడింటినీ who, whom, whoose వ్యక్తులని (persons) ఉద్దేశించినప్పుడే వాడతారు.

**తర్వాత which :**

దీన్ని వ్యక్తులకీ, వస్తువులకీ కూడా వాడతారు. యీ 'which'కి objective caseలో ప్రత్యేకరూపం లేదు, (whoకి whomలాగా) genitive case రూపమూ లేదు whoకి whoseలాగా) "It assumes a group, and implies a contrast between the members of the group that are meant and those that are not meant – or to use an old, if incomplete, definition, it selects one or more out of a limited number" అని వొక grammarian రాశాడు. యింత వివరణలో మనకి వొక విషయం బోధపడితేచాలు : ఒక group వుందనుకోండి, అందులో కొంతమందిని ఉద్దేశించినా, వొక పరిమిత సంఖ్యనుంచి యెంచుకోవడం వున్నా 'which'ని వాడతారు.

Which of these is your brother?
Which way shall we go?
Which chapter shall we read?
He knows which side his bread is buttered.

యీ 'which' ని objective case లో వాడితే (ప్రత్యేకంగా దీనికారూపం లేదు కాబట్టి) యిలా వుంటుంది:

Which of them do you like best?
In which of these houses do you live?

ఇంగ్లీషు మాతృభాషకాని foreign students 'which'ని విశేషణంగా వాడకూడదని వ్యాకరణవేత్తలు సలహా యిస్తారు. యేమంటే అర్థం clearly selectiveగా లేకపోతే ఇంగ్లీషువాళ్లు what వాడతారట.

Will you decide what men shall live, what men shall die?

యిక్కడ 'which'వాడితే limited number అన్న అర్థం వస్తుంది. అదీగాక "what" collective అయితే, which individualize చేస్తుంది. యిప్పుడు ఆ 'what' గురించి చూద్దాం.

## What

"what" కూడా వొకటే రూపంతో వుంటుంది. యిది వస్తువులు, వృత్తులు మొదలైనవాటికి సంబంధించి useలో వుంది.

What is your name?
What do you call that flower?
What are the best books on this subject?

ఒక వివరణనో, వర్గీకరణనో యిచ్చేటప్పుడు వ్యక్తుల్ని నిర్దేశించేందుకు whatని వాడతారు.

What is man?
What is he - a doctor?

వొక వస్తువో, వ్యక్తో యే తరహాకి చెందుతారో తెలియచేసే సందర్భంలో 'what kind of' 'what sort of' అని ఇంగ్లీషు వాడకం వుంది.

What kind of man is he?
(యిదే భావాన్ని what is he like? అనీ చెప్పొచ్చు)
What sort of fruits are those?

యిదే రీతిగా 'what' ని exclamatory sentences లో వాడడం వుంది.

What a fool I am !
What a pity !
What nonsense !

యిక 'what'ని ఆశ్చర్యార్థకంగా నిరసనని తెలియచేసేటప్పుడు interjectionగా వాడడం వుంది.

What ! No sweets on your birthday?

Interrogative pronoun గురించి యింకోమాట చెప్పుకుని ముగిద్దాం.

Who is he? అంటే యెవరు, పేరేమిటి వగైరా.
Which is he? యీ వున్నవాళ్ళల్లో యెవళ్ళోనని.
What is he? యేంచేస్తూ వుంటాడు, వృత్తి యేమిటి అని.

## Distributive pronouns

Each, every, either, neither అనేవి యీ distributive pronounsగా వున్నాయి. Distributive అంటే యేమిటి? వొక సందర్భంలో వొక్కొక్కటిగానే పరిగణించే వ్యక్తులకిగాని, వస్తువులకిగాని వర్తించేవి అన్నమాట 'యీ పళ్లు తలా వొకటి తీసుకోండి' అని తెలుగులో అన్నట్టు Take one fruit each' అని ఇంగ్లీషులో చెప్పినప్పుడు "each" వొక్కొక్కళ్లనే ఉద్దేశిస్తోంది.

Each, every అనే రెండింటికీ తెలుగులో అర్థంవొకటే. కాని ఇంగ్లీషులో అలాకాక విభిన్న అర్థాలున్నాయి. "every" అనేపదానికి యించుమించు all అని అర్థం. సమూహంలో ప్రతి వొక్కటి అని చెప్పడానికి every వాడతారు. అందర్లో వొక్కొక్కరి గురించి ప్రత్యేకంగా చెప్పడానికి 'each' వాడతారు.

All Sundays are holidays - Every Sunday is a holiday.

'every' is used attributively, అంటే విశేషణంగా.

వొక నిర్దిష్టమైన groupలోనో, లేక indefinite groupలోనో వున్న విడివ్యక్తుల్ని, అంశాల్ని సమాహారం చేసేదిగా వుంటుంది. యెప్పుడూ రెండింటికంటే యెక్కువ వున్న వాటినే సూచిస్తుంది.

Our country expects everyman to do his duty.

Every word of it is false.

యిది time, spaceలలో recurrence, అంటే మళ్లీమళ్లీ రావడాన్ని, సూచించే మాటల ముందు వస్తుంది.

They come here every other day (or) every three days (అంటే every third day)

every now and then (ప్రతిసారీ, మళ్లీ)

యింతేకాకుండా 'all possible' అనే అర్థంలో abstract meaningలో వున్న noun ముందు కూడా వస్తుంది.

He had every reason to be satisfied.

There is every indication that it is a cooked-up story.

Every లాగానే each కూడా attributiveగా వాడుకలో వుంది. అయితే వొక definite groupలో membersని one by oneగా, without adding them up ప్రయోగంలో వుంటుంది. attributeగా వాడకం వున్న 'of'తో అలా కాకుండానూ వుంటుంది

Each student has a separate room.

studentకి ముందు attributiveగా వుంది.

He greeted us and talked with each of us.

Each and everyలాగా కాకుండా either (అంటే రెండింటిలో యేదో వొకటి) negative, interrogative contextsలో వస్తుంది, affirmative contextsలో వాడినప్పుడు 'no matter which' అనే అర్థం వుంటుంది.

There is no lamp at either end.

Have you seen either of them?

Either of your can go

Eitherని alternativeని నిర్దేశించడానికి adverbialగా వాడతారు.

He is either drunk or mad

Either he or she must attend the function.

యిలా alternativeగానే కాకుండా negativeలో 'any more than the other'అనే అర్థంలోనూ, 'for that matter' అనే అర్థంలోనూ కూడా eitherని వాడతారు.

If you do not go, I shall not either.

There was once a time, and not so long ago either. (for that matter అని)

Either 'యేదో వొక' అనే అర్థంలో వుంటే neither, "not either, not the one or the other' అంటే 'యేదీకాదు' అనే అర్థంలో వుంటుంది.

Neither of these statements is correct.

Neither of them is qualified for this job.

Neitherని adverbialగా alternativeని deny చేస్తూ వాడతారు.

He is neither drunk nor mad.

పైన either....orలో యేదోవొకటి అయివుండాలనే అర్థంలో 'he is either drunk or mad' (వాడు తప్పతాగేనా వుండాలి, లేదా పిచ్చివాడైనా అయివుండాలి) అని అర్థం వస్తే యీ statementలో అదీకాదు, యిదీకాదు అనే అర్థం వస్తుంది. అదేరకంగా 'Neither he nor she can attend' అంటే యెవళ్లూ రాలేరని.

Destributive pronouns తర్వాత వచ్చే క్రియలు ఏకవచనంలోనే వుంటాయి, యేమంటే

distributive pronouns ఏకవచనంలో వుంటాయి కాబట్టి

Each of them have spoken అనకూడదు, Each of them has spoken అనాలి.

అయితే either, neither అనేవాటికి plural adjunct గనక వస్తే plural verb వస్తుంది.

Neither of them knows (లేదా know)

Has లేదా have either of them told you?

The houses on either side were beautiful.

పోతే verb, subject agree కావడం సందర్భంలో either..or, neither..nor ప్రయోగం విషయంలో యెలా వుండాలి? రెండూ Singular subject అయితే సమస్య వుండదు. వొకటి singular, యింకోటి plural subject అయితే plural subjectని verbకి దగ్గరస్థానంలో వుంచి plural verb వాడాలి, అది సమంజసం.

Neither she nor her parents are ready for the alliance.

Each, every అనేవాటి విషయంలో నిస్సందేహంగా singular verbనే వాడాలి.

## Indefinite Pronouns

*Distributive pronouns* వొకో సందర్భంలో వొక్కొక్క దానికే వర్తించేవైతే, ఈ Indefinite pronouns ఫలానా అని నిర్దేశించకుండా indefiniteగా, అంటే అనిర్దిష్టంగా, వర్తించేవి. యీ indefiniteness, అంటే అనిర్దిష్టత, మనుషులకి

సంబంధించిగాని, వస్తువులకి సంబంధించిగాని వచనం యేమిటో, గుర్తింపు యేమిటో తెలియచెయ్యకుండా అనేక అంతరాల్లో వుంటుంది 'యెవళ్లో వొకళ్లు రండయ్యా' అని తెలుగులో అంటున్నాం కదా యిక్కడ ఫలానా అని కచ్చితంగా చెప్పడంలేదు. అదేవిధంగా ఇంగ్లీషులో somebody, someone అంటూ ఫలానా అని నిర్దేశించని పదాలున్నాయి

anybody, anyone, anything, everybody, everyone, everything, somebody, someone, something, nobody, no one, nothing, some, none, one లాంటివి Indefinite Pronouns

'some' ని singular గానూ, plural గానూ వాడచ్చు

Singular లో a particular but unknown or unspecified thing or personకి వర్తిస్తుంది; certain quantityకి వర్తిస్తుంది

Some fool has locked the door
Can we have some milk?

Plural లో indefinite numberని తెలియచేస్తుంది
I lived there for some years
Take some more fruits
Some are born great, some achieve greatness

'Any' అనేది negative, interrogative, conditional contexts లో వస్తుంది. 'some', 'any'లకి తేడాయేమిటంటే some కొంత positive meaningతో వుంటే, 'any' negative meaningతో లేకపోతే non-committal meaningతో వుంటుంది. వీటన్నిటికీ ఉదాహరణలు చూడండి

I cannot see any difference between them
Complaints, if any, to be made here
Can we have some milk?
Have you any milk?

'Any'ని comparativeలో negative or interrogative contextలో adverb of degreeగా వాడతారు

That way we returned home without being any wiser.

దీన్ని affirmative contextsలో

Any doctor will prescribe it
He may be here any moment

లాంటి వాక్యాల్లో వాడచ్చు. యిక్కడ 'any doctor' అనేది 'every doctor' అనే అర్థం అందిస్తుంది.

'None' negative meaningనే అందిస్తుంది. యిది ముందేవచ్చిన singular nounకి గాని, plural pronouns కి గాని వర్తించవచ్చు అర్థాన్నిబట్టి Verb singular కావచ్చు, plural కావచ్చు.

None are so deaf as those that will not hear
Sounds there were none
It is none of your business.

Comparative ముందర, so, tooలకి ముందర none వాడచ్చు.

He is none the better for it
I am none so fond of him
They pay none too high

'One' అనేది వొకోసందర్భంలో anyone అనే అర్థాన్నిస్తుంది. దీనికి 'వొక' అనే numerical అర్థమూ వుంది యెలా వాడినా 'one' personsకి గాని, thingsకి గాని – అవి countable అయితేనే – వర్తిస్తుంది Abstract nounsకి, material nounsకీ రాదు.

What can one do, if ill-luck stares in the face?
యిక్కడ 'anyone' అని, యెవళ్లైనా మాత్రం అని

Oneకి యింకా అనేక విధాల uses వున్నా వొకటిమాత్రం 'Indianism' తప్పచెయ్యకుండా గుర్తుంచుకోవాలి. అదేమిటీ అంటే,

'One should love his country' లాంటిది
యిక్కడ 'one should love one's country' అనాలి.

అదేరకంగా 'one must allow oneself a rest from time to time.

యింకా యీవిభాగంలో వున్న Indefinite pronouns అన్నిట్నీ యిలా వివరంగా చూడక్కర్లేదు ముఖ్యమైన వాటిని, వాటి useనీ చూశాం. యిప్పుడు reflexive pronouns చూద్దాం

## Reflexive Pronouns

First person, Second personల Possessive Pronounsకి self (బహువచనంలో selves) అని చేర్చడం ద్వారా reflexive pronouns యేర్పడతాయి Third personలో him/her/themలకి self (selves) చేరి యేర్పడతాయి.

| | | |
|---|---|---|
| First Person | : singular : myself, | plural : ourselves |
| Second Person | : singular : yourself, | plural : yourselves. |
| Third Person | : singular : himself/herself/itself, | plural : themselves. |

oneకి oneself అని వుంటుంది Ourself అనీ వుంది చేసినపని ఫలితాన్ని ఆ చేసినవాళ్లే పొందుతూవుంటే యీ Pronounని వాడతారు అంటే subject, object same personకి refer చేస్తాయి

She made herself some tea.
He hurt himself.

ఒక విషయాన్ని నొక్కిచెప్పేటప్పుడు reflexive pronounని వాడతారు.
I myself went there.
She herself wrote this letter

*Reflexive Pronouns*ని వాడడానికి సంబంధించీ Indianisms వున్నాయి. He went there and enjoyed అనీ, He availed the chance అనీ అంటూ వుంటారు. యివితప్పు

He went there and enjoyed himself.
He availed himself of the chance అనీ అనాలి.

'enjoy' అనే verb తర్వాత object వుండాలి, లేకపోతే reflexive pronoun వుండాలి.

I enjoyed the excursion to Delhi అనిగాని I enjoyed myself very much అనిగాని వుండాలి

'avail', 'absent', 'enjoy', 'apply', 'resign', 'acquit', 'exert', 'oversleep' లాంటి verbsని reflexiveగా వాడితే reflexive pronounని వాడితీరాలి.

అదేవిధంగా వాడక్కర్లేనిచోటా మనం reflexive pronounని వాడుతూవుంటాం. అదీ తప్పే.

He is trying to pose himself as an actor అనడం వినిపిస్తూవుంటుంది. 'Pose' అంటే pretend to be అని. దీనికి reflexive object అక్కర్లేదు.

He is trying to pose as an actor అనాలి

యీ మాదిరే
We kept ourselves away from the party
He qualified himself for the job అనీ అంటూ వుంటారు

We kept away from the party అనాలి
He qualified for the job. అనాలి

Qualify, rest, enlist, break, bathe, dash, keep, move, make, draw, spread లాంటి అనేక verbs కి reflexive pronoun రాదు.

## Reciprocal Pronouns

Reciprocal అంటే పరస్పరంగానని అర్థం. each, every లాంటివి విడి వ్యక్తులకే, వస్తువులకే వర్తిస్తాయని చూశాం.

యీ reciprocal pronouns అలాకాక పరస్పరం వర్తిస్తాయి.

The two boys fought each other

The boys fought one another

అనే వాక్యాల్లో మొదటిదాంట్లో 'each other' (అంటే ఇద్దరిలో వొకళ్లతో వొకళ్లు) రెండవదాంట్లో one another (వొకళ్లతో వొకళ్లు) reciprocal pronounsగా వున్నాయి

each other ఇద్దరు వ్యక్తులకి, one another అంతకంటే యెక్కువమందికీ సంబంధించి వాడడం భాషా సంప్రదాయం

పైన చెప్పుకున్నవన్నీ pronouns యెన్ని విధాలుగా వుంటాయో తెలియచేస్తున్నాయి. యీ తొమ్మిదిరకాల విభజనే కాకుండా సంఖ్యని గురించి, పరిమాణం గురించి తెలియచేసేవీ మరికొన్ని వున్నాయి.

(a) certain, (a) few, (a) little, many, much, most, some, several లాగా మొత్తంభాగాన్ని గురించి చెప్పాలి, సంఖ్యని గురించి చెప్పే two, three లాంటివీ యీవిభాగంలో వున్నాయి

యిప్పుడు pronounsకి సంబంధించిన common errorsని చూసి తర్వాత అధ్యాయానికి వెడదాం

| **In correct** | **Correct** |
|---|---|
| I, you and he have done this work | You, he and I have done this work. |
| Such students who were absent were fined | Such students as were absent were fined. |
| Your's sincerely | Yours sincerely |
| We must now take his leave | We must now take leave of him. |
| This is the table whose price is very cheap | This is the table, the price of which is very cheap |
| Who did you abuse? | Whom did you abuse? |
| Whom do you think got the prize? | Who do you think got the prize? |
| It was him who did it | It was he who did it |
| Who are you speaking to? | Whom are you speaking to? |
| I am glad at my brother coming | I am glad at my brother's coming |
| They have no books of theirs | They have no books of their own |
| Both could not pass the test | Neither of them could pass the test. |
| It is hard to bear your separation | It is hard to bear separation from you |

| | |
|---|---|
| His very sight annoyed me | The very sight of him annoyed me. |
| Who ever does best in the examination he will get a prize | Who ever does best in the examination will get a prize. |
| Either of these books will be suitable for me | Any of these books will be suitable for me. |
| Any of these two boys can come | Either of these two boys can come. |
| The boy is my cousin who stood first in the race | The boy who stood first in the race is my cousin. |
| Each of these boys have done their home-work | Each of these boys has done his home-work. |
| I feel myself ill today | I feel ill today. |
| Myself saw him do this | I saw him do this. |
| It is the system, not the individuual, which I criticise | It is the system which I criticise, not the individual. |
| All but him had fled | All but he had fled. |
| I availed the oppurtunity | I availed myself of the oppurtunity. |
| They enjoyed there | They enjoyed themselves there |
| Let you and I go to the party | Let you and me go to the party. |
| She came with her son and myself | She came with her son and me |
| My rooms are better than my brothers | My rooms are better than those of my brother. |
| Boys should help each other | Boys should help one another. |
| This is mine book | This is my book |
| This is the house whom bought? | This is the house, which I bought. |

* * *

# 5 Adjectives

*Adjectives* అంటే విశేషణాలు. యివి వొక nounని గాని, pronounని గాని qualify చేస్తాయి. ఉదాహరణకి

He is a teacher అన్నామనుకోండి అతని వృత్తి యేమిటో తెలుస్తోందంతే. He is a good teacher అన్నామనుకోండి అతను యెలాంటి teacher అయిందీ తెలుస్తుంది అంటే యీ 'good' అనేమాట, teacher గురించి మనకి విశేషంగా తెలియచేస్తోంది అదేరకంగా Boys came to college, even though it was raining అని చెప్పామనుకోండి యిక్కడ యెంతమందో తెలియడంలేదు. అలాకాక some boys అనో, ten boys అనో అంటే సంఖ్య, number తెలుస్తోంది

యిలా nouns గురించి తెలియచేసేవే విశేషణాలు. Adjectives చాలా రకాలవి వున్నాయి Noun గురించి తెలియచేస్తాయి కాబట్టి వాక్యంలో noun ముందే వుండాలా? అంటే అక్కర్లేదు Adjectivesని వాక్యంలో రెండు రకాలుగా వాడచ్చు. వొకటి attributive రెండు predicative.

అంటే యేమిటి? Attributive అంటే nounకి ముందు వచ్చి దాన్ని qualify చేసేది యీరకంగా వాడిన adjectiveని epithet అనీ అంటారు. అలాకాకుండా, అంటే nounకి ముందే కాకుండా, verbతో బాటుగా వాడితే అది predicative adjective అవుతుంది. అది predicateలో భాగం అవుతుంది. ఉదాహరణకి 'she has sweet voice' అని చెపితే voiceకి sweet attributive అవుతోంది 'Her voice is sweet' అంటే predicative అవుతుంది fond, afraid, ashamed, alive, aware, awake, asleep యిలాంటివి యిలా వాక్యంలో వాడే adjectives యెన్నిరకాలున్నాయి? యేడురకాలున్నాయి. యీ యేడురకాల్ని descriptive adjectives అనీ, limiting adjectives అనీ రెండు తరగతులు చేశారు. మరీ అంత విభజన అవసరమూలేదు, వ్యాకరణంలో మరీ యెక్కువ పారిభాషిక పదాలు చేర్చడం మంచిదికాదు. అంచేత మొత్తంగా యీ యేడింటి గురించీ చూద్దాం.

1. Qualitative, 2. Quantitative, 3. Numeral, 4. Demonstrative, 5 Distributive, 6. Interrogative, 7. Relative.

## 1. Qualitative adjectives

Quality అంటే గుణం. ఆ nounకి సంబంధించిన shapeని, sizeని, colourని, tasteని, conditionని, behaviourని, feelingని, సాధారణంగా అది కలిగించే impressionని తెలియచేసేవి qualitative adjectives. Shape అంటే round, circular వగైరాలు; Size అంటే long, tall, narrow, thick వగైరాలు; Colour అంటే red, white, blue వగైరాలు; taste అంటే sweet, bitter, sour వగైరాలు; condition అంటే good, bad, weak, strong వగైరాలు; behaviour అంటే kind, cruel, gentle వగైరాలు; feeling అంటే hard, smooth, rough వగైరాలు; యిక సాధారణంగా కలిగించే impression అంటే great, attractive, beautiful వగైరాలు.

## 2. Quantitative adjectives

Quantity అంటే పరిమాణం, పరిమితి. Indians eat much rice. We have a little time యీ వాక్యాల్లో much, a little అనేవి పరిమాణాన్ని తెలియచేస్తున్నాయి. అంచేత యివి quantitative adjectives any, no, many, much, some, all లాంటివన్నీ యిలాంటివే.

## 3. Numeral adjectives

'Numeral' అంటే సంఖ్యకి సంబంధించిన అని, numberకి సంబంధించినవి. యీ numberలో definite numberవీ వుంటాయి, indefinite numberవీ వుంటాయి. Definite number అంటే కచ్చితంగా యిన్ని అని. Indefinite number అంటే ఆ లెక్క యెంతో కచ్చితంగాలేని అని. Definite numberలో యెంత సంఖ్యో తెలియచేసే numbers వుంటాయికదా, యివి రెండురకాలుగా వుంటాయి. two hands, five fingers, ten cattle heads అంటూ two, five, ten అనే అంకెలు. వీటిని cardinal numbers అంటారు. యిలాకాక first day, third man, tenth time అంటూ serial order చెప్తాయనుకోండి. అప్పుడీ serial orderని ordinals అటారు యీరెండు విధాలుగానే కాకుండా repeatedగా వుండే సందర్భంలో multiplicative అంటారు. double knock at the door, ten fold increase లాంటివి యీ multiplicative numbers.

## 4. Demonstrative adjectives

ఫలానా అని నిర్దేశించేవి demonstrative adjectives. This, that, these, those, such, same, the, other, anyother, a certain, selfsame లాంటివి అన్నీ demonstrative adjectives.

## 5. Destributive adjectives

each, every, either, neither అనేవి distributive adjectives. each town, every man, either side, neither author లాంటి వాటిలో అయా nounsని సూచిస్తూ వుంటాయి.

## 6. Interrogative adjectives

'Interrogative' అంటే ప్రశ్నించేవని అర్థంకదా. What books do you read? Which boy got the prize. Whose pen is this? లాంటి వాటిలో what, which, whose అనేవి ఆయా nouns ముందు ప్రశ్నలు వేస్తూ వున్నాయి. యివి Interrogative adjectives.

## 7. Relative adjectives

Relative అంటే సంబంధించిన అని అర్థం. Pronouns గురించి చెప్పుకున్నప్పుడు రెండు వాక్యాల్ని కలుపుతూ యివి యెలా పని చేస్తాయో చూశాం. Which, what, whose యిలాంటివి

He waited for a week more within which time he got help.
He took with him what material he had.
This is the boy whose pen was stolen.

**8.** యీ రకంగా విభజించుకున్న adjectives మాత్రమే కాక proper adjectives అని proper nounsతో form అయ్యేవీ వున్నాయి Indian history, Chinese agression, Russian army, English language అనేవి ఉదాహరణలు

**9.** యిక **possessive adjectives** వున్నాయి.

her novel, his book, my pen, their car, its tail లాంటి వాటిలో her, his, my, their, it అనే possessive case pronouns రూపాలు యీ విభజన కిందికి వస్తాయి.

యివికాక emphasis, నొక్కి చెప్పడాన్ని, సూచించే adjectives రూపాలు వున్నాయి.

This is, the very man whom I met,
I saw the same film,
She saw it with her own lyes.

అనే వాక్యాల్లో very, same, own లాంటి మాటలు యీ function నిర్వర్తిస్తున్నాయి.

Whichever, which so ever, what ever, who so ever అనేవి generalizing adjecives. వీటిని సామాన్యంగా యెక్కువగా వాడుతూ వుంటారు.

Whichever way we go, we shall find it.
Whatever plans you make, we shall implement them

Adjectives, విశేషణాలు, యెన్ని రకాలుగా వుంటాయోనన్న విషయమే యిప్పటిదాకా చూశాం. యింత శ్రమపడి యీ వర్గీకరణ పారిభాషిక పదాలు నేర్చుకోవడం యెందుకు? Relative pronounsకి సంబంధించి అంతలా వివరంగా

తెలుసుకునే ప్రయత్నం చేశామంటే అక్కడ వొక ప్రయోజనంవుంది. వాక్యాల్ని కలిపేటప్పుడు, (synthesis) విశ్లేషించేటప్పుడు (analysis) వాటిలో చాలామట్టుకు ఉపయోగపడతాయి. complex sentences వగైరాలకి వాటితో యేర్పడే clauses అవసరం అవుతాయి. మరి adjectives విషయం? ఇంత వివరంగా ఎందుకు? ఎందుకూ అంటే వీటికి సంబంధించి degrees of comparison వుంది. విశేషణాల్లో quality, quantity లాంటి వాటికి తరతమ భేదాలుంటాయి. వాటినే degrees of comparison అంటారు. వొకడికంటే యింకోడు యెక్కువ మంచివాడు, వొకడికంటే యింకోడు యెక్కువ ధనవంతుడు, తెలివైనవాడు, శక్తివంతుడు, పొడగరి. యీలక్షణాలకి సంబంధించిన యెక్కువ తక్కువలు సూచించేవే యీ degrees. వాటి అధ్యయనంకోసమే యీ adjectives గురించి యింతలా తెలుసుకోవడం

అయితే ఆ degrees of comparisonకి వెళ్లేముందు కొన్ని adjectivesని correctగా యెలా వాడాలో తెలుసుకుందాం.

## Some, any

యీరెండింటిలోనూ 'some'ని affirmative sentences లో వాడతారు. 'some'ని కొన్ని, కొంత, యేదోవొక అనే అర్థాల్లో వాడతారు.

I saw a few students going this way.

I want some bread.

Give me some milk.

He wants some book to read.

Interrogative sentencesలో someని వాడతారు, అయితే జవాబు 'yes' అయి వుంటుందన్న వూహతోనే అలా జరుగుతుంది.

Why don't you have some bread?
Will you take some mangoes?
Aren't there some apples on the table?

యీ మూడు సందర్భాల్లోనూ yes అనే జవాబుని expect చేస్తున్నట్టు వుంది

'some'ని numeralsలో కూడా 'సుమారుగా' అనే అర్థంలో వాడతారు

Some fifty students came to the principal
Some sixty workers are engaged here.

యిలాకాక 'any' negative meaningతో వస్తుంది. ఉదాహరణకి

I shall buy some apples అన్నట్టుగా I shall buy any apples అనకూడదు అంటే 'a few' అనే అర్థంలో. 'I shall not buy any apples' అనాలి.

అయితే 'any' ని affirmative sentencesలో 'యేదైనా సరే' (no matter which, who, whom) అనే అర్థంలో వాడతారు

Buy any book (యే పుస్తకమైనా సరే)
Anybody can do that. (యెవరైనా గానీ)
Come anytime you like. (యే వేళైనా సరే)

Interrogative sentencesలో

Have you bought any mangoes?
Are there any vegetables here?

అని వున్నప్పుడు particular జవాబుని గాని negative answerని గాని అనుకోవడం లేదన్నమాట. 'some' విషయంలో 'yes' అనే answerని expect చెయ్యడం మాదిరి.

Negative sentencesలో, లేకపోతే దాదాపు negative గర్భితంగా వున్నప్పుడూ, 'any' యిలా వుంటుంది :

She had not any friends
If you had any sense you would act differently.

యీ రెండవ వాక్యంలో 'యేమాత్రం బుద్ధివున్నా,' if you had any sense, అంటే లేదు అని అర్థం. యిలాంటి వాక్యాల్ని conditional sentences అంటారు.

యీ conditional sentenceలో మాదిరి doubt, uncertainty కనిపించే సందర్భాల్లోనూ 'any' వాడుక వుంది.

If there are any fruit in the market, buy some.
I doubt whether you have any chance.
I don't know whether any of our friends would be there.

'some'కీ, 'any'కీ వర్తించే యీ rules అన్నీ someone, anyone, somebody, anybody, something, anything, somewhere, anywhere అనే వాటికీ వర్తిస్తాయి.

Somebody has come.
Did he go anywhere last week?
There is not anybody there.

**Much, many**

Much అంటే large quantity అని, many అంటే large number అనీ అర్థం. Much quantityకి many numberకీ వాడతారు

Much water has flown under the bridge since then.
Many people attended the function

'Many a' అని యింకో usage వుంది. అంటే many times, one thing అని. దీనికి singular verb వస్తుంది, noun singularలో వుంటుంది. Many a battle is fought for attaining freedom.

అయితే 'a great many', 'a good many'ల తర్వాత బహువచనంలోని noun, verb వస్తాయి A great many (or good many) battles were fought.

**All, whole**

యిక్కడ కూడా 'all' numberకీ, 'whole' quantityకీ వర్తిస్తాయి

All the students were given certificates.
The whole class left the room

**Less, fewer**

'Less' quantityకీ, 'fewer' numberకీ వర్తిస్తాయి
Less luggage, more comfort
. There are no fewer than fifteen girls in the class.

**few, a few, the few,**

'few' negative contextలో వుంటుంది. 'not many' అనే అర్థం His wants are few

I have few coins (no coins అని)

'a few' affirmative meaningనిస్తుంది 'కొంత' 'కొద్ది' అని, అసలులేకుండా అనికాదు.

I have a few coins (కొన్ని వున్నాయని)
A few people can understand this book

'the few' అంటే though not many, 'ఆ వున్నటువంటి' అని.
The few coins I had, helped me in my journey.

**Little, a little, the little**

పైన చూసినట్టే వీటికీనీ 'little' negativeగా, no అనే అర్థంతో వుంటుంది.
I have little hope (no hope of)
You have little sense (no sense)

'a little' అంటే కొంత అని, యిది affirmative.
I have a little hope of getting the job (కొంత ఆశవుంది అని)
'the little'
The little hope I had, helped me. (ఆ వున్నకొంత ఆశ, that much hope అని)

అయితే 'little'ని 'small' అనే అర్థంలో ordinary adjectiveగా వాడడం వుంది, అంటే not great or big, కొంచెం, చిన్న అనే అర్థంలో,
Work a little
Go a little
A little child.

## Degrees of comparison

యిప్పుడు *degrees of comparison* యేమిటో, అవి యెలా యేర్పడతాయో చూద్దాం

తరతమ భేదాల్ని సూచించేవే యివి వొక లక్షణం – అంటే గుణం, quality గాని quantityగాని – పోలికని, తరతమ విభేదాలలో వున్నప్పుడు దాన్ని తెలియచేసే పదం ఆ తరతమ రూపాలతో వుండాలికదా

He is a good student అన్నామనుకోండి. వాడిగురించి మాత్రమే చెపుతున్నామన్నమాట అదే యిద్దరు 'good' students, వొకళ్లతో వొకళ్లు పోలికన వచ్చారనుకోండి ఆ యిద్దర్నీ పోల్చి, యెవళ్లు యెక్కువో, యెవళ్లు తక్కువో చెప్పాల్సి వుంటుంది. యిద్దరికంటే యెక్కువ మందేవున్నప్పుడు కూడా అందర్లోకీ యెవళ్లు యెక్కువో యేమిటో చెప్పాల్సివుంటుంది

పైన adjectives గురించి classify చేసుకుని యెన్నిరకాల adjectives వున్నాయో చూశాం వాటిలో ప్రధానంగా qualitative, quantitative adjectives యిలా comparison కి వుంటాయి

యిప్పుడు ఆ comparisonల రకాలు, వాటికి సంబంధించి adjectives రూపంలో పొందే మార్పులు చూద్దాం

యీ degrees of comparison మూడు రకాలుగా వున్నాయి. వొక వ్యక్తికి సంబంధించో, వస్తువుకి సంబంధించో వున్న లక్షణాన్ని మాత్రమే తెలియచేసేది positive degree.

He is tall, This building is big, This is a sweet fruit, Our teacher is a good man లాంటి వాక్యాల్లో వొక్కొక్కవాటి లక్షణమే వుంది.

యిదే లక్షణం వున్న రెండింటేని పోల్చి చెప్పేమనుకోండి అప్పుడు comparative అవుతుంది He is taller than his brother, This building is bigger than our building. యిక్కడ tall, big అనేవి రూపంలో మారడమే కాకుండా 'than' అని conjunction వస్తుంది. పోలిక చెప్పేటప్పుడు ఆరెండో వ్యక్తిని, వస్తువుని introduce చెయ్యడానికి యిది వస్తుంది. అంచేత than తర్వాత వచ్చే personal pronoun subjective formలో వుండాలి. You are taller than I.

యిద్దరు వ్యక్తులకో, రెండు వస్తువులకో పరిమితం కాకుండా యెక్కువమందికి, యెక్కువ వస్తువులకి పోలిక విస్తరించి చెప్పేటప్పుడు superlative అవుతుంది. He is the tallest of all boys. It is the biggest of all buildings

Superlative degreeలో adjectiveరూపం యింకా మారింది, దానికి ముందు 'the' వచ్చింది, 'of' అనే preposition (సందర్భాన్ని బట్టి among) వచ్చింది

Tall - taller - tallest,
Big - bigger - biggest

అని adjective positive, comparative, superlative రూపాలలో మారడం కనిపిస్తోంది కదా అన్ని adjectives యిలానే మారతాయా, వేరేరకంగా మార్పులు పొందితే – మారడం మాత్రం తప్పదు – యెలా వుంటుంది ఆ మార్పు అనే విషయం చూడాలి.

**Formation of the comparative and the superlative :**

(i) adjective monosyllableతో వుంటే, అంటే ఉచ్చారణలో వొక స్వరంతోవుంటే, comparativeలో -er, superlativeలో -est చేర్చుకుంటుంది

great - greater- greatest ,
tall - taller - tallest ,
high - higher - highest ,
young - younger - youngest

(ii) Adjectiveకి చివర 'e' వుంటే comparativeలో 'r', superlativeలో 'st' చేర్చుకుంటుంది

able - abler - ablest
brave - braver - bravest
wise - wiser - wisest
pure - purer - purest
rare - rarer - rarest

(iii) Adjectiveకి చివర 'y' వుండి, ఆ 'y'కి ముందు consonant వుంటే 'y' i కిందమారి comparativeలో 'er', superlative లో 'est' వస్తాయి.

dry - drier - driest
happy - happier - happiest

అలాకాక ఆ 'y'కి ముందు consonant వుండకపోతే 'y' అలాగే వుండి 'er', 'est' చేరతాయి

gay - gayer - gayest
shy - shyer - shyest (ఇక్కడ y కి ముందు h వుంది కాని రూపం ఇలానే వచ్చింది)

(iv) Adjectiveకి చివర consonant వుండి, ఆ consonant ముందు వొకే vowel వుంటే consonant double అయి 'er', 'est' చేరతాయి.

hot - hotter - hottest
slim - slimmer - slimmest
red - redder - reddest

thin - thinner - thinnest
fat - fatter - fattest

(v) Adjective రెండు syllablesతో వుండచ్చు, అయితే అది er, le, y, owలతో అంతమవుతూవుంటే మామూలుగా 'er', 'est'లు చేరే comparative, superlative రూపాలు యేర్పడతాయి, monosyllable adjectives మాదిరీ

clever - cleverer - cleverest
noble - nobler - noblest
mellow - mellower - mellowest

(vi) Adjective రెండు syllablesతోనో, రెండుకంటే యెక్కువ syllablesతోనో వుంటే ఆ adjective రూపం మారకుండా, దాని ముందు comparativeలో 'more' superlativeలో 'most' వస్తాయి.

beautiful - more beautiful - most beautiful
honest - more honest - most honest
courageous - more courageous - most courageous
fruitful - more fruitful - most fruitful
intelligent - more intelligent - most intelligent

Adjectives యీ మాదిరిగా er, estల తోనో, రూపం మారకుండా more, most చేర్చుకునో comparative, superlativeలతో మారే నియమాలు యివి. అయినా యిలాంటి నియమాలు వర్తించకుండా, ఏ క్రమపద్ధతి లేకుండా, రూపంమారి ఆ degrees యేర్పడే adjectives వున్నాయి అసలా రూపం యెలా యేర్పడిందో నియమాల్నిబట్టి చెప్పలేం అలాంటి వాటిని irregular comparatives అంటారు, వాటిని శ్రద్ధగా పరిశీలించి అధ్యయనంద్వారా గ్రహించాల్సిందే. చాలా సాధారణంగా వాడే 'good' చూడండి.

good - better - best అని comparative, superlative యేర్పడుతున్నాయి భాషావికాసం యెలా జరిగిందో చూస్తేనేగాని యీ మార్పు కారణాలు తెలియవు వ్యాకరణ అధ్యయనంలో అదంతా అతిరిక్తం అంచేత సాధ్యమైనన్ని పదాల్ని పరిశీలించి తెలుసుకుంటే చాలు యిలా వుండే irregular మార్పులలో కొన్నింటిని గమనించండి

| *Positive* | *Comparative* | *Superlative* |
|---|---|---|
| bad, ill | worse | worst |
| much, many | more | most |
| little | less | least |
| far, far, fore | farther, further, | farthest, furthest |
| (దూరం) (movement of time) | | |
| fore | former | foremost, first |

| | | |
|---|---|---|
| late | later, latter | latest, last |
| hind | hinder | hindmost |
| in | inner | inmost, innermost |
| up | upper | upmost, uppermost |
| out | outer, utter, | uttermost, utmost |

యిలా కొన్ని పదాల్ని యిక్కడ చెప్పుకున్నాం అభ్యాసంవల్ల వీటిని గమనించండి.

యిక 'comparative' degree form లేకుండా, positive, superlative forms మాత్రమే వున్న adjectives కనిపిస్తాయి.

northern దీనికి superlative 'northern most' Comparative లో రూపంలేదు.

అలాగే

bottom - bottom most

top - top most

down - down most

యిక యిలా grade చెయ్యలేని adjectives, అంటే comparative, superlativeలుగా చెయ్యలేని adjectives వున్నాయి. unique, right, wrong, square, round, circular, అనే qualitative adjectivesని, perfect, universal, matchless, fullలాంటి వాటిని grade చెయ్యడం హేతుబద్ధంగా కుదరదు. 'He is the most perfect man' అనడం అసంగతం. 'perfect' అంటేనే grade అయిపోయింది, యిక దానికి మళ్లీ comparative వుండదు.

అయితే comparative, superlative degree formsలో వేరే వున్న adjectives కొన్ని రూప సారూప్యంతోనో, ధ్వనిసారూప్యంతోనో కనిపించినా అర్థస్ఫూర్తిలో తేడాగా వుంటాయి అవేమిటో కొన్నింటిని చూద్దాం.

Late - later, latest

latter, last

'later, latest' లు time సూచకాలు

He is later than expected, అనుకున్నదానికంటే ఆలస్యం అని. 'Latest' యిటీవలి, యీక్షణం దాకా అని What is the latest news? పత్రికల్లో 'latest news'కి 'తాజావార్త' అనడం యిందువల్లనే. ఆలస్యం అయిందనే అర్థంలో కాదు.

*'latter'* అంటే వరసక్రమంలో రెండోది అని. రెండువస్తువుల గురించి గాని, యిద్దరు వ్యక్తుల గురించిగాని, రెండుస్థలాల గురించిగాని చెప్పేటప్పుడు ముందరి, తర్వాతి అనే అర్థం యిచ్చే సందర్భంలో 'latter' తర్వాతి అని సూచిస్తుంది

Gandhiji and Nehru were great leaders, the former the father of the nation' and the latter 'Builder of modern India'.

దీనికి superlative, 'last' కడపటిది, చివరిది, గడిచిన అని. The last train leaves at 10-30 P.M., Last year, he was transfered to that place.

farther, further, farthest, furthest

'farther' అంటే distance దూరం; further అంటే మరింతగా, యింకా యెక్కువగా అని. It is farther than I thought.

I shall settle the issue, after receiving further information.
This is the farthest we can go.

## Nearer, nearest, next.

'nearest' relationshipకీ, distanceకీ చెందుతుంది. 'next' position ని గాని order ని గాని తెలియచేస్తుంది.

They are our nearest relatives.
This is the nearest shop.
You are the next person to be interviewed.

## Older, elder, oldest, eldest

యీ రెండూ వయసుగురించి చెప్పేవే. అయితే 'older' వ్యక్తులకి సంబంధించీ, వస్తువులకి సంబంధించీ వాడుకలోవుంటే, elder వొక కుటుంబంలో వాళ్ల వయసుని పోల్చడానికే వర్తిస్తుంది.

Comparative degreeలో 'older' తర్వాత 'than' వస్తుంది. 'elder' తర్వాత than వాడకూడదు. 'older' ని nounగా వాడకూడదు. 'elder'ని nounగా singularలో, pluralలో వాడవచ్చును.

He is older than his friend.
This the oldest building in our town.
She is the elder of the two sisters.
She is elder to me.
His eldest son is an engineer.
Of the three brothers Gopal is the eldest.
The eldest son of his oldest friend.
Respect your elders.

యీ చెప్పుకున్నవి కాక వొట్టి comparative రూపం మాత్రమే వున్న adjectives కొన్ని వున్నాయి. వీటికి positive, superlative రూపాలు వుండవు. వీటితర్వాత 'than' కాకుండా 'to' వస్తుంది. అవి senior, junior, superior, inferior, prior అనేవి. వీటిని తర్వాత వచ్చే personal pronoun objective case రూపంలో వుంటుంది.

He is senior to me.
She is junior to him.
Gold is superior to silver.
Silver is inferior to gold.
This happened prior to that (incident)

యిలాంటి రూపంతోనే వున్న పదాలు మరికొన్ని వున్నాయి. అవి comparativeలాగా వుంటాయి అయితే అవి comparative కావు. వాటికి comparative, superlative forms లేవు. exterior, interior, ulterior, posterior, hinder, major, minor అనేవి యిలాంటివి.

The interior decoration is fine.
I do not have any ulterior motive in helping them.
The posterior generations shall benefit by this plan.

యిప్పటిదాకా formation of comparative and superlativeల గురించి చూశాం అంటే adjectivesకి ఆ రూపాలు యెలా వస్తాయో, కొన్ని adjectives అర్థాలు ఆ degreesలో యెలావుంటాయో చూశాం.

## Interchange of the degrees of comparison

యిప్పుడు positive నుంచి comparative, superlative యెలా చెయ్యాలో, వొక degree నుంచి మరో degreeకి యెలా మార్పులు జరుగుతాయో చూద్దాం. దీన్నే interchange of the degrees of comparison అంటారు. పైన చెప్పుకున్న adjective రూపాల formation యీ interchangeకి ఉపయోగపడేదే. అయితే యీ interchangeలో ఆ adjective రూపం మార్పే కాకుండా వేరే మార్పులూ వుంటాయి.

Positive, comparative, superlative degreeల లోకి వొకదాన్నుంచి వొకదానికి మార్పులు చేస్తున్నామంటే అసలు వాక్యం అర్థంచెడకుండా, అదే అర్థాన్ని యీ మార్పులద్వారా కూడా యివ్వడం అన్నమాట మార్పువల్ల అసలు అర్థానికి ఎసరు రాకూడదు. యీ మార్పులు చేసే విధానమేమిటో యిప్పుడు చూద్దాం.

యిలా మార్పు చెయ్యడానికి ముందుగా అసలు వాక్యం యే degreeలో వుందో చూడాలి. ఆ adjective మూడు రూపాలు యేమిటో తెలియాలి.

ఉదాహరణ వొక superlative వాక్యంతో మొదలుపెడదాం.

(i) America is the richest country in the world. యిది superlativeలో వుంది, adjective 'richest', నియమంప్రకారం దానికి ముందు 'the' వచ్చింది. ప్రపంచంలో అమెరికాయే అత్యంత సంపన్న దేశం అని అర్థం వస్తోంది.

యీ అర్థం చెడకుండా comparativeలోకి, positiveలోకి దీన్ని మార్చాలంటే యేం చెయ్యాలి?

అర్థంప్రకారం అమెరికా ప్రపంచంలోని మిగిలిన దేశాలన్నిటి కంటే సంపన్నమైంది, ప్రపంచంలో మరే దేశమూ అమెరికా అంత సంపన్నమైంది కాదు అని.

పైన superlativeలో వున్న వాక్యాన్ని comparativeలోకి యిలా మార్చాలి ·

(a) వాక్యాన్ని subjectతో ప్రారంభించాలి, యిక్కడ అమెరికా.

(b) తర్వాత verbని యెలాగూ చేర్చాలికదా.

(c) తర్వాత ఆ adjectiveకి comparative రూపం యేమిటో దాన్ని తేవాలి.

(d) ఆ తర్వాత than any other చేర్చాలి

(e) యిక ఆ మిగిలిన వాక్యాన్ని, అంటే superlative degree వాక్యంలో మిగిలిన మాటల్ని, వుంచాలి.

యీ formulaని బట్టి పైన చెప్పుకున్న వాక్యాన్ని comparative degree లోకి మారిస్తే, America is richer than any other country in the world, అని తేలుతుంది. (యీ పద్ధతిలో ఉదాహరణలు అభ్యాసం చెయ్యండి)

యిదే superlativeని positive degree లోకి మార్చడం చూద్దాం, యిదే అర్థంతో వుండాలన్న విషయం ప్రత్యేకం చెప్పక్కర్లేదుగా. అంచేత పైన comparativeకి లాంటి formulaని positive degreeకి కూడా చూద్దాం.

(a) వాక్యాన్ని 'no other'తో ప్రారంభించాలి.

(b) తర్వాత అసలు వాక్యంలోని చివరి భాగాన్ని తేవాలి.

(c) అప్పుడు verb రావాలి.

(d) verb తర్వాత 'so' అని గాని, 'as' అని గాని వుంచాలి

(e) దాని పక్కన ఆ adjective positive రూపం రావాలి.

(f) దాని తర్వాత 'as' అని మళ్లీ చేర్చాలి.

(g) ఆఖర్న subjectని వుంచాలి.

యిప్పుడు యీ formula ప్రకారం పైన చెప్పుకున్న వాక్యం positive degreeలో

No other country in the world is so rich as America
(యిదే పద్ధతిలో మరికొన్ని వాక్యాల్ని అభ్యాసం చెయ్యండి)

యీ మాదిరి వాక్యాల్ని superlative, comparative, positive degreeలలోకి, మార్చుకుంటూ అభ్యాసం చెయ్యండి. యిలా తిరుగులేని superlative వుంటే పై రకంగా మార్పులు చెయ్యచ్చు. అలాకాక "ప్రపంచ సంపన్న దేశాల్లో అమెరికా ఒకటి", America is one of the richest countries in the world అనే అర్థం యిచ్చే వాక్యాలూ వుంటాయి. వాటిని మార్చే పద్ధతినీ తెలుసుకోవాలి.

America is one of the richest countries in the world. యిలా 'one of the' పదబంధం వచ్చిన యీ వాక్యంలో 'countries' అని noun pluralలో వుందని గమనించాలి 'One of the' వచ్చినప్పుడు ఆ తర్వాతి noun సర్వదా బహువచనంలోనే వుంటుంది

యిలాంటి వాక్యాల్ని మిగిలిన degree లోకి మార్చేపద్ధతి చూద్దాం

Adjective మిగిలిన రూపాలు ఏమిటో తెలుసుకోవడం మామూలే కదా. యిక comparative degree లోకి యీవాక్యాన్ని మార్చేటప్పుడు 'than most other' అనే మాటల్ని తేవాలి మిగిలిన నియమాలు పైన comparativeకి వర్తించేవే వుంటాయి. అంటే వాక్యం,

America is richer than most other countries in the world అని వస్తుంది

యిక positive degree వాక్యం 'very few' అనే మాటతో మొదలవుతుంది. మిగిలిన నియమాలు మామూలుగా positive degree లోకి మార్పు చేసేటప్పుడు అనుసరించేవే

Very few countries in the world are so rich as America

యిక్కడ verb బహువచనంలో వుంటుందంతే యీమాదిరి కాక అసలు వాక్యంలో superlative degreeలో negative వుంటే యెలా?

America is not the richest country in the world అని వాక్యం వుందనుకోండి అర్థం మారుతుంది పైన చెప్పుకున్న superlative వాక్యాల్లో అమెరికాయే ప్రపంచంలో సర్వసంపన్నమైనదనీ, సర్వసంపన్న దేశాల్లో అమెరికా వొకటనీ అర్థం వస్తూవుంటే యీ వాక్యంలో ప్రపంచంలో అమెరికాయే సర్వసంపన్న దేశం కాదు అనే అర్థం వస్తోంది అంటే యింకా సంపన్న దేశాలున్నాయనీ, కనీసంకొన్నైనా యింత సంపన్నమైనవి వున్నాయనీ కదా అర్థం

యిప్పుడు వీటిని మార్చే పద్ధతులు చూద్దాం

Superlativeలో negative వుంటే comparativeలో 'not'ని వాడాలి, 'than some other' అనే మాటలు రావాలి Subjectతో ప్రారంభం కావడంలాంటి నియమాలు మామూలే అంచేత comparative degreeలో,

America is not richer than some other countries in the world

యిదే వాక్యం positive degreeలో 'some'తో ప్రారంభమవుతుంది, 'at least' అనే మాట as కి ముందు వస్తుంది మిగిలిన నియమాలు positive degree గురించి పైన చెప్పుకున్నవే

Some countries in the world are atleast as rich as America

పైన interchange of degreesలో మూడురకాల వాక్యాల్ని చూశాం అలాకాక

పోలిక యిద్దరు వ్యక్తులకే, రెండుస్థలాలకే, రెండు వస్తువులకే మాత్రమే వుంటే వాక్యాలు యెలా వుంటాయో చూద్దాం యిక్కడ superlative degree రాదు

Positive degree నుంచి comparative, comparative నుంచి positive యేర్పడతాయి యిక్కడ విశేషం యేమంటే వాక్యంలో (అది positive వాక్యం గాని, comparative వాక్యం గాని) negative లేకపోతే మార్చేటప్పుడు negativeని పెట్టాల్సి వస్తుంది, negative వుంటే మార్చేటప్పుడు తీసెయ్యాల్సి వస్తుంది

(i) London is bigger than Bombay.

యిక్కడ comparison రెండింటిమధ్యనే వుంది యీవాక్యం comparative degreeలో వుంది వాక్యంలో negative లేదు దీన్ని వాక్య positiveలోకే మార్చగలం, యేమంటే పోలిక అన్ని నగరాలకీ కాక, రెండు నగరాలకే పరిమితమైంది కనక

Bombay is not so big as London అని positive వాక్యం యేర్పడుతుంది

(ii) Bombay is as big as London

యీ వాక్యం positive degreeలో వుంది వాక్యంలో negativeలేదు. దీన్ని comparative లోకి మార్చచ్చు

London is not bigger than Bombay

(iii) (a) You know him better than I (know him)

యిలాంటి సందర్భాల్లో than తర్వాత subjective form రావాలి. యేమంటే 'నేను ఎరిగిన దానికంటే నువ్వు అతన్ని యెక్కువ ఎరుగుదువు' అని అర్థం

అయితే 'నన్ను ఎరిగివన దానికంటే అతన్ని గురించి యెక్కువ ఎరుగుదువు' అనే అర్థంవచ్చే వాక్యాలూ వుంటాయి కదా. అప్పుడు,

(b) You know him better than me, అని వస్తుంది. అంటే better than you know me అని

(a) You know him better than I

యిది comparative degreeలో వుంది దీనికి positive form, negative వస్తాయి కదా.

I don't know him as well as you (know him)

(b) You donot know me as well as you know him, అని

పైన (b)లో యిచ్చిన వాక్యానికి positive వస్తుంది. యిక్కడ యిది adverb, adjectivesకి లాగానే adverbకీ degrees వస్తాయి, వాటికీ comparisonలో ఆ rules వర్తిస్తాయి adverbs గురించి చూసినప్పుడు వాటి degreeలో వచ్చే మార్పు రూపాలు చూద్దాం.

యిప్పుడు ఒకే వ్యక్తిలోని రెండు గుణాలు పోల్చేమనుకోండి. అప్పుడు యెలాంటి మార్పు చెయ్యాలి ఉదాహరణకి He is more kind than poor యిక్కడ

పేదరికం కంటే దయాగుణం యెక్కువ అని యీరెండు వొక మనిషిలో వున్నవే. యిలాంటి సందర్భాల్లో comparative degree form (యిక్కడ kinder అని) వాడరు.

He is more rich than wise.

She is more proud than beautiful

వీటికి positive చెయ్యాలంటే He is not as wise as he is rich, She is not as beautiful as proud అని వస్తాయి.

యిక రెండు adjectives వొకే వ్యక్తికి refer చేస్తూ, వొకటి superlative లో వుంటే రెండోదీ superlative లోనే వుండాలి

He is the richest and most honest man అనాలి కాని 'he is the richest and honest man' అనకూడదు అయితే వొక సందేహం రావచ్చు, richest కాని honest కాదు అప్పుడు యెలా? అప్పుడు వేరేలా వాక్యం చెప్పుకోవాలిగాని యిలా refer చేస్తున్నట్టుకాదు.

యిప్పుడు యీ adjectivesకి సంబంధించిన incorrect, correct sentences చూసి యీ chapterని ముగిద్దాం

Degrees of comparisonకి సంబంధించి పైన చెప్పిన modelలో వాక్యాలు అభ్యాసం చేసి నేర్చుకోండి

| **In correct** | **Correct** |
| --- | --- |
| Mohan is wiser than all students. | Mohan is wiser than all other students. |
| This magazine is preferable than that. | This magazine is preferable to that |
| He is superior than his brothers. | He is superior to his brothers. |
| Neither of these ten students came to see me. | None of these ten students came to see me |
| Either of you eight can do this work. | Any of you eight can do this work. |
| He is my older brother. | He is my elder brother |
| This is eldest building in our town. | This is the oldest building in our town. |
| There were no less than fifteen students there. | There were no fewer than fifteen students there. |
| The rain was plenty there. | The rain was plentiful there. |
| Did somebody go there? | Did anybody go there?. |

| | |
|---|---|
| Cut this apple into two halves. | Cut this apple into halves (or in half) |
| You read the two first chapters. | You read the first two chapters |
| These three boys will help each other | These three boys will help one another. |
| The first two boys will get the prize | The two first boys will get the prize |
| Every people know fully well about this. | Every one knows fully well abort this |
| He held the chair in the both hands | He held the chair in both hands |
| Both of them have not come. | Neither of them came. |
| He is in class tenth. | He is in class ten (or the tenth class) |
| She is more beautiful than the others. | She is the most beautiful of all others. |
| This is a worth seeing sight in Hyderabad. | This is a sight worth seing in Hyderabad |
| My brother is hopeless to get through the examination. | My brother has no hope of getting through the examination. |
| Your affectionate friend. | Yours affectionate friend. |
| She got few marks in the examination. | She got a few marks in the examination. |
| This is the latter edition published on the issue. | This is the later edition published on the issue. |
| Gopal and Ramu were playing when the later got hurt. | Gopal and Ramu were playing when the latter got hurt. |
| These are farther remarks made by him | These are further remarks made by him. |
| He is more supreme here. | He is supreme here. |
| She is inferior than her sister. | She is inferior to her sister. |
| Many a jokes were cut during the conversation. | Many a joke was cut during the conversation. |
| He won a great many battle. | He won a great many battles. |
| He is the poorest of any student. | He is the poorest of all the student. |

| | |
|---|---|
| 'The Hindu' has the largest circulation than any news paper | 'The Hindu' has the largest circulation of all newspapers (super) 'The Hindu' has larger circulation than any other newspaper (comp). |
| I shall go by the latest train | I shall go by the last train. |
| She is richer than beautiful. | She is more rich than beautiful. |
| Less books are needed now. | Fewer books are needed now. |
| He wrote a best book on prohibition | He wrote the best book on prohibition |
| This hat is more perfect than that | This is a perfect hat |
| What is the last news? | What is the latest news? |
| I am sorry that I arrived so later | I am sorry that I arrived so late. |
| He is the foremost man to arrive | He is the first man to arrive. |

***

# 6 The Adverb

నిజానికి యీ ప్రకరణం 'verb'ని గురించి చెప్పాకున్నాక రావాలి. కానైతే adjectives మాదిరీ దీనికీ comparative degree వుండబట్టి adjectives తర్వాతనే చూస్తే మంచిదని తోస్తుంది. అదీగాక యిది వొక్క verbకి మాత్రమే పరిమితం కాక adjectiveకీ, మరో adverbకీ కూడా విస్తరించి వాక్యంలో function చెయ్యడం యింకో కారణం

Adverbకి క్రియావిశేషణం అని అర్థం చెపుతూ వుంటారు. అయితే 'adverb' verbని, adjectiveని లేకపోతే మరో adverbని modify చేస్తుంది. అంటే వాటి అర్థాన్ని యింకా విశదీకరించి చెప్తుంది.

ఉదాహరణకి He ate much food అనే వాక్యం తీసుకుందాం. food పరిమాణం యెంతటిదీ 'much' తెలియచేస్తుంది. అయితే 'ate' అనే verb, తినడం అనే క్రియ యెలా జరిగిందీ యిందులో తెలియడంలేదు. మెల్లగానా, గబగబానా, మధ్యమధ్య ఆగుతూనా అనే అంశాలు తెలియడంలేదు.He ate much food quickly, అన్నామనుకోండి. యెక్కువ తిన్నాడనే కాక, గబగబా తిన్నాడనీ తెలుస్తోంది. యీ 'ate' అనేది 'quickly' జరిగిన పని. అంచేత యిది ఆ verb గురించి అదనంగా తెలియచేస్తోంది. అలాంటి దాన్నే 'adverb' అంటారు.

యీ adverbs అర్థాన్ని బట్టి పదిరకాలుగా వున్నాయి. కొందరి ప్రకారం నాలుగురకాల adverbs వున్నాయని కొందరి ప్రకారం seven types అని. సంఖ్యని గురించిన చర్చ అలా పక్కన పెట్టి అసలు adverbs యెలా యేర్పడతాయి, యెన్ని రకాలుగా వాక్యంలో వుంటాయి అన్న విషయం చూద్దాం.

Adverbs సామాన్యంగా adjectivesకి 'ly' చేరడంద్వారా యేర్పడతాయి.

| | |
|---|---|
| kind | kindly |
| sad | sadly |
| swift | swiftly |
| sweet | sweetly |

అయితే adjectives మామూలుగా nounsకి ముందు వుంటాయి. Adverbs అవి modify చేసే verbsకి తరవాత వస్తాయి.

She sang a sweet song (adj)
She sang sweetly (adv.)

యిలా adjectives'కి 'ly' చేరడంవల్ల కొన్ని adverbs యేర్పడితే nounsనుంచి కొన్ని యేర్పడతాయి today, asleep, homewards 'nouns'కి 'ly' చేరి కొన్ని: daily, weekly, yearly, వగైరా.

యిక మరికొన్ని రెండు మూడు వేర్వేరు పదాలు కలిసి యేర్పడతాయి: somewhat, sometimes, however, anywhere లాంటివి యిలాంటివి.

Adverbs యిలా యేర్పడ్డా, యే రకాలుగా వున్నాయి?

Adverbs of Time, adverbs of place, adverbs of number, adverbs of manner, adverbs of degree and quantity, adverbs of affirmation and negation, adverbs of reason, adverbs of interrogation. యిక ఆఖరిగా relative adverbs అని వున్నాయి. యీవిభజన క్రమంలో పేర్లన్నీ గుర్తుంచుకోపోయినా ఫరవాలేదు కాని అవగాహనా సౌలభ్యంకోసం యిలా వర్గీకరించుకుంటున్నామంతే. అయితే వాక్యంలో అవి చేసే function గురించి మాత్రం వివరంగా తెలుసుకుందుకు యీ వర్గీకరణ ఉపకరిస్తుంది.

*Adverbs of Time* అంటే యేమిటి? యేదేనా వొకపని జరిగిందంటే అది యేదో వొక నియమిత సమయంలో జరుగుతుందికదా. ఆ సమయ నిర్దేశం చేసేదే యీ adverb of time. Verbకి 'when' అన్న ప్రశ్నవేస్తే వచ్చే జవాబే యీ adverb of time.

Raja arrived yesterday. (When did Raja arrive?)
He has been sleeping since morning. (From when?)

దీన్నిబట్టి కాలవాచకంగా వుండే పదాలు అన్ని యిలాంటివేనని తెలుస్తుంది. now, then, since, ago, before, already, soon, presently, immediately, instantly, early, late, today, tomorrow, yesterday, afterward, next లాంటివి యీ adverbs of time అవుతాయి.

*Adverbs of place* అంటే స్థల నిర్దేశకాలు 'where' అని అడిగితే వచ్చే జవాబులు

We find this crop everywhere.
I went home
They walked into the garden.

Here, there, hence, thence, hither, thither, in, out, within, without, above, below, far, near, inside, outside, up, down, beyond లాంటివి adverbs of place

*Adverbs of number.* ఏదన్నాపని 'how often' జరిగింది అన్నదే యీ adverbs of number. యెన్నిసార్లు అనేదానికి జవాబుగా వచ్చేదే యీ విభాగంలోకి వస్తుంది.

She is always late.
They often go to pictures.
You helped me once.
He seldom goes to work.

Once, twice, thrice, again, always, seldom, never, frequantly, sometimes, often, firstly, secondly, four-fold, five-fold లాంటివి adverbs of number కిందికి వస్తాయి.

*Adverbs of manner*.ఒక పని జరిగిన తీరుని, రీతిని తెలియచేసేవి adverbs of manner.'How or in what manner' అనే ప్రశ్నకి జవాబుగా వచ్చేవే యివి,

The Russians fought bravely.
She sang wonderfully.
The patient slept soundly.
Our lecturer works hard.
The soldiers are walking slowly.

surely, probably, certainly, meanly, extremely, so, conveniently, happily, sadly, well, ill, badly, quickly loudly లాంటివన్నీ adverbs of manner అవుతాయి.

*Adverbs of degree or extent or quantity:* ఎంతవరకు యే పరిమాణం మేరకి, యే తరతమాల్లో వొకపని జరిగిందో తెలియచేస్తాయి. Adverbs of degree or extent or quantity show how much or to what extent or in what degree a thing is done.

This statement is partly correct.
The old man is very tired.
The student's answer is quite right.
The cup was nearly full.
This winter is extremely severe.

too, almost, fully, rather, quite, very, wholly, partly, somewhat, a little, much, enough, pretty, half, so లాంటివి యీ విభాగం కిందికి వస్తాయి.

*Adverbs of affirmation and negation*· అవును, కాదు అని కచ్చితంగా తెలియచేస్తాయి యివి.

I do not know this business.
Surely they are at fault.

Certainly we shall go there.

Yes, surely, certainly, by all means, difinitely, no, not, at all లాంటివన్నీ యిలాంటి adverbs అవుతాయి

*Adverbs of Reason* అంటే 'why' అని అడిగితే వచ్చేజవాబులు

We therefore went away from that meeting.
He came to teach them a lesson.
The weather was bad, hence they did not come.
As the work was done, we did not press them further.

as, because, therefore, hence, since లాంటివి యీ reasonని తెలియచేస్తాయి.

*Adverbs of Interrogation :* Interrogation అనే పదాన్ని బట్టి యివేమిటో గుర్తించవచ్చు మామూలుగా ప్రశ్నించడానికి వాడే పదాలన్నీ యిలాంటివే.

Why are you late?
Where are they going?
How do you like this place?
When will he come again?
How far is your place from here?

యిక Relative adverbs మిగిలేయి. యీ 'relative' పరిభాష pronounsకీ adjectivesకీ కూడా వుందని చూశాం. Adverbsకి కూడా యీ 'relative' సంబంధం పోలేదు వాక్యంలో adverbs ముందు వున్న nounsతో యెలాంటి సంబంధం వుందో యివి తెలియచేస్తాయి.

I know the place where we can go.
I know the reason why he failed.

In her work she pauses while thinking of her husband.

where, why, how, when, while అనేవి relative adverbs. వాక్యంలో వాక్ సందర్భంలో relative pronoun లోపించినట్టే యీ relative adverbs కూడా లోపించవచ్చు.

She cannot understand the way (how) you achieved this
The day (when) he came here if happened.

యిలా how, when లాంటివి లేకుండా కూడా చెప్పచ్చు. యివికాక adverbial particles కొన్ని వున్నాయి. up, down, in, out, on, off, away, back లాంటివి.

Take off your coat. Put on your dress, She went out.

ఈ adverbial particles వాక్యం మొదట్లోవుంటే exclamatory senseని యిస్తాయి.

Away the bird flew !
Down with your tricks !
Off with their heads !

*Position of adverbs in a sentence :*

వాక్యంలో adverbs చేసే function గురించి మొదట్లోనే అనుకున్నాం. అంటే ఒక verb, adjective లేకపోతే మరో adverbని modify చేస్తుంది అని. కానైతే వాక్యంలో యెక్కడ, యేభాషావిభాగం ముందు adverb వుండాలి, Adverb position మారిస్తే అర్థం యెలా మారుతుంది అని తెలుసుకుందాం.

Adverbs of manner, place, time యెలావుంటాయో చూద్దాం.

They returned home quickly యిక్కడ place, manner వచ్చాయి.
He worked hard today యిక్కడ manner, time వచ్చాయి.
Let us go to bed early, యిక్కడ place, time వచ్చాయి

She danced well in the auditorium last night, యిక్కడ manner, place, time వచ్చాయి.

Adverbs మామూలుగా object తర్వాత వుంటాయి.

He studied the book carefully.
He completed the work skilfully.

Intransitive verb అయితే, adverb దాని తర్వాత వస్తుంది.

He came late last night.
My friend lives there

Adverbs of time అయితే మామూలుగా intransitive verbs ముందే వస్తాయి. అయితే 'to be' (దాని రూపాలు అయిన వాటికీ) ముందుకాదు.

He never ran again.
We are always late

యిక auxiliary verbs గనక వున్నట్లయితే, adverbs సాధారణంగా ఆ auxiliary verbsకీ principal verbs కీ మధ్యలో వస్తాయి

I do not know him.
I have never seen such an accident.
We shall certainly miss him.

ఈ auxiliary verbs యేమిటో verbs గురించి తెలుసుకునేటప్పుడు చూద్దాం.

Adverbs వాక్యంలో adjectiveని qualify చేస్తూవుంటే ఆ adjectivesకి ముందు వస్తాయి.

I am very sorry,
She was too hasty.

Adverbs of frequency, పైన చెప్పినట్టు 'be' రూపాల తర్వాతగాని Principal verbsకి ముందుకాని వుంటాయి అంటే వాక్యంలో mid positionలో వుంటాయి

He is regularly irregular
She often drinks tea
We usually meet them
He rarely goes to films
We generally eat rice.

యిప్పుడు కొన్ని adverbs వాక్యంలో వున్న positionని బట్టి emphasis, meaning యెలావుంటాయో చూద్దాం

ఉదాహరణకి 'enough' అనే adverb వుంది. దీన్ని సామాన్యంగా అది modify చేసే మాట తర్వాతనే వాడతారు

You are enough foolish to go there అనకూడదు, you are foolish enough to go there అనే అనాలి.

అలాగే He is now strong enough to move about.
He spoke loud enough to be heard.

యిప్పుడు "only" అనే adverb స్థానం మారితే అర్థంలో వచ్చే మార్పు,

Only he helps her with money. (అంటే అతను మాత్రమే అని emphasis)

He only helps her with money (అంటే merely అని)

He helps only her with money (ఆమెకి మాత్రమే, మరెవళ్లకీ కాదు అని)

He helps her only with money (with money and in no other way అని)

He helps her with money only to buy books (అంటే వేరే యిక యెందుకూ కాదు అని)

యిప్పుడు కొన్ని adverbsని వాడే విధానం గురించి తెలుసుకుందాం

*(i) Very*. దీన్ని positive degreeలో adjectives తోనూ, adverbsతోనూ వాడతారు.

I am very happy.
She writes very well.

Present participlesతో వాడవచ్చు :

He wrote a very interesting story.
It is a very amusing incident.

'Much' అనే adverbని modify చెయ్యడానికి

This book is very much better than that.

Superlative adjective ముందు emphasis కోసం:

This boy is the very best student in the class.
He is the very best player in the team

*(ii) Much*ని comparative degreeలో adjectivesకీ adverbకీ ముందు వాడతారు:

Usha runs much faster than Aswini.
He is much stronger than his brother.

*(iii) 'Too'*ని 'more than enough' అనే అర్థంలో, అంటే అవసరమైన దాని కంటే యెక్కువ, 'excess' అనే అర్థంలో వాడతారు. చాలామంది దీని negative meaningని గమనించక తప్పుగా 'very'కి బదులు వాడతారు. 'The sugar is too sweet' అంటే అనవసరంగా, అతి తీపిగావుందని అర్థం. 'చాలా తీపిగా' వుంది అనాలంటే

The sugar is very sweet అనాలి

అంచేత

He is too weak to walk.
He is too poor to buy clothes
అని 'అమితమైన' అనే అర్థంలో వాడచ్చు.

I am very pleased అనాలి గాని 'too pleased' అనకూడదు.

*(iv) Since, ago, before :*

Adverbsగా 'since' 'ago' అనేవాటిని యిప్పట్నుంచి వెనక్కి, 'present time dating back అనే అర్థంలో వాడతారు. 'Before' అంటే ముందు, 'formerly' అని, వొక previous occasionలో అని అర్థం

'Since'ని adverbగా 'from then' అనే అర్థంలో వాడతారు : I met him three years ago and have not seen him since (అంటే అప్పట్నుంచి)

Conjunctionగా 'from which' time అనే అర్థంలో వాడతారు. Five years have passed since I passed the exam.

అదేరకంగా

I shall meet him, since you wish అని 'అంచేత' అనే అర్థంలో వాడతారు.

'Ago' అంటే గడిచిపోయిన అని అర్థం.

They left for Delhi a month ago.
This happened ten years ago.

'Before' అంటే 'యింతకు ముందు' formerly అని.

I have never seen him before.
She never before saw such a horrible thing

*(v) Already:* 'అప్పటికే' అని ప్రస్తావించుకునే timeకి ముందు జరిగిన విషయాన్ని సూచిస్తుంది.

The bus has already left.
When we reached the station, the train had already left.

*(vi) 'enough' - 'too'*ని గురించి చెప్పుకున్నప్పుడు negative sense వస్తుందని చూశాం. అయితే 'enough' positive senseలో వుంటుంది

Tea is too hot for me to drink అన్నప్పుడు తాగలేనంత వేడిగా వుందని.

He is clever enough to do this job.

This food is enough for me
యీ సందర్భాల్లో positive senseలో వుంది.

*(vii) 'Quite'* అంటే సంపూర్తిగా, completely అని. దీన్ని 'very'కి బదులు వాడకూడదు, considerable degreeకి వాడకూడదు. He is quite well now, (not 'verywell', యేమంటే అర్థం మారుతుంది) His work is quite satisfactory అంచేత

I am quite sorry to hear the sad news అనకూడదు
I am very sorry అనాలి

*(viii) Yes, no :*

అడిగిన ప్రశ్నకి జవాబు 'yes' అయితే, తర్వాత వచ్చే verb affirmativeలో వుండాలి. అలాకాక 'no' అయితే verb negativeలో వుండాలి. యివి affirmativeకి, negative sentenceలకి substitutesగా వుండచ్చు Did he go there? yes. (He did go), No. (He did not)

యిలాకాక జవాబుని 'yes'గా expect చేస్తూ question అడిగినప్పుడు, question లో'not'ని వాడుతూ వుంటారు.

Is it not very hot? అని అడుగుతూవుంటే 'అవును' అనే ఉద్దేశంతోనే ప్రశ్న వుందన్నమాట.yes it is very hot అని చెప్పాలి.

*(ix) fairly, rather* యీ రెండింటికీ అర్థం తగుమాత్రంగాననే, 'moderately' అనే. అయితే 'fairly'ని మంచి meaning యిచ్చే adjective, adverbsతో వాడతారు. అంటే good, well, nice వగైరా పదాలు యిచ్చే అర్థంలో. కాని ratherని అంత అనుకూలమైన అర్థంలో వాడరు, అంటే bad, ugly, stupid వగైరా పదాలు యిచ్చే అర్థంలో వాడతారు.

His elder son is fairly clever, but his second son is rather stupid.

'Rather'కి ముందు గాని తర్వాతగాని indefinite article (a/an)ని వుంచవచ్చు, 'fairly'కి మాత్రం articleని ముందే వుంచాలి.

She is rather a silly girl అనచ్చు లేదా she is a rather silly girl అనవచ్చు

కాని It is a fairly interesting book, అని ముందే article వుంచాలి.

అయితే fast, slow, thin, thick, hot, old వగైరా adverbs/adjectives వున్నాయనుకోండి. వాటంతటు అవి మంచి అర్థాన్ని అందియ్యవు. వ్యతిరేకార్థాన్నీ అందియ్యవు కాని వాటిని గురించి చెప్పే వ్యక్తి fairly కాని rather కాని వాడి తన favourable, unfavourable అభిప్రాయాన్ని వెల్లడి చెయ్యచ్చు.

Tea is fairly hot అన్నామంటే తనకి నచ్చేట్టు వేడిగా వుందని. అలాకాక this tea is rather hot అంటే తనకి ఎక్కువ వేడిగా వుందని.

అయితే ratherని మంచి అర్థం అందించే పదాల ముందు వాడితే very అనే భావించాలి, unfavourable అర్థం వుండదు. He is rather industrious అంటే very industrious అని.

**Adverb phrases**ని కొన్నింటిని యిప్పుడు చూద్దాం

Adverb phrase అంటే adverb function నిర్వర్తించేవని అర్థం రెండు, అంతేకంటే యెక్కువ మాటలు చేరి యివి యేర్పడతాయి. సాధారణంగా prepositions చేర్చుకొని యీ adverb phrases యేర్పడతాయి. వీటిలో కొన్నిట్నీ చూద్దాం. కొన్నింటి ప్రయోగం యెలా వుండాలో తెలుసుకుందాం.

*Adverb phrases of time :* long ago, once upon a time, in a minute, after a while, from day to day, far and near, by and by, again and again, now and then, off and on, all at once, at once, before long, for long, in time, at times, in the long run..

*Adverb phrases of place ;* at home, at sea, to and fro

*Adverb phrases of manner :* with a will, all of a sudden, upside down, topsy turvy;

Adverb phrases of affirmation and negation : by all means, not at all, by no means.

యీమాదిరి కొన్నింటిని time, place అని విభజించి చెప్పామేగాని యివే అన్నీ అని కాదు. Adverb phrasesమీద వ్యాకరణంలో ప్రత్యేకం పుస్తకాలే వున్నాయి.

కొన్ని **adverb phrases**ని యెలా వాడాలో చూద్దాం.

యేదన్నా పుస్తకం చదివినా, సినిమాచూసినా అవి నచ్చితే చాలామంది 'I liked it on the whole' అని మెచ్చుకోలుగా అంటూవుంటారు. కాని 'on the whole' దేన్నన్నా in parts good or bad అయితే sum up చేస్తూ అనేమాట. అలా partగా కాక మొత్తంగా నచ్చినట్లయితే 'I liked the whole of it' అనాలి.

Does he study well ? Of course, he does అని వాడడం చూడండి. యిలాంటిచోట్ల 'అయ్యో, చదవకేం, బాగా చదువుతాడు' అని certainly అనే అర్థంలో వడుతూవుంటారు of course అంటే as a matter of course, natural consequenceగా అని ఉద్దేశం Of course, he was sad at his failure; He over worked and of course, he fell ill అనేలాంటి చోట్ల ఇది వుండాలి.

యిక hardకీ hardlyకీ తేడా గమనించకపోవడం. Hard అంటే కష్టపడి, diligently అని. He works hard.

అయితే 'hardly' అంటే గట్టిగా అనే భ్రమతో He works hardly అంటూ వుంటారు 'Hardly' అంటే 'Scarcely' అని, అరుదుగా

He has hardly helped me

He works hardly అంటే negative meaning వస్తుంది.

అలాగే He is so weak in English అంటూవుంటారు. 'చాలా' అనేఅర్థంలో. అయితే 'so' adverb of degree, దాన్ని యిలా వాడకూడదు. He is very weak in English అనాలి. అయితే He is so weak in English that he cannot pass అనచ్చు.

Late, latelyకీ తేడా గమనించకపోవడం.

The train reached rather lately అంటారు. Lately అంటే 'యీమధ్య', 'యిటీవల'అని. యిక్కడ ఆలస్యంగా వచ్చిందని ఉద్దేశించి యిలా వాడతారు. మరి అది తప్పుకదా. 'The train reached rather late' అనాలి.

## Degrees of comparison of adverbs :

యిప్పుడు comparisonకి వద్దాం. Adjectivesకి వున్నట్టే adverbsకీ degrees of comparison వుంది Adjectivesకి యెలా degrees మార్చి వాక్యాలు రాస్తామో adverbsకీ అంతే.

Adjectivesకి degreesలో యెలా రూపాలు మారతాయో ఆ chapterలో చూశాం. Adverbsకి యెలా మారతాయో ఇప్పుడు చూద్దాం.

Adverbs 'ly' చేర్చుకుని యేర్పడతాయి కదా మామూలుగా. అలా 'ly'తో యేర్పడే adverbsకి ముందు more, most వచ్చి comparative, superlative అవుతాయి

| | | |
|---|---|---|
| loudly | more loudly | most loudly |
| carefully | more carefully | most carefully |
| cleverly | more cleverly | most cleverly |
| easily | more easily | most easily |
| slowly | more slowly | most slowly |

అయితే early మాత్రం earlier, earliestగా మారుతుంది కొన్ని adverbs, adjectives మాదిరీ 'er', 'est' చేర్చుకుని యేర్పడతాయి.

| | | |
|---|---|---|
| fast | faster | fastest |
| hard | harder | hardest |
| long | longer | longest |
| large | larger | largest |
| short | shorter | shortest |
| soon | sooner | soonest |

కొన్ని adjectivesలాగా కొన్ని adverbs, irregularగా వుంటాయి

| | | |
|---|---|---|
| ill (badly) | worse | worst |
| little | less | least |
| much | more | most |
| well | better | best |
| late | later,latter | last, latest |

యిక వీటిని positive, comparative, superlative degreeల లోకి మార్చడానికి adjectives విషయంలో వర్తించే నియమాలే వర్తిస్తాయి. (ఆ నియమాల్ని adjectives chapterలో degrees of comparisonలో చూడండి.)

అయితే adjectivesని adverbsగా వాడకూడదన్న విషయానికి సంబంధించి వొక ఉదాహరణ చూద్దాం. She worked nobler than her sister అన్న వాక్యంలో 'worked'కి చెందిన comparison. అంచేత 'nobler' అని కాకుండా 'She worked more nobly than her sister' అనాలి.

యిప్పుడు Adverb usageలో incorrect యేదో correct యేదో తెలుసుకుని యీ chapter ముగిద్దాం.

| In correct | Correct |
|---|---|
| The patient is very worse than what you said. | The patient is much worse than what you said. |
| This is a much amusing situation. | This is a very amusing situation. |
| This mango is very bad to be eaten. | This mango is too bad to be eaten. |

| | |
|---|---|
| You should go directly to your father | You should go direct to your father |
| He behaved most gentlemanly | He behaved in a most gentlemanly manner |
| She exactly stood in front of him | She stood exactly in front of him |
| His language sounds harshly | His language sounds harsh. |
| It is much harmful than useful | It is more harmful than useful. |
| I have worked here since two years. | I have worked here for two years |
| He is *called* as Raghu* | He is *called* Raghu |
| He did this work wrongly | He did this work wrong |
| I am much sorry to learn this | I am very sorry to learn this. |
| You are very kind enough to help me. | You are kind enough to help me or you are so kind as to help me. |
| Call him anything else than a fool | Call him anything else but a fool. |
| He was forced to quickly do it | He was forced to do it quickly. |
| Tajmahal is wonderful beautiful | Tajmahal is wonderfully beautiful |
| He goes there frequently | He frequently goes there. |
| I am quite sorry to hear the sad news. | I am very sorry to hear the sad news |
| He writes carefully his examinations | He writes his examinations carefully |
| He cannot even write correct Telugu. | He cannot write even correct Telugu |
| Gopi is somewhat tall for his age | Gopi is rather tall for his age. |
| He works hardly day and night. | He works hard day and night. |
| The chief guest spoke fluently English | The chief guest spoke English fluently. |
| My boss helps me always | My boss always helps me. |
| This road is too dangerous. | This road is very dangerous. |
| Long before this place was barren | Long ago this place was barren. |
| You are enough foolish to do this | You are foolish enough to do this |

* యిది సామాన్యంగా జరిగే తప్పు. call తర్వాత as రాకూడదు. 'represent' 'portray', mention, define లాంటి verbs of description తర్వాతనే 'as' వస్తుంది.

| | |
|---|---|
| He tells never a lie | He never tells a lie |
| Students visit my house often | Students often visit my house |
| This luggage is too much heavy for me. | This luggage is much too heavy for me. |
| He is too clever | He is very clever. |
| This news is very good to be true. | This news is too good to be true. |
| The president was too respected there. | The president was much respected there |
| Is death enevitable? Certainly, it is. | Is death inevitable? Of course, it is |
| The patient is very better today. | The patient is much better today. |
| He improved by and by. | He improved gradually |
| No one scarcely goes there | Scarcely any one goes there |
| I found her lying senselessly | I found her lying senseless |
| I have not met him long since. | I have not met him for a long time. |
| The old man peacefully died. | The old man died peacefully. |

# 7 Verbs

*Parts of speech* అన్నింటిలోకీ యిది కీలకమైంది. వాక్యనిర్మాణంలో ఉప్పు యిదే. వాక్యంలో subject యేం చేస్తుందో, యే stateలో వుందో, subjectకి యేం జరుగుతుందో చెప్పేమాట యిదే. (వాక్యంలో subjectగా person గాని thing గాని వుంటాయని, subject అనేది noun or noun-equivalent అనీ తెలుసుకదా). అసలు దీని వ్యుత్పత్తి Latin 'verbum' అనే పదం నుంచి Verbum అంటే మాట, ఇంగ్లీషు wordకీ యిదే root యిప్పటికీ యీ అర్థద్యోతకంగా (అంటే verbum . మాట అనే అర్థద్యోతకంగా) ఇంగ్లీషులో verbatim (word for word), Verbiage (unnecessary మాటలు అనే అర్థంలో) verbose (containing more words than needed) verbal (spoken not written) అని ('మాట' అనే మూల అర్థంలో) వున్నాయి verbs (క్రియలు) లేని వాక్యం వుండదు అని వో రకంగా చెప్పచ్చు.

1. The child cries.
   She sang a song.
2. The leader is elected.
   Many people were killed in the floods.
3. Milk is white.
   Glass is brittle.

యీ పైన చూసిన వాక్యాల్లో మొదటిదాంట్లో subject యేం చేస్తోందో తెలుస్తుంది రెండవదాంటో subjectకి యేం జరిగిందో బోధపడుతుంది. మూడవదాంటో subject యే స్థితిలో వున్నదీ అర్థమవుతోంది

పైన చెప్పిన వాక్యాల్లో cried, sang, లాంటివి వాటికిగా అవి వున్నాయి. 2వ set వాక్యాల్లో electedకి, killedకి is, were అని మరో verbs సాయం వచ్చాయి.

He will come tomorrow
It may disappear now.
She can sing well.

అనేవాక్యాల్లో will, may, can అసలు verbsకి సాయంగా వున్నాయి.

తమంత తాము function నిర్వర్తించేవి, సహాయకంగా వచ్చేవి యీ వాక్యాల్లో కనిపిస్తున్నాయి. దీన్నిబట్టి verbs, Principal verbs అనీ, helping verbs అనీ రెండు రకాలుగా వున్నట్టు తెలుస్తుంది యీ helping verbsనే auxiliary verbsఅనీ, anomalous verbs అనీ అంటారు.

Principal verbs అపరిమితం, అసంఖ్యాకం. Auxiliary verbs or anomalous verbs మాత్రం సంఖ్యా పరిమితం. యివి 24 వున్నాయి

24 auxiliary verbs యివీ.

| *Root verb (మూలం)* | *derivatives (ఉత్పన్నం)* |
|---|---|
| be | am, are, is, was, were, been |
| have | have, has, had |
| do | do, does, did |
| shall | shall, should |
| will | will, would |
| can | can, could |
| may | may, might |
| must | must |
| ought | ought |
| need | need |
| dare | dare |
| used | used |

be, have, do అనేవీ, వాటి derivatives principal auxiliary verbs. మిగిలినవి modal (relating to mode, form) auxiliary verbs. Anomalous finites అంటే యివే. వీటి function మామూలు verbs కంటే భిన్నంగా వుంటుంది. యీ verbs మరో verb meaningకి add చేస్తూ వుంటే auxiliary verbsగా వుంటాయి. Negatives, interrogatives, short answers, tag questions, emphatic affirmatives యేర్పడ్డానికి యివి అవసరం. కొన్ని moods, అంటే ability, possibility, permission, obligation లాంటివి యేర్పడ్డానికీ వీటిని వాడతారు. వీటి గురించి విడిగా తర్వాత తెలుసుకుందాం.

యిప్పుడు verbsకి వున్న యింకో లక్షణం చూద్దాం.

The child cries.
The boy killed a snake.

యీ రెండు వాక్యాల్లోనూ verb యెలాంటి అర్థాన్నిస్తోంది? 'cries' ఆ child చేసే పనిని తెలియచేస్తోంది killed వేరే సమాధానాన్ని అపేక్షిస్తోంది

killed అనగానే దేన్ని? అనే ప్రశ్న సహజంగానే వేస్తాం. దానికి జవాబు వస్తుంది, 'cries'కి 'దేన్ని' అన్న ప్రశ్న వెయ్యం, అప్రశ్న అసలు రాదు 'killed'కి ప్రశ్న సహజంగానే వస్తుంది, జవాబూ వస్తుంది అంటే 'who, what' అన్న ప్రశ్న verbకి వేస్తే జవాబు వుంటే ఆ క్రియలు వొక రకంవి అలా ప్రశ్న, జవాబులేని క్రియలు మరోరకంవి జవాబువచ్చే క్రియలు Transitive verbs, అవిలేని క్రియలు Intransitive verbs తెలుగులో Transitive verbsని సకర్మక క్రియలని, అంటే కర్మ – object వున్నవనీ, Intransitive verbsని అకర్మకక్రియలని, అంటే object లేనివని, అంటారు.

కొన్ని verbsని Intransitiveగానూ, Transitiveగానూ కూడా వాడచ్చు

| **Intransitive** | **Transitive** |
|---|---|
| The school opens at 10 A.M. | He opens the door |
| He writes neatly | I write a letter |
| The fire burns brightly | The child burnt his fingers |
| Birds fly | Children fly kites |

Verbs యిలా transitive, intransitive తరహోవే కాదు మరో అంశంకూడా వాటికి వుంది The child cries. Usha runs, అనే వాక్యాల్లో 'cries', 'runs' ఆ subject గురించి పూర్తి అర్ధాన్నిస్తున్నాయా అంటే యిస్తున్నాయనే చెపుతాం. వాటి అర్ధ పరిపూర్తికి యింకా అదనంగా యేమన్నా మాటలు అవసరమవుతున్నాయా అంటే లేదు అనే చెప్పాలి. యివి Intransitive verbs అంటే, అకర్మక క్రియలు. అయితే అన్ని intransitive verbs యిదే మాదిరీ పూర్తి అర్ధాన్ని తమంతతామే యివ్వలేవు

He became an M.L.A.

Ram is a rich man.

The cyclist seems tired

యీ వాక్యాల్లో 'became' 'is', 'seems' అనే verbs వున్నాయి. వాటంతట అవి అర్ధాన్ని యివ్వడంలేదు. అవి transitive verbs కాదు, intransitive verbs, అయినా అర్ధ పూర్తిగ్గాను an M.L.A. అనీ, rich man అనీ, tired అనీ వేరే మాటల్ని తెచ్చుకోవాల్సి వస్తోంది యీ తెచ్చుకున్న మాటలు object కావు అంటే క్రియ function pass on అయేవి కాదు, క్రియ అర్ధాన్ని పూర్తిచేసేవి. వీటిని complement అంటారు. వేరే మాటల సాయం లేకుండా వాటంతట అవే పూర్తి అర్ధాన్ని యివ్వలేని intransitive verbsని Intransitive verbs of incomplete predication అంటారు. వాటి అర్ధపరిపూర్తికి వచ్చేమాటని గానిమాటల్నిగాని complement అంటారు. యీ complements వాక్యంలో భిన్న తరహోలుగా వుంటాయి, అంటే noun complement, adjective complement, adverb complement, clause complement అనే పేర్లతో. యిప్పుడంత వివరంగా

వాటిజోలికి వెళ్లక్కర్లేదు. వొట్టినే complement of Intransitive verb అని తెలుసుకుంటే చాలు యిలాంటి intransitive verbs మామూలుగా 'idea of being, seeming, appearing'అని విశదీకరిస్తాయి. అంటే 'He became an M.L.A.'లో being, He యేమైందీ తెలుస్తోంది. యివన్నీ subjective complement.

యిప్పుడు transitive verbకి ఈ గండం లేదా అనిపించవచ్చు Transitive verb meaning ఆ verb తోనే పూర్తిగా అందుతుందా అనేవిషయం చూస్తే యీ సంగతి తెలుస్తుంది.

They made him president అన్న వాక్యం చూడండి. 'made' అనగానే 'whom' అని ప్రశ్న him అని జవాబు వచ్చింది కాని అక్కడితో పూర్తి అర్థం అందడం లేదు 'made' what? President అని జవాబు అంటే యీ transitive verb కూడా అర్థ పరిపూర్తికి వేరే మాటని కోరుతుంది అంచేత అలాంటి transitive verbs 'Transitive verbs of incomplete predication' అవుతున్నాయి అర్థ పరిపూర్తికి వచ్చేమాట objective complement అవుతుంది, అంటే objectకి చెంది, దాని అర్థం పూర్తిగా అందించేవి యీ objective complements కూడా పైన చెప్పుకున్న అన్ని రకాలుగానూ వుండచ్చు

They made him president.

They painted the house green

She saw her child asleep

The principal put the school in order

Verbs యిలా transitive, intransitive అనే భేదంతో వుండడమేకాక అవి చేసే functionని బట్టి timeని తెలియచేస్తాయి. 'The child cries' అంటే child crying అనేది జరిగిపోయిందా, జరుగుతోందా వగైరా విశేషాన్ని అందిస్తుంది 'They made him president', 'He became an M.L.A.' అనే వాక్యాలూ ఆ verb function జరిగిపోయిందన్నట్టు తెలియచేస్తున్నాయి యిలా verb పని జరిగిన కాలాన్ని తెలియచేసేదే 'tense' వొక పనికి సంబంధించిన కాలం యీ tenseని బట్టి తెలుస్తుంది. దీన్ని సూచించేటట్టు verb రూపం మారుతుంది.

Verbకి tenseతో బాటు mood కూడా వుంటుంది. Mood అంటే మనుషులకి వుండే state of mind అని అర్థంవుంది. Verbsకి mood అంటే mode or manner in which a statement is made అని యేదో వో డజను క్రియలు తప్పిస్తే మిగిలిన అసంఖ్యాక verb లన్నీ నిర్వహించేపనికి, అంటే functionకి, mood అంటారు. యివి indicative అనీ, inperative అనీ, subjunctive అనీ వున్నాయి.

యిలా moods మాత్రమే కాదు. verb వాక్యంలో పరిమితంకాక, అంటే finite కాక (అంటే subjectకి, numberకి, tenseకీ పరిమితం కాక) verb express చేసే actionని మాత్రమే తెలియచేసేవి వున్నాయి. Finite verbs

అన్నీ పైన చెప్పిన moodsలో యేదోవొక దాంట్లోనే వుంటాయి. అలా finite కాక naming the action మాత్రమే వుండేవి infinites, దీన్ని infinitive mood అనీ కొంతమంది అంటూవుంటారు. యీ infinitives base infinitive, participle, gerund అని మూడురకాలు.

యిక verbకి Active voice, passive voice అని రెండు voiceలు వున్నాయి, Transitive verbs యీరెండు voiceల లోనూ ప్రయోగంలో వుంటాయి.

Verb Direct and Indirect అనే రెండు speechలలో మార్పులు పొందుతూ వుంటుంది తర్వాత subjectతో, verb agreementతో, అంటే దానికి తగ్గట్టు వుంటుంది.

యిప్పుడు యీ అంశాలన్నిట్నీ వివరంగా తెలుసుకుందాం.

ముందుగా Tense గురించి తెలుసుకోవాలి. యీ tense తోబాటే voice (Active, passive) కూడా చూడాలి. యేమంటే verb యే tenseలో function చేస్తూ వున్నా voice వుంటుంది.

## 1. Tense (Time కాలం)

వాక్యంలో వున్న ప్రతి verb ఆ verb function యెప్పుడు జరిగిందో, జరుగుతోందో తెలియజేస్తూనే వుంటుంది.

(a) He eats rice.
(b) He is eating rice.
(c) He ate rice
(d) He will eat rice

యీ వాక్యాల్లో 'eat' అనేది క్రియ. మొదటిదాంట్లో మామూలుగా జరిగేపని. రెండవదాంట్లో ప్రస్తుతంలో చేస్తున్న పని మూడవదాంట్లో జరిగిపోయిన విషయం, నాల్గవదాంట్లో చెయ్యబోయే పని తెలుస్తున్నాయి. అంటే వొకపని జరిగే కాలాన్ని verb తెలియచేస్తుంది. జరిగే, జరగబోయే, జరిగి పోయిన కాలాన్ని verb తెలియచేస్తుంది అంటే మూడు రూపాలున్నాయన్నమాట. యీమూడింటినీ present (వర్తమానం), Past (భూతకాలం), Future (భవిష్యత్) అని విభజించారు.

అయితే యీ మూడింటికీ తిరిగి యింకా కచ్చితమైన కాల నిర్దేశకంగా వుండేట్టు ఉపవిభాగాలు చేశారు,చెయ్యడం అంటే వ్యాకరణ వేత్తలు పనికట్టుకుని చేశారని కాదు భాషావ్యవహారంలో అలా వుంది. తెలుగు భాషకి యింత సూక్ష్మమైన tense విభజన లేదు. అంచేత tense usageకి సంబంధించి మనం తప్పులు చేస్తూ వుంటాం.

Tenseని గురించి జాగ్రత్తగా అధ్యయనం చెయ్యాలి.

Tense, అంటే verb కాలనిర్దేశకంగా వుండడాన్ని సూచిస్తుందనీ, మూడు విధాలుగా వుంటుందని కదా అనుకున్నాం యిందులో మొదట present tenseని చూద్దాం

**Simple Present tense :** అంటే వర్తమానకాలం, దీన్నే present indifinite అనీ అంటారు Sub + verb దీని structure, అంటే 'verb' conjugation రూపాలు కాకుండా base formలో వున్నరూపం.

I go, You eat, They, come, We live అయితే third person singularలో యీ verbకి 's' చేరుతుంది

He writes, She sings, It barks

యీ simple present or indefinite present యెప్పుడు వాడతారు? (యిప్పుడు చెప్పుకునేవన్నీ Active voiceలో వుండే వాటిగురించే. మొత్తం Tense forms అన్నింటిగురించీ చూశాక అప్పుడు passive voiceకి వెడదాం.)

(a) వాస్తవంగా ఆ సమయంలో జరిగే పని గురించి చెప్పేటప్పుడు, what is taking place at the present.

See, how the bird flies

(b) to express some universal truth

The earth rotates

The sun rises in the east

Four and four make eight.

(c) ఏొక habitual actionని తెలియచెయ్యడానికి.

We get up early in the morning.

He eats bread daily.

She goes to work at 10 A M.

**Present continuous tense :** వర్తమానంలో జరుగుతూవున్న పని

Sub + is/am/are + verbకి 'ing'.

She is dancing now.

I am writing this exercise

We are talking about you

(a) యీ tenseని యింతకుముందు indefinite timeలో మొదలై ఆ క్షణంలో జరుగుతూవుంటే వాడతారు. commencement యెప్పుడు జరిగిందో కాదు, అప్పుడు జరుగుతూ వుండడమే ముఖ్యం.

(b) సమీప భవిష్యత్‌లో, near futureలో, జరిగే actionకి వాడచ్చు సామాన్యంగా verbs of movementని యిలా వాడడంవుంది, go, return, come లాంటివి. అయితే near future అన్న విషయాన్ని మర్చిపోకూడదు.

He is coming back tomorrow

We are going to the exhibition this evening అంతేగాని యెప్పుడో భవిష్యత్‌లో చేసే పనికి కాదు

(c) అలాగే యీ tenseని – present continuous tenseని, పని ఆ క్షణంలో జరుగుతూ వుండకపోయినా, తాత్కాలికంగా జరిగే వొకపనికి, temporary actionsకీ, వాడచ్చు

I am working for an examination

He is reading Wordsworth

యీ పనులు ఆ క్షణంలో జరుగుతూ వుండకపోవచ్చు, కాని అప్పట్లో జరుగుతూ వున్నాయని తెలియజెయ్యడానికి వాడచ్చు

(d) మామూలుగా habitual actionకి simple or indefinite present tenseని వాడతారు కదా always, continually లాంటి మాటలతో ఆ action repeat అవడాన్ని సూచిస్తారుకదా యీ present continuousని కూడా ఆ నిమిత్తం వాడచ్చు అయితే తేడా అల్లా present continuousని వొక feelingనో, emotional aspectనో తెలియ చెయ్యడానికి వాడతారు Indefinite presentలో అది వుండకపోవచ్చు The child is always crying, యిక్కడ అర్ధానికీ The child criesకీ తేడా వుంది

యిక్కడ యింకో విషయాన్ని గుర్తించుకోండి కొన్ని verbsని సాధారణంగా continuous tenseలో వాడరు పంచేంద్రియ గ్రహణకి, perception of the five sensesకి, సంబంధించినవి: see, hear, feel, smell, taste అదేరకంగా feelingsనో, వొక mental stateనో తెలియచేసే verbsనీ continuousలో వాడరు

*a) Verbs of perception* see, hear, smell, notice, recognise, feel, taste.

*b) Mental state* think, feel, agree, disagree, believe, disbelieve, differ, doubt, find, have, expect, foresee, forget, imagaine, know, mear, hate, love, hope, notice, realise, recall, remember, recollect, recognise, think, trust, distrust, suppose, understand, want లాంటివి

*c)* యిక seem, signify, appear, belong to, consist of, owe, own, possess, contain, keep, matter, concern లాంటివి

యీ verbsని present continuous లో సాధారణంగా వాడకూడదనే నియమం వుంది కాని, deliberateగా ఉద్దేశ్యపూర్వకంగా five senses perceptionని వినియోగిస్తూ వున్నట్లయితే continuous tenseలో వాడేందుకు verbs వున్నాయి. ఉదాహరణకి 'I hear music' అంటున్నామంటే involuntaryగా, ప్రయత్నరహితంగా ఆ పని జరుగుతున్నట్టు. 'I see something' కూడా అంతే. కాని ఉద్దేశపూర్వకంగా ఆ పని చేసేటప్పుడు I am listening what you are telling me, I am looking at this picture, I am watching TV అని వాడచ్చు

అంచేత 'I am loving, 'I am hating' అని వాడకూడదు, యెంత గాఢంగా ఆ ప్రేమ, ద్వేషంవున్నప్పటికీ. 'I am owning ten houses' అనీ అనకూడదు యెంత స్వార్జితమైనా. I love, I hate, I own అంటూనే వాడాలి

అయితే యీ verbsలో కొన్నింటికి కొన్ని సందర్భాలలో ప్రత్యేక అర్థంలో వాడవచ్చు I find that I was wrong (యిక్కడ గ్రహించు అనే) you are continually finding fault with me (యిక్కడ యెంచు, ఆ బుద్ధి చూపించు అని) I think it takes place today (యిక్కడ అనుకోవడమే) I am thinking of shifting to another town (యిక్కడ considering the idea, యిక్కడ యోచించు అని)

యిలా అభ్యాసంద్వారా వీటిని తెలుసుకోవాలి.

**Present perfect Tense :**

Sub + has/have + past participle

యిక్కడ past participle form of the verb వస్తుంది. ముందుగా participle అంటే తెలియాలికదూ. 'participle is a 'minor part of speech, especially, short indeclinable one' అని Concise Oxford Dictionary meaning యిస్తోంది verb తోనే యిది యేర్పడుతుంది. Verb పనినీ, adjective పనినీ కూడా నిర్వహిస్తుంది. Present continuous చూసినప్పుడు 'v + ing' form అనుకున్నాం. verbకి 'ing' చేరే రూపమే present participle అలాకాక conjugationలో verbకి వుండే మూడోరూపాన్ని past participle అంటారు. Verb conjugation గురించి ఆఖర్న వివరంగా ప్రస్తావించుకుందాం ప్రస్తుతం మనకి యీ సందర్భంలో అవసరమైనదాన్ని చూద్దాం.

Verbకి 'present' రూపం Indefinite Present Tenseలో వస్తుందని చూశాం. దాన్ని past form past tenseలో వస్తుందని చూశాం ఉదాహరణకి 'work'. Past Tenseలో 'worked'. Present continuousలో 'working' అని **present** participle వచ్చింది యిప్పుడు present perfectలో past participle రూపం వస్తుంది

యీ present perfect tenseకి తెలుగులో సమానంగా వుండే క్రియా రూపంలేదు. అంచేత దీన్ని వాడడంలో భారత భాషల వాళ్లందరూ తప్పులు చేస్తారు Present perfectకి గాని, past tenseకి గాని, past perfectకి గాని (యీ tense తర్వాత చెప్పుకుంటున్నాం) తెలుగులో simple past tense అర్థమే వస్తుంది I have come, I came, I had come మూడింటికీ నేను 'వచ్చేను' అనే. కాని ఇంగ్లీషు వ్యవహారం ప్రకారం వొక దాని బదులు వొకటి వాడకూడదు

*Present Perfect Tense* ను యెప్పుడు యెలా వాడేదీ తెలుసుకునేముందు యింకో విషయం చూద్దాం.

He has come.

He is come

యీ రెండు వాక్యాల్లోనూ మొదటిది Present perfect రెండవది కాదు మొదటిది Present timeని తెలియజేస్తుంది రెండవదాంట్లో 'come' past participle అయినా అది sentenceలో 'complement'గా వుంది

*Present Perfect*ను యెప్పుడు వాడాలి?

(a) *action present time*కి పూర్తయివుండాలి అయితే దాని time వుండదు, కచ్చితంగా. I have gone there, we have eaten food పని జరిగిన కాలం, Past time indicating words వుంటే, indefinite past tense వాడాలి I went there yesterday We ate food last night

ఆ units of time mention అయిన దాన్నిబట్టి Past Tense, Present Perfect tense వాడాలి

in the evening,

at 8 A.M. or P M

in August, 1992.

Yesterday, day before yesterday

last year, last month, last night వగైరాలన్నీ Past indicationని అంచేత Simple Past Tense వాడాలి అలాకాక just, already, never, ever, this, recently లాంటివన్నీ Present perfect వాడడానికి వీలుండేవి

He has arrived today He has arrived this week

యిక్కడ యింకా ఆ Period of time ముగిసిపోలేదన్నమాట

(b) యీ Present perfectని Pastలో actionకి, వాటికి గనక presentతో connection వుంటే వాడచ్చు. అంటే ఆ action presentలో మళ్లీ repeat కావచ్చు.

I have seen him in college, అంటే మళ్లీ అక్కడ్నే అతణ్ణి కలుసుకునే అవకాశంవున్నట్టు. అంచేత 'I have seen Indira Gandhi' అనకూడదు. యేమంటే మళ్లీ ఆ అవకాశంలేదు కాబట్టి 'I saw Indira Gandhi' అనే అనాలి

Have you visited the museum? అని అడిగామనుకోండి ఆ museumని యింకా దర్శించే అవకాశంవుంది. అలా లేని పక్షంలో 'Did you see the museum?', అంటే యిక చూసే అవకాశంలేదు, అది మూతపడింది అని అర్థం.

(c) *With a period of time*కి యీ tense వాడచ్చు.

He has lived in the USA since 1980.

He has lived in the USA for ten years

అంటే యింకా అక్కడ continue చేస్తున్నట్టు

యిక్కడ 'since, for' అనే adverbsని వాడతారు. 'sinceని' Point of timeకీ, forని Period of timeకీ వాడతారు He has not eaten anything since yesterday, అన్నామనుకోండి అంటే యిప్పటికీ యింకా యేమీ తినలేదని.

He has been ill for ten days అన్నామనుకోండి. యింకా illness వున్నట్టు. He was ill for tendays అంటే యిప్పుడు తగ్గిపోయినట్టు, లోగడ పదిరోజులు illగా వున్నట్టు.

(d) *action* గతంలో మొదలై వుండచ్చు, కాని మాట్లాడేసమయానికి పూర్తయి వుండచ్చు. అప్పుడు, I have written this letter, యీ writing అప్పటికి అయిపోయింది

(e) *Time reference* లేని experiencesకి.

He has rarely visited us.

I have never seen him to be angry.

(f) *action* గతందే అయినా, దాని ప్రభావం యింకా Present మీద వున్నప్పుడు. India has won freedon, యిక్కడ freedom రావడం యెప్పుడో జరిగింది. అయితేనేం, దాన్ని యింకా experience చేస్తూవుంది. కాని time చెప్పామనుకోండి '1947' అని, అప్పుడు India won freedom in 1947 అని Past Tenseనే వాడాలి.

(g) *actionలో* future time గర్భితంగా వున్నప్పుడు,

When we have finalised the issue of sharing, we can think of division of it.

(h) *'Continuous tense' form* లేని verbsని Present Perfect continuous tenseలో కాక Present perfectలో వాడతారు

They have been here for two days. అంటే యింకా వున్నారు అని.

**Present Perfect continuous :**

Sub + have/has + been + v-ing.

She has been cooking since morning.

యీ tenseలో action గతంలో మొదలై presentకి యింకా continue అవుతూ వుంటుంది.

పై వాక్యం చూస్తే morning నుంచీ వంట చేస్తూనే వుందనీ యింకా ఆ పనిలోనే వున్నట్టూ, యింకొంచెంసేపు అదేపని జరగనూ వచ్చు అనీ తెలుస్తుంది.

యిలా action యింకా ముందుకు సాగకపోయినా, దేనికన్నా వివరణగానో,

కారణంగానో యీ tenseని వాడచ్చు. ఉదాహరణకి, I cannot attend the meeting, for I have been working all day యిక్కడ ఆ పని ముందుసాగే సూచనలు లేవు. కాని యిందువల్ల రాలేకపోవడం సూచితమవుతోంది.

అదేరకంగా, Do not mind his soiled clothes, he has been cleaning his apartment. ఆ కారణంగా బట్టలు మురికి అయేయని. అదేరకంగా అప్పుడా పూర్తయిన పనిని నొక్కిచెప్పేందుకు వాడచ్చు.

Be careful, the maid has been scrubbing the floor. యిక్కడ పని పూర్తయింది, కాని ఆ జారుడు వుండచ్చు కాబట్టి హెచ్చరిక.

**The Simple Past Tense**

Sub + Past form of verb

యిక్కడ verb third person విషయంలో మారదు. అంటే Present Tenseలో third person singularలో verbకి 's' చేరుతుందని చూశాం కదా, యిక్కడ అలా మారదు. Singular, plural numberకి సంబంధించి was/were వస్తాయంతే.

వర్తమానంతో యే సంబంధమూ వుండని Past actని యిది తెలియచేస్తుంది.

India attained freedom in 1947

She came home last week.

యీ tenseని *past time indicating adverbs* తో, *adverb phrases* తో వాడాలి ago, then, yesterday, last (week, year etc) at that time లాంటివి.

అదేరకంగా pastలో వొక పని over a period జరుగుతూ వుండడాన్ని వర్ణించేందుకు They worked the whole day His sister lived with parents for a year. He always carried an umbrella.

యిక్కడ యింకోవిషయం గమనించాలి: 'used to' అనే phraseని pastలో వొక discontinued habitని తెలియచెయ్యడానికి వాడతారు. (యీ used to గురించి anomalous finitesలో వివరంగా చూడచ్చు). He used to smoke. యిక్కడ వొకప్పుడు ఆ అలవాటు వుండేది, తర్వాత పోయింది అని

యీ Past tenseని pastలో repeatedగా జరిగే actionకి వాడతారు. They visited the shrine throughout their stay in that town She wrote to him once a month when he was in Moscow

యిదేమాదిరి వొక Past customని తెలియచెయ్యడానికీ వాడతారు The Indian Rajahs were crowned by purohits.

యిక బాగా గుర్తుంచుకోవాల్సింది Past tenseని Present time indicatingగా వాడడం·

I wish I had the money to buy a car.
You had better take rest.
('to infinite' స్థానంలో bare infinitive వస్తుంది)

I would rather, you went there tomorrow (I wish you అని)

యిదేమాదిరీ conditional clausesలో Past tense వస్తుంది

If you married her, you would have all comforts.
He stayed until she came.
She could not go, before he arrived.

**Past continuous Tense :**

Sub + was/were + v 'ing'.
He/She/I was going to market.
You/We/They were going to school.

యీ tenseని Pastలో వొక action continue అవుతూ వుంటే, ఆ given timeలో జరుగుతూ వుంటే, వాడతారు. ముఖ్యంగా మరో action జరిగినప్పుడు, యీ action జరుగుతూవుంటే దీన్ని వాడాలి

It was raining when we reached there.
While I was going to college, I saw him.

గతంలో వొక period of timeలో మొదట్నుంచి చివరిదాకా వొక పని జరిగినప్పుడు యీ tenseని వాడతారు.

What were you doing yesterday? (రోజంతా)
I was working the whole day.

యీ tenseని, Past tense మాదిరీ, repeated habitual actionకి వాడచ్చు.

He was always absconding from duty

యీ మాదిరిగానే వొక gradual developmentని imply చేసినప్పుడు, time గురించిన expression లేకపోతే యీ tenseని వాడచ్చు

The sea was surging.
It was getting darker.

యిక pastలో ఆ action నిర్దిష్టంగా continue కాకపోతూవున్నా, సాధారణంగా జరిగేటు వంటిదే అయితే Simple Past tenseకి బదులుగా యీ past continuousని వాడచ్చు.

I was buying vegetables in the market yeterday.
The MLA was addressing a meeting here the other day.

యీ పనులు uncommon కాదుకదా.

**Past Perfect Tense :**

Pastలో రెండు పనులు జరిగేయనుకోండి. వొకటి ముందు వొకటి వెనక జరగవచ్చు. వొకటి జరిగినప్పుడు మరోటి జరుగుతూ వుంటే పైన చూసినట్లు Past continuous వాడతాం కదా. అయితే యిక్కడ రెండూ పూర్తయినవే. కాని వొకటి ముందు, యింకొకటి తర్వాత జరిగితే అలాంటి వాటి సంబంధం తెలియచేసేదే యీ Past perfect tense మొదటి action ముందు పూర్తవడంవల్ల రెండోదానికి ఆ ఫలితం తగుల్తుంది. అలా పూర్తయిన previous, మొదటి, actionకి యీ past perfect వస్తుంది

Sub + had + Past participle.
When he had received the degree, he joined a job.
The train had left the station when we reached.

యీ Past perfect tenseని indirect speechలోకి direct నుంచి Present perfectనీ, Simple pastనీ మార్చేటప్పుడు వాడతారు.

He said, "I have met the officer".
He said that he had met the officer
He told me, "They did their home work".
He told me that they had done their home work.

అయితే సంఘటనల క్రమాన్ని, sequence of eventsని, 'before' లేదా 'after' అనే conjunctionsతో తెలియ చేసేటట్టయితే ముందు జరిగిన actionనీ past perfect అక్కర్లేకుండా simple past tenseలో వాడవచ్చు.

He left the meeting before I reached there
After the train left the station, he went there.

యీ past perfect tenseని hope, intend, suppose want, లాంటి verbsతో unfulfilled hopesకి వాడచ్చు.

He had intended to marry her
I hadn't for a moment expected that he would bluff like that. (అంటే ఆ expectation తప్పని, వాడు bluff చేసాడని)
I had hoped he would win

యిప్పుడు గుర్తుంచుకోవాల్సిన సంగతి యేమిటంటే: రెండు past actions లేనప్పుడు యీ tenseని వాడకూడదు.

I had gone to Delhi to visit our friend last month అనకూడదు. యిక్కడ రెండో Past action లేదు.

I went to Delhi అనే అనాలి

**Past Perfect continuous :**

యిది గతంలో వొక definite past timeకి complete అయిన actionని తెలియచేస్తుంది. అయితే ఆ time దాకా అది జరుగుతూ వుంది, వుండాలి, cotinue అవుతూ వుండాలన్నమాట.

Sub + had + been + v 'ing'.

I had been watching the TV before I went to bed

She had been waiting there for two hours when you came

I had been studying in college for three years when my father was transferred

## FUTURE TENSE

Presentకీ, Pastకీ మాదిరిగానే future tenseకీ యిన్ని విభాగాలూ వున్నాయి

Futureని తెలియచేసే విధానాలు యింకావున్నా future tenseని తెలియచేసేందుకు వున్న రూపం యిదీ

Sub + Shall/will + verb

యిది Simple future tense

*Future tense*ని తెలియ చెయ్యడానికి Shallగాని, willగాని సహాయక క్రియలుగా వస్తాయి అయితే shall/will అన్ని personsకీ వొక్కలా వుండవు.

'Shall' first person singular, pluralకి, వర్తిస్తుంది. 'will' మిగిలిన అన్ని personsకీ వర్తిస్తుంది. First personలో 'will' వాడితే determination, నిశ్చయంగానన్న, అర్థం వుండేది. కాని యిటీవలికాలంలో ఆ అర్థానికి బిగువుపోయింది Simple future actionని నిర్దేశించడానికి first personలో కూడా will వాడేస్తున్నారు. అయితే second, third personలో 'shall' వాడితేమాత్రం command అర్థంవుంది. 'you shall go' అని అంటే విధిగా వెళ్లి తీరాలన్న ఆజ్ఞ ద్యోతకం అవుతుంది. 'shall'ని second, third personలో simple futureకి వాడడం యిందువల్ల కుదరదు. దీన్ని అలా వాడితే ఆజ్ఞ, వాగ్దానం, బెదిరింపు అర్థంవస్తుంది Ten commandmentలో 'Thou shall not steal' అని ఆజ్ఞానువర్తిగానే ప్రయోగం కనిపిస్తుంది.

Simple futureని indicate చెయ్యడానికి first personలో 'will'ని వాడుతూ వున్నా కొన్నింటికి వాడకూడదు.

'Will I go?' అనకూడదు. 'Shall I go' అనాలి.

'Will I go' అన్నప్పుడు నాకు వెళ్లే ఉద్దేశ్యం వుందికదా అని. ఉందోలేదో యింకోడు యేం చెప్తాడు? అదేరకంగా 'I will be able', 'I will be glad' లాంటివి తప్పే. యీ సామర్థ్య సంతోషాలు మాట్లాడే వాడివేకాని వేరేవాళ్ల

అధీనంలోవి కాదుగా. 'shall, will' simple future tenseని తెలియచేసేందుకు వచ్చే modal auxiliaryలయినా అవి వున్నంత మాత్రాన్నే future indicate అవుతుందనుకోనక్కర్లేదు.

My son will be twenty by next summer.
Tomorrow will be a working day
12th will be Saturday

యీమూడు కూడా personal control లేని actions. యిక్కడ simple future అనే అనలేం.

We shall go tomorrow
She will visit us next week.
You will receive a good gift.

యీ మూడు వాక్యాల్లోనూ ఉద్దేశం, intention వెల్లడవుతోంది. వొకరకమైన భవిష్యత్ సూచన వుంటోంది

First personకి simple future indicationగా shallని, మిగిలిన personsకి willని వాడతారని ముందేచూశాం అయితే యీనాడు first personకి shall, will వాడుతున్నారు మిగిలిన వాటికి will మాత్రమే వాడుతున్నారు. మిగిలిన వాటికి 'shall' వాడితే ఆజ్ఞ, వగైరా అర్థాలుంటాయని పైన చూశాం.

shall/will యీ పురుషలకి (persons) వాడడంగురించి యింకొంచెం చూద్దాం.

I, weలకి will, మిగిలిన వాటికి shall ఉపయోగిస్తే willingness, promise, threat, obligation, certainity, determination లాంటి అర్థాలు వస్తాయి

I will carry your luggage (Willingness)
We will help the poor (Obligation)
I will lend you some money (Promise)
We will dismiss him (threat)
We will work hard (determination)
He shall get out (order)
They shall do this job (command)

'Will' habitual actionsనీ, ప్రత్యేక తరహా ప్రవర్తననీ తెలియచేస్తుంది

She will scrub the floor the whole day.

రోజంతా కడుగుతూనే వుంటుందని. రేపా, యెల్లుండా అనే ప్రసక్తిలేదు, యీపని ఆవిడ అలవాటు.

All metals will dissolve in nitric acid.

అలా dissolve అవడం యిక్కడ లక్షణం

'Should, would' past forms of shall, will 'would'ని మామూలుగా direct, indirect speechలో transformation అప్పుడు వాడతారు. She said, "I shall go home" అన్నవాక్యం She said that she would go home అవుతుంది.

(యీ shall/will గురించి Modal Auxiliary verbsలో ఇంకా వివరంగా చూద్దాం)

ప్రస్తుతానికి future indication యెలా జరిగేదీ చూద్దాం

**Future continuous**

Sub + shall/will + be + v 'ing'.
I shall be reading a book then.
They will be playing a match at that time

*Future continuous* భవిష్యత్‌లో జరుగుతూ వుందనుకునే పనిని తెలియచేస్తుంది

**Future Perfect**

Sub + shall/will + have + Past participle.
I shall have eaten food before you come.
They will have completed the enquiry before the inspection.

By next Monday, we shall have it done

అంటే యిక్కడ మరో future action జరిగేటప్పటికి యిది జరిగిపోయి వుంటుంది. "పదేళ్లల్లో పిల్లలు పెద్దవాళ్లవుతారు. వాళ్ల చదువులు అయిపోతాయి. కష్టాలు గట్టెక్కుతాయి."అని తెలుగులో భవిష్యత్‌లో పూర్తవబోయే వాటిగురించి చెప్పుకోరూ? ఆ మాదిరిగానే యీ future perfect tense కూడా.

యిక future కి perfect continuous వుంది. Future perfect continuous. Sub + shall/will + have + been + v 'ing'.

I shall have been writing my composition, by the time you return from market.

Futureలో వొక point of timeకి వొకపని జరుగుతూ వుంటే వాడే tense యిది

Tenseలన్నీ యెలా వుంటాయో చూశాం. యిప్పుడు Active voice, Passiveకి వెళ్లడం logicalగా వుంటుంది. అయితే verb రూపం Passive voiceలో మారుతుందనీ, Past Participle వస్తుందనీ యిదివరకే చూశాం Verbsలో transitive, intransitive వుంటాయని, transitive verbsకి Passive construction వుంటుందనీ కూడా చూశాం

Passive voice, Active voice చూసేముందు verb పొందే యీ రూపాలు చూద్దాం. దీన్ని conjugation అంటారు. అంటే verb person, number, tenseల కోసం పొందేమార్పులు. క్రియారూప నిష్పత్తి.

## Conjugation

Verbకి వుండే ప్రధానరూపాలు Present, Past, Past participle.

అయితే verbలన్నీ వొక్కలాగానే, వొక సూత్రాన్ని అనుసరించే మార్పు. భాషా చరిత్రలోకి వెడితేగాని దీనికి కారణాలు అర్థం కావు అంచేత formulaని బట్టి క్రియారూప నిష్పన్నతని అర్థం చేసుకోలేం. Verb pastలో యెలావుంటుందో, Past participleకి రూపం యెలా వుంటుందో అభ్యాసం వల్ల తెలుసుకోవాలి. ప్రధానమైన verbల conjugation అలవాటువల్ల పట్టుబడుతుంది. నిఘంటువుని బట్టి సందేహాలు తీర్చుకోవచ్చు.

ఈ క్రియా రూపాలు ఎలా వుండేదీ స్థూలంగా తెలుసుకుందాం. Formula అంటూ నిక్కచ్చిగా లేకపోయినా వాడకంలో కనిపించే కొన్ని క్రియల conjugation ఎలా వుంటుందో తెలుసుకుందాం

Verbకి 'ed', 'd' చేర్చి Past, Past Participle రూపాలు యేర్పడ్డం అదరికీతెలుసు. కొన్ని go - went - gone, write, wrote, written అంటూ మొత్తం రూపమే మారడం కూడా అభ్యాసంవల్ల నేర్చుకుని వుంటారు. అయితే యివి యెన్ని రకాలుగా వున్నాయో తెలుసుకుందాం.

Verbని strong verbs అనీ, weak verbs అనీ అంటారు.

Strong verbs అంటే – 'ed, -d, -t అనేవి present forms కి చేరకుండా past రూపంలో vowel change అయి ఏర్పడేవి. Weak verbs అంటే past form లో -ed, -d, -t లని చేర్చుకునో, లేక vowel shorten అయో, లేదా యే మార్పు లేకుండా అలా వుంటూనో యేర్పడేవి

Mixed verbs వున్నాయి అంటే యివి కొంతమేరకి strong, కొంతమేరకి weak. Weak verbs చాలా సంఖ్యాబాహుళ్యం వున్నవి. Strong verbs సుమారు వో వందా, వందయాభై వుంటాయి

కొన్ని strong and mixed verbs conjugation యిక్కడ తెలుసుకుందాం. మామూలుగా నిఘంటువుల్లో వీటి రూపాలు కనిపిస్తూ వుంటాయి. కాని strong verbs సంఖ్య యిక్కడ ప్రస్తావించుకోగల పరిమితిలో వుంది కాబట్టి వాటిని చూద్దాం

| Present | Past | Past Participle |
|---|---|---|
| Abide | abode | abode |
| | (abided) అనీ New Websters | Dictionary లో వుంది) |
| arise | arose | arisen |
| awake | awoke, awoke | awaken, awoke |
| be (is, am, are) | was/were | been |

| | | |
|---|---|---|
| bear (మోయు) | bore | borne |
| bear (కను) | bore | born |
| become | became | become |
| beat | beat (ఉచ్చారణ 'బీట్' అనే) | beaten |
| behold (to look at with attention) | beheld | beheld |
| befall | befell | befallen |
| beget | begot | begot |
| begin | began | begun |
| bind | bound | bound |
| bite | bit | bitten |
| break | broke | broken |
| blow | blew | blown |
| bid | bade | bidden |
| chide | chid | chidden, chid |
| choose | chose | chosen |
| come | came | come |
| cling | clung | clung |
| do | did | done |
| draw | drew | drawn |
| dig | dug | dug |
| drink | drank | drunk |
| drive | drove | driven |
| eat | ate | eaten |
| fling | flung | flung |
| fight | fought | fought |
| find | found | found |
| fall | fell | fallen |
| fly | flew | flown |
| forget | forgot | forgotten |
| forbid | forbade | forbidden |
| forsake | forsook | forsaken |
| freeze | froze | frozen |
| give | gave | given |
| grow | grew | grown |
| get | got | got, gotten |
| go | went | gone |
| hold | held | held |
| hang (వేలాడదీయు) | hung, | hung, |

| | | |
|---|---|---|
| hang (ఉరితీయు) | hanged | hanged |
| hide | hid | hid, hidden |
| know | knew | known |
| lie | lay | lain |
| mistake | mistook | mistaken |
| ring | rang | rung |
| ride | rode | ridden |
| rise | rose | risen |
| see | saw | seen |
| shake | shook | shaken |
| shrink | shrank | shrunk |
| sink | sank | sunk, sunken |
| shine | shone | shone |
| slay | slew | slain |
| smite | smote | smitten |
| sing | sang | sung |
| spring | sprang | sprung |
| sit | sat | sat |
| speak | spoke | spoken |
| seek | sought | sought |
| spin | span/spun | spun |
| stick | stuck | stuck |
| steal | stole | stolen |
| strike | struck | struck, stricken |
| swim | swam | swum |
| swing | swung | swung |
| sting | stung | stung |
| strive | strove | striven |
| stride | strode | stridden, strid |
| swear | swore | sworn |
| take | took | taken |
| throw | threw | thrown |
| tear | tore | torn |
| tread | trod | trodden |
| wear | wore | worn |
| wake | woke, waked | woken, woked |
| weave | wove | woven |
| win | won | won |
| wind (వైండ్) | wound | wound |

| | | |
|---|---|---|
| write | wrote | written |
| wring | wrung | wrung |
| withdraw | withdrew | withdrawn |

ఇవీ కొన్ని strong and mixed verbs ఇప్పుడు 'ed'ని, 'd'ని మాత్రమే చేర్చుకోకుండా Past tenseలో Past Participleలో మార్పు చెందే weak verbsని కొన్నింటిని చూద్దాం.

| Present | Past | Past Participle |
|---|---|---|
| bend | bent | bent |
| beseech | besought | besought |
| bleed | bled | bled |
| breed | bred | bred |
| bring | brought | brought |
| burn | burnt | burnt |
| but | bought | bought |
| build | built | built |
| catch | caught | caught |
| creep | crept | crept |
| deal | dealt | dealt |
| dwelt | dwelt | dwelt |
| dream | dreamt, dreamed | dreamt, dreamed |
| flee | fled | fled |
| feed | fed | fed |
| feel | felt | felt |
| kneel | knelt | knelt |
| learn | learnt, learned | learnt, learned |
| leave | left | left |
| lend | lent | lent |
| light | lit, lighted | lit, lighted |
| may | might | might |
| mean (ఉద్దేశించు) | meant | meant |
| meet | met | met |
| pay | paid | paid |
| rot | rotted | rotted, rotten |
| say | said | said |
| seek | sought | sought |
| send | sent | sent |
| sell | sold | sold |

| | | |
|---|---|---|
| sleep | slept | slept |
| smell | smelt | smelt |
| spell | spelt | spelt |
| speed | sped | sped |
| spend | spent | spent |
| spill | spilt | spilt |
| spoil | spoiled, spoilt | spoiled, spoilt |
| shoot | shot | shot |
| sweep | swept | swept |
| teach | taught | taught |
| tell | told | told |
| think | thought | thought |
| weep | wept | wept |

యిక మూడు రూపాల్లోనూ, అంటే Present, Past, Past Participle రూపాల్లో, మారకుండా వొక్కలాగే వుండే verbs వున్నాయి.

అవి bet, crust, cast, cost, cut, hit, hunt, let, put, rid, set, shed, shut, split, spread, thrust.

యిక మిగిలిన verbs చాలామట్టుకి 'd' కాని 'ed' గాని చేర్చుకుని యీ రూపాలు మార్చుకుంటాయి. అయితే lean, leap, sow లాంటివి 'ed' చేర్చుకుని మారినా, వాటికి leant, leant అని, leapt, leapt అనీ sowed, sowed/sown అనీ రూపాలున్నాయి. 'melt' melted melted అవుతూనే 'molten' అనే Past Participle రూపమూ నిలబెట్టుకుంది. అయితే యీ Past Participle రూపం adjective usageకి మాత్రమే పరిమితం అయింది. 'Molten copper' 'molten gold' అంటూ adjectives రూపాలు ఆ verbకి వున్నాయి.

యివేకాదు. పైన చెప్పుకున్న verbsలో కొన్నింటికి యిలా alternative Past Participle forms వున్నాయి. వాటిని యిలా adjectivesగా వాడడం కనిపిస్తుంది. Past Participle, adjective usageలో వుండడం సాధారణమే అయినా, Past Participle formలో వేరే రూపం వుండి, వొట్టి adjective usageలో వున్నవి యివి ఉదాహరణకి 'drink' అనే verb వుంది. drank, drunk అని రూపాలు యేర్పడతాయి. దీనికి Past Participleలో 'drunken' అనేరూపమూవుంది. దీన్ని adjectiveగా ప్రయోగించడం మాత్రమే కనిపిస్తుంది. యిలాంటివే 'shrunken', 'sunken', ill-'gotten', stricken, hidden, spoilt 'spoilt (child), burnt, learned, stricken, sown.

కొన్ని verbsకి Past tenseలో, Participleలో వేర్వేరు conjugations వున్నాయి, అక్కడ అర్థం మారుతుంది. ఉదాహరణకి 'hang'; hanged, hanged అంటే ఉరితీయడం, hung, hung అంటే వేలాడదీయడం. ఉచ్చారణలో వొకలా

వున్నా spellingలో మారి వేరే అర్థం యిచ్చేవి కొన్ని die - died, died; dye (రంగువెయ్యడం) dyed, dyed.

అదేరకంగా lay - laid, laid; lie, lay, lain; lie lied lied అనేవాటి తేడాలు గమనించాలి fall, fell, fallen; fell felled felled; find found, found; found founded founded వీటి తేడాలూ గమనించాలి.

lay అంటే దేన్నైనా వుంచడం, to put or place something down; put in a certain position దీనికి past tense laid, past participle laid.

Please lay the table
He laid his hand on my shoulder.

lie అంటే 'to rest' అని. దీనికి 'lay' అని past tense, lain అని past participle.

I always lie on my left side.
He lay on the grass enjoying the sunshine.
She has lain down to rest

lie అని ఇంకో రూపం వుంది దీనికి అబద్ధం చెప్పు అని అర్థం. దీనికి lied, lied conjugation

He lied to me.

find అంటే కనిపెట్టడం అనీ, వెతుకులాట తర్వాత దొరకడం అనీ అర్థాలు దీనికి found అని past tense past participle రూపాలు.

Did you find that pen?
He was found dead.

found అంటే స్థాపించు అని. దీని founded అని past tense, past participle రూపాలు.

This college was founded long ago.

యీ conjugationsని అభ్యాసంవల్ల నేర్చుకోవాలి.

## Active voice, Passive voice

Verbకి conjugation తెలుసుకుంటే Passive voiceలోకి వాక్యాన్ని మార్చడం పట్టుబడుతుంది. యేమంటే Verb Past Participle రూపాన్ని Passive voiceలో ప్రయోగిస్తారు.

ఇంగ్లీషు భాషలో, సంస్కృత భాషలో యీ Passive construction ప్రాచుర్యంగా వుంటుంది. తెలుగుభాషలో Passive పద్ధతిలేదు. లేదు అంటే సాధించడానికి వీలు

లేదనికాదు. భాషలో యీ పద్ధతి లేదని. Passive voiceలో 'కర్త' అంటే వాక్యానికి వున్న subject కర్మ ఫలితాన్ని అనుభవిస్తుంది. Active voiceలో subject act చేస్తూ వుంటుంది. పనినిచేసే కర్త, అంటే అలా act చేసేది యెవరో తెలియనప్పుడు Passive construction చాలా అనుకూలంగా వుంటుంది. ఇంగ్లీషులో 'it'తో అలాంటి వాక్యాలు మొదలుపెట్టి రాయడం సౌకర్యంగా వుంటుంది. తెలుగుభాషలో 'బడు' ధాతువు ఉపయోగించి వాక్యనిర్మాణం సాగుతుంది, కాని మాట్లాడేటప్పుడు యీ ప్రయోగంచేస్తూ మాట్లాడం వాడుకలో లేదు (ఉపన్యాసాల్లో యీ ధోరణి కనిపిస్తూ వుంటుంది). ఉదాహరణకి 'పరీక్షల్లో యేమిచ్చాడు?' అని అంటారు గాని 'యేమి యివ్వబడింది' అనరు. 'కుర్చీకోడు విరగ్గొట్టబడింది' అనరు, 'విరిగిపోయింది' అంటారు. దానంతట అది విరిగిపోకపోయినా, యెవళ్లోదాన్ని విరగ్గొట్టినా. 'అద్దం పగిలిపోయింది', 'వంట అయింది'అనే అంటారు గాని 'అద్దం పగల గొట్టబడింది', 'వంట వండ బడింది' అనరు. అంచేత Passive voice structure తెలుగులో అంతర్గతంగా లేదు.

దీన్నిబట్టి వొక విషయం గమనించాలి. ఇంగ్లీషులాంటి భాషలు నేర్చుకునేటప్పుడు ఆ భాషాసంప్రదాయాన్ని గుర్తించి నేర్చుకోవాలిగాని, మన మాతృభాష దృష్టితో దాన్ని చూడకూడదు.

Verbకి యీ active, passive రూపాలు వుండడంవల్ల లాభాలు వున్నాయి. subject (అంటే వాక్యంలో subject) పని యెవరు చేస్తున్నారో, అంటే 'కర్త', తెలిస్తే active voice లోనే verb వుంటుంది. తెలియనప్పుడు Passive voiceలో వుంటుంది. వ్యాకరణంలో వుంది అంటే భాషలో, ఆ ఆలోచనా విధానంలో అది వున్నట్టే. తెలుగుభాషలో అయితే అది తెచ్చిపెట్టుకున్నది, సహజం కాదు.

అసలు Passive voice యేసందర్భాల్లో తప్పని సరిగా వుంటుంది?

1. Subject, కర్త అనే అర్థంలో, unimportant అయినప్పుడో, తెలియనప్పుడో:

   Some militants were arrested.

   Has this goose been plucked?

యీ రెండు వాక్యాల్లోనూ subject స్థానంలో వున్నవి పనిఫలితాన్ని అనుభవించేవే. 'By whom?' అనేదానికి యిక్కడ జవాబు వుండదు, అది గ్రాహ్యం. యిలాంటి సందర్భాల్లో Passive voice యెంత సౌకర్యంగా వుంటుంది? తెలుగులో అయితే 'కొంత మంది తీవ్రవాదులు అరెస్టు అయారు' అంటారు. 'అరెస్టుచేయబడ్డారు' అనేది "బాగా చదువుకున్నవాళ్ల" భాష.

2. General truthsకి Passive voice వాడతారు, యిక్కడా 'కర్త'నిర్దిష్టం కాదు కాబట్టి.

   Promises should be kept.

   The poor will be given alms.

   Sacrifices are made for prosperity.

3 Action is more important than the person doing it, అంటే కర్త కంటే పని ముఖ్యం అయితే

The child was rewarded for bravery.

Sinners are punished.

The criminal was hanged

4 శాస్త్రీయపరమైన descriptionకి

Atom was split.

Water is formed of oxygen and hydrogen

A new comet was discovered

5. యిక ప్రకటనల్లో

Confiscated goods will be sold in auction.

Applications are received till 2 PM

Public telephone booth is opened here

6. పత్రికల వాళ్ల భాష యెక్కువ Passive voiceలో వుంటుంది తెలుగులో అయితే 'అనుకుంటున్నారు', 'అభిజ్ఞవర్గాల భోగట్టా' అని అసలు కర్త యెవళ్లో తేలకుండా రాస్తారు ఇంగ్లీషుకి ఆ బెంగలేదు Passive voiceలో హాయిగా చెప్పొచ్చు

The mob was tear gassed.

Three domes were pulled down

Some more ration shops were opened.

7 Invitations, పిలుపులు, లాంటి వాటిని Passiveలో చెప్తారు

You are cordially invited to the function

Passive voice యిన్ని రకాలుగా ఉపయోగపడుతుంది

8. అన్నిటికంటే యెక్కువగా active subject గురించి చెప్పదలచుకోనప్పుడు 'it'తో impersonal Passive construction చేస్తారు.

It is feared there are no survivors in the air crash

It is believed that the government will deploy para-military force

వ్యాకరణ సాధ్యంగా యీ active voiceని Passiveలోకి Passiveని activeలోకి యెలా మార్చాలి?

పైన verbకి వున్న Tenseలు చూశాం. యీ అన్ని tenseల్లోనూ Passive voice వుంటుంది యిదేకాక Modal auxiliary verbsలో పది క్రియలకి, to infinitiveకీ Passive voice వస్తుంది. interrogative sentencesకీ, superlative sentencesకీ Passive voice వస్తుంది. Prepositionతో వున్న intransitive verb వొకసారి transitive కావచ్చు. అప్పుడు దానికీ Passive voice వస్తుంది.

యిప్పుడు active voiceలో వుండే tense రూపాలకి Passiveలో అదే tenseలో ఆ రూపాలు యెలా వుంటాయో చూద్దాం.

యీ రూపాలు తెలుసుకునేముందు active నుంచి passive voiceకి మార్చే నియమాలు యేమిటో చూద్దాం. Degrees of comparison లో ఒక degree నుంచి మరో degree కి వాక్యాన్ని మార్చే సూత్రాలు చూశాం అలానే ఇదీనీ.

Active voiceకీ Passive voiceకీ ముఖ్యమైన తేడా యేమిటి? Active voiceలో 'కర్త' ఆ పనిని చేస్తూవుండడం కనిపిస్తుంది, అదేవాక్యానికి subject కదా. Passive voiceలోనూ వాక్యానికి 'subject' వుంటుంది. కాని ఆ subject పని ఫలితాన్ని పొందుతూవుంటుంది. Active voiceలో అయితే ఆ subject చేసే పని ఫలితాన్ని object పొందుతుంది యీ Passive voiceలో జరిగే ప్రధానమైన మార్పుయిదీ అంటే Active voiceలో object యేదో చూసి దాన్ని వాక్యానికి subjectగా వుండగలిగే రూపానికి మార్చాలి

1. Active voice "object" Passive voice "subject" అవుతుంది.

The tiger killed the deer. (Active)
The deer was killed by the tiger (Passive)
The Principal praised him. (Active)
He was praised by the Principal. (Passive)

Objectగా 'him' అనే రూపంలో వున్న pronoun form, subject స్థానంలో 'he' అవుతుంది.

2. Verb tense యేమిటో చూడాలి. దాన్నిబట్టి 'be' formకి వున్న ఆ తగిన రూపం తేవాలి.

పైన 'killed' Past tense. అంచేత 'be'కి Past రూపం 'was' (third person singular subject కాబట్టి) వచ్చింది. యిదేరకంగా రూపాలు వస్తాయి. (యీ రూపాలు యేమిటో చూసేందుకే tense గురించి పైన చూశాం. వాటి Passive రూపాలు కింద చూద్దాం.)

3. Verbకి Past past participle రూపం చూసి దాన్ని వాడాలి.

4 యిక సాధారణంగా 'by' వుంచాలి.

5. యిప్పుడు యీ 'by'కి active subject formని object form చేర్చాలి.

The deer was killed by the tiger అని అప్పుడు Passive voice వాక్యం యేర్పడుతుంది.

యిప్పుడు active నుంచి passiveకి మారే వాక్యరూపం మొత్తంమీద యెలావుంటుందో చూసి, వాటి tenseల రూపానికి వెడదాం

Active object, subjectగా మారిస్తే

Subject + be + Past Participle + by + object రూపం పొందిన subject అంటే active voice లో కర్త

### Simple Present Tense లో

| Active | Passive |
|---|---|
| Sub + Verb (third person singular)లో 's' చేర్చుకుంటుంది కదా) | Sub + is/am/are/ + Past Participle (by + object) |
| She cooks food | Food is cooked by her |
| We like them | They are liked by us |
| He helps me | I am helped by him |

### Present continuousలో

| Active | Passive |
|---|---|
| Sub + is/am/are + 'v ing' | Sub + is/am/are + being + Past Participle + by + object |
| He is writing a story | A story is being written by him |
| I am teaching a lesson | A lesson is being taught by me |
| They are washing clothes | Clothes are being washed by them |
| She is rewarding me | I am being rewarded by her |

### Present Perfect :

| Active | Passive |
|---|---|
| Sub + has/have/ +Past Participle | Sub + has/have + been + Past participle + by + object |
| I have done my duty | My duty has been done by me |
| He has solved the sums | The sums have been solved by him. |

### Simple Past Tense :

| Active | Passive |
|---|---|
| Sub + Past verb | Sub + was/were + Past participle |
| Milton wrote Paradise Lost | Paradise Lost was written by Milton |
| We bought clothes | Clothes were bought by us. |
| John wrote stories | Stories were written by John |

**Past Continuous :**

| | |
|---|---|
| Sub + was/were + 'v ing' form + object | Sub + was/were/ + being + Past participle |
| I was serving tea | Tea was being served by me. |
| He was shooting the birds | Birds were being shot by him. |
| She was breaking strings | Strings were being broken by her |
| They were singing a song | A song was being sung by them. |

**Past Perfect :**

| | |
|---|---|
| Sub + had + Past participle | Sub + had + been + Past participle |
| She had sung a song | A song had been sung by her. |
| I had finished my work before seven | My work had been finished by me before seven |
| They had seen the film | The film had been seen by them. |

**Simple Future :**

| | |
|---|---|
| Sub + shall/will + verb | Sub + shall/will + be + Past participle |
| We shall eat food | Food will be eaten by us |
| They will write that letter | That letter will be written by them. |
| I shall do the job | The job will be done by me. |
| You will help me | I shall be helped by you |

**Future Perfect :**

| | |
|---|---|
| Sub + shall/will + have + Past participle | Sub + shall/will + have + been + Past participle |
| I shall have read the book | The book will have been read by me |
| She will have cooked the food | The food will have been cooked by her |

పైన Present, Past, Future tenseలలో active, Passive voiceల రూపాలు చూశాం Present perfect continuousకీ, Past perfect continuousకీ, future continuousకీ Passive రూపాలు ప్రస్తావించలేదు. వాటికీ Passive రూపాలు వున్నాయి కాని వాటికి వాడుకలో వ్యాప్తి తక్కువ. హొట్టినే వున్నాయికదా అని తెలుసుకోవడం అనవసరం

యిప్పుడు simple futureలో shall/will అనే సహాయక్రియకి Passive voice రూపం యెలా వస్తుందో చూశాం యిదే మాదిరి should, would, can, could, may, might, ought, must అనే సహాయక్రియలకి Passive voice వస్తుంది. దీని సూత్రం వొక్కటే Sub + యీ సహాయక్రియ + be + Past participle.

| **Active** | **Passive** |
|---|---|
| We should respect teachers | Teachers should be respected by us |
| We can gain nothing here | Nothing can be gained here by us. |
| Somebody must send for a doctor | A doctor must be sent for (by somebody) |
| You may do this | This may be done (by you) |

పైన చూసినవన్నీ వొక object వున్న తరహా వాక్యాలు. రెండు objects వున్న వాక్యాలుంటాయి అప్పుడెలా Passiveలోకి మార్చాలి? యేమీలేదు, వొక objectని subject చేసి మిగతా rulesని మామూలుగానే పాటిస్తూ Passive చెయ్యాలి

'I gave him a toy', అన్న వాక్యం చూద్దాం యిక్కడ 'him' 'toy' రెండు objects (Object complement కాదు, object complement అంటే ఏమిటో పైన చూశాం కదా) రెండు objectsలో subjectగా దేన్ని తీసుకుని అయినా Passive voice చెయ్యొచ్చు

A toy was given to him by me
He was given a toy by me.

మరికొన్ని ఉదాహరణలు చూద్దాం.

He gave me a book
A book was given to me by him
I was given a book by him

She told him an interesting story
He was told an interesting story by her
An interesting story was told by her to him.

Active నుంచి Passiveలోకి transitive verbsని మామూలుగా మార్చే పద్ధతులు పైన చూశాం. అయితే intransitive verb తర్వాత Preposition వస్తే అది కొన్ని సందర్భాల్లో Passive voice చెయ్యడానికి transitive verb లాగానే వుంటుంది ఉదాహరణకి The beggar laughed at him అని వుందనుకోండి. దీన్ని He was laughed at by the beggar అని Passive voiceలోకి మార్చవచ్చు.

యింతవరకూ మామూలు statementలా వున్న వాక్యాలకి సంబంధించిన active voice, passive voice చూశాం. కాని వాక్యాలు యెన్నిరకాలుగా వుంటాయో

మొదటి పేజీల్లో చూశాం. Interrogative, Imperative వగైరాలని మరి వాటి verbsకీ active voiceలు వుంటాయికదా, వాటినీ Passiveలోకి మార్చాలి కదా, వాటిని కొన్నింటిని చూద్దాం.

## Interrogative sentences

*Interrogative sentences* అంటే ప్రశ్నలు అడిగేవి. Do, does, did, will, can, could, may, is, was, are, were, what, who, when, which, has, have లాంటివన్నీ ప్రశ్నలు వెయ్యడానికి తెచ్చుకునేవేకదా.Interrogative sentence వేటితో ప్రారంభమైనా అన్నిటికీ Passive voice వుంటుంది. Passive voice నియమాలని అనుసరించి Active Interrogativeని Interrogative గానే Passive చెయ్యచ్చు.

| | |
|---|---|
| Do we take milk? | Is milk taken by us? |
| Do they eat rice? | Is rice eaten by them? |
| Do you help them? | Are they helped by you? |
| Is she drawing water? | Is water being drawn by her? |
| Will you wash the clothes? | Will the clothes be washed by you? |
| Are they flying kites? | Are kites being flown by them? |
| Has she sold the cow? | Has the cow been sold? |
| Can you shoot the bird? | Can the bird be shot by you? |
| May I take the book? | May the book be taken by me? |
| Who broke this chair? | By whom is this chair broken? |
| What do you want? | What is wanted by you? |
| How did he help you? | How were you helped by him? |
| When did he close the shop? | When was the shop closed by him? |
| Who teaches you? | By whom are you taught? |
| Which shop sells milk? | By which shop is milk sold? |

యీ మాదిరిగా Interrogative sentencesని Passive చెయ్యగలం. యివికాక Imperative వాక్యాల్లో subject లోపిస్తుంది. సాధారణంగా యెదుట వున్న వ్యక్తిని ఉద్దేశించే చెప్పేదికాబట్టి verb తోనే వాక్యం ప్రారంభమవుతుంది. ఉదాహరణకి యీ మాదిరి 'Take this order' అనే వాక్యం వుందనుకోండి. దీన్ని Passive voice లోకి మార్చాలంటే యేంచెయ్యాలి? "Let" అనే మాటని తెచ్చుకుని 'be' రూపం అలానే వుంచి verbకి Past Participle వాడి Passive వాక్యం చెయ్యాలి. యెదటి వ్యక్తిని ఉద్దేశించి చెప్పేదే కాబట్టి active వాక్యంలో లోపించిన 'you'ని 'by you'గా మార్చాలి. సాధారణంగా 'by you'ని వదిలెయ్యెచ్చు. మనం యిప్పుడు పద్ధతి యేమిటో నేర్చుకుంటున్నాం కాబట్టి 'by you'ని వుంచుదాం. యీ పద్ధతి ప్రకారం, అంటే Passiveలోకి మార్చే నియమాల ప్రకారం పైవాక్యం 'Let this order be taken (by you)' అని తేలుతుంది.

Post this letter - Let this letter be posted (by you)

Recite a poem - Let a poem be recited.

అలా అని 'let' తోనే సర్వదా వాక్యం ఆరంభించడానికి వుండదు కొన్ని సందర్భాల్లో request వుండచ్చు, వొక ప్రతిపాదనలాంటిది వుండచ్చు. అప్పుడు సందర్భాన్ని చూసుకుని అదనంగా కొన్ని మాటల్ని తెచ్చుకోవాలి. యీ సందర్భాల్లో కూడా technicalగా 'let'కి అవకాశం వుండచ్చు. అయితే భాషాసంప్రదాయం వొప్పదు.

Eat this fruit అన్న వాక్యం వుందనుకోండి. 'you'ని అభ్యర్థించే కదా 'eat'ని వాడింది. అంచేత 'you are requested to eat this fruit' అని లోపించిన youని తెచ్చుకుని 'to'ని introduce చేసి ఆ వాక్యాన్ని retain చెయ్యడం మర్యాద Get up early in the morning - you are advised to get up early in the morning

అలాగే 'let us set to work' అని active లోనే 'let'తో ప్రతిపాదన వుందనుకోండి అప్పుడు, 'It is proposed that we should set to work' అని proposed వాడచ్చు లేదా దానిబదులు 'suggested' అని వాడచ్చు.

మరికొన్ని **Passive Patterns** చూద్దాం.

(i) Sub + Verb + Object + bare infinite

(Active) I saw him go

దీనికి

He was seen to go by me అని Passive.

The doctor felt his pulse drop (Active)

His pulse was felt to drop by the doctor (Passive)

See, hear, make, feel, bid, let లాంటివాటి తర్వాత activeలో bare infinitive వస్తే, Passiveలో to infiniteగా మారతాయి

(ii) Voice - to infinitive:

She is too young to marry. (Active)

She is too young to be married (Passive)

It is time to eat something (Active)

It is time for something to be eaten. (Passive)

(iii) negatives:

Sub + helping verb + not + verb + obj.

I donot like this picture. (Active)

This picture is not liked by me. (Passive)

We don't know them. (Active)

They are not known to us. (Passive)

She did not sing those songs. (Active)
Those songs were not sung by her (Passive)

Active నుంచి Passive లోకి మార్చడం యిప్పటిదాకా చూశాం Passive నుంచి కూడా activeకి మార్చడం చూసి యీ విషయం ముగిద్దాం

'Cake was eaten by me' యిది 'యే voiceలో వుందో చెప్పక్కర్లేదు కదా. దీన్ని active లోకి మార్చాలంటే ముందుగా యేం చెయ్యాలి? Active నుంచి Passive లోకి మార్చేటప్పుడు 'by' వస్తుంది అని చూశాం కదా, ఆ 'byని తీసెయ్యాలి తర్వాత వచ్చే object రూపాన్ని subject గా మార్చాలి. Passive voiceకి మూల భూతమైన 'be' formని తీసేసి, verbకి Passiveలో వచ్చే Past Participleని verb అసలు రూపానికి (Tenseని బట్టి, Personని బట్టి) మార్చాలి సరే subjectని objectగా మార్చాలి.

యీ సూత్రాల ప్రకారం 'cake was eaten by me' అన్న వాక్యాన్ని activeలోకి మారిస్తే 'by' పోతుంది. 'me'కి 'I' అని వస్తుంది 'be' form అయిన was పోతుంది 'eaten' అనే Past Participle బదులు 'ate' అని (వాక్యంలో Past tense వుంది కాబట్టి) వస్తుంది యిక్కడ subjectగా వున్న 'cake' object గదిలోకి వెళ్లిపోతుంది. 'I ate cake' అని active voiceలో తేలుతుంది మరికొన్ని ఉదాహరణలు చూద్దాం

| | |
|---|---|
| I am helped by Raju. | Raju helps me. |
| He will be scolded by her | She will scold him |
| A letter was/is/being written by her | She was/is writing a letter. |
| This letter has/had been written by him | Hehas/had written this letter. |
| It must be done by me | I must do it. |

సాధారణంగా కర్త యెవరో తెలియనప్పుడే Passive voice ప్రయుక్తం అవుతూవుంటుందికదా 'The thief was caught', 'Promises should be kept', 'Grey hairs are to be respected' లాంటివన్నీ Passiveలో యెందుకున్నాయీ అంటే నిర్దిష్టంగా కర్త యెవరైందీ చెప్పలేక పోవడమే కారణం. 'Thief'ని పోలీసులు పట్టుకున్నారా, యెవళ్లన్నా పట్టుకున్నారా అనేది తెలీదు అలాగే Promisesని యెవరు నిలబెట్టుకోవాలీ అంటే నువ్వు, నేను, వాడు అనికాదు. అందరూనూ. యిక్కడా యిదమిత్థంగా కర్త తేలదు. అంచేత యిలాంటివి Passiveలోనే వుంటే భాష సౌకర్యంగా వుంటుది తెలుగులో యెలా వుందో యీ ప్రకరణం మొదట్లో చూశాం యిప్పుడు యిక్కడ కూడా technicalగా active voice చెయ్యాలీ అంటే కర్తని పూరించాలి. Somebody caught the thief అనాలి యింతా చేసి, అక్కడా కర్త ఫలానా అని తేలలేదు 'ఎవళ్లో' అని అనాలి, తెలుగులోలాగా. One should keep one's promises' అని clumsyగా "అందర్నీ" కర్తల్ని చేస్తూ చెప్పాలి.

# MOOD

Voice గురించి చెప్పుకునేటప్పుడు Interrogative, Imperative వాక్యాల ప్రస్తావన తెచ్చాం. Verbకి voice మారడంలాగానే, వొక statement చేసే Verb mannerని బట్టి మారడాన్ని mood అంటారు. ఇంగ్లీషుభాషలో వో డజను verbs తప్ప మిగిలిన వేల verbsలో ప్రతి verbకీ అవిచేసే పనులనిబట్టి వాటి special form యేర్పడుతుంది. ఆ రూపాల్నే mood అంటారు. Indicative mood, Imperative mood, Subjunctive mood, Infinitive mood అనీ నాలుగు రకాలుగా విభజనవుంది. అయితే Infinitiveని separateగా చూసి three moodsనే moodsగా కొందరు చెపుతూ వుంటారు.

Infinitive విషయం విడిగా చూద్దాం, యేమంటే ముందుగా మొదటి మూడు moodsనీ చూద్దాం.

*Indicative mood*ని factsని expretss చెయ్యడానికి వాడతారు; I do not know him, It rains in monsoon season, He prays to god daily లాంటి వాక్యాల్లో మాదిరి. Questionsని అడగడానికి వాడతారు, Where do you live? Will he visit us? Do they understand our problem? లాంటివి అన్నమాట.

Factsలాగా assume చేసే suppositionలకి వాడతారు.

If he is a liar, he must be punished.
If she cooks in time, we shall eat and do our work.

*Imperative mood*ని commandsకీ, adviceకీ, requestకీ, entreatyకీ వాడతారు. Get out (command), Respect elders (Advice), Lend me five rupees, please (request). Kindly do this favour (entreaty).

Imperative moodని Present tenseలో మాత్రమే, second personని (you) ఉద్దేశించి మాత్రమే వాడతారు. యిక్కడ subject 'you' మామూలుగా లోపిస్తుంది. దీన్ని indirectలో చెప్పినప్పుడు command అనో, request అనో, advice అనో వాడి ఆ అర్థాన్ని తెలియచేస్తారు.

First personకీ, third personకీ యీ imperativeని వాడాలంటే 'let'ని ఉపయోగిస్తారు.

Let us go out for a walk, Let him read this.

యిక *subjunctive mood* వుంది దీన్ని వొక wishని, గాని, desireని గాని తెలియచెయ్యడానికి వాడతారు.

May God bless you - God be with you (good bye అనేది దీని short form)

Oh, that she were here.
I wish I were a minister.

వొక purposeని వెల్లడిచెయ్యడానికి వాడతారు

He works that he may earn money.
Be careful, lest you should slip.

వొక suppositionని తెలియచెయ్యడానికి వాడతారు.

Had he worked hard, he would have passed
Come what may, I will do it.
Who lives, if India dies

యేదో concessionని యిస్తున్నట్టు తెలియచేసేటప్పుడు వాడతారు.

What if he were here?
What though you were enemies.

యిక్కడ 'Though every attempt be made, we may face the danger' లాంటి వాక్యాలు, 'if he were here' లాంటి వాక్యాలు కొంత doubtని express చేస్తూనే వుంటాయి; indicativeలో 'if he is here' 'every attempt is made' అని చెపితే statement లో confidence of it happening తెలుస్తుంది. యిలాంటి సందర్భాల్లో Modern Englishలో indicative mood యెక్కువగా వాడుకలోకి వస్తోంది.

Subjunctive moodని conditional sentencesలో వాడతారు.

He behaves as if he were an MLA.
They commanded the boy, as if they were his parents.
He stood there, as if he were changed into a stone.

యీ సందర్భంలో 'conditional tense' గురించి చెప్పుకోవాలి.

అంటే యిది Tensesలో చెప్పుకున్న simple present, past, future లాగా timeని indicate చేసేది మాత్రమేకాదు. దీంట్లోకూడా simple, continuous, perfect, perfect continuous వుంటాయి. అయితే యివన్నీ అసలు ఆ tenseల మాదిరీ వుండేవే. వేరేరకమైన patternని కాదు ఆ tense pattern లోనే వుంటాయి. కాని conditional కాబట్టి 'If' clause తో condition వుంటుంది. యీ conditionsలో వొకటి జరిగితే యింకోటి జరుగుతుంది అని చెప్పేది వొక తరహాని.

యీ తరహాలో If = simple present + simple future వుండేవి future action తెలియచేస్తాయి.

If he comes, we shall go to picture.
If she asks me, I shall tell her this.

If + simple present + simple present వుండేవి habitual actionని తెలియచేస్తాయి.

If you teach me, I read the text.

యిదేరకంగా If you want to pass you must work hard.

If you meet him convey my regards.

If you are waiting for the bus, you had better join the queue.

యిక unfulfilled conditionని వున్నాయి. యివి యింకో తరహావి. యిక్కడ అది జరిగివుంటే యిది జరిగేది అని అంటే అసలు యేదీలేదు.

If I had bargained I would have got it cheaper.

If I had known I would have told him.

యివికాక unreal condition తరహావి వున్నాయి. యిక్కడ 'if'తో లేకపోతే 'as if'తో మొదలయే imaginary conditions అన్నీ Past tense లోనే వెల్లడవుతాయి. యివన్నీ contrary to fact గానే వుంటాయి. అంటే యివన్నీ factsకి contrary గానే, wishes గానే వుంటాయి

If wishes were horses, beggars would ride.

If I had money, I would give you.

She speaks as if she were a queen.

## Infinitive

*Finite'* అంటే పరిమితమైన అని అర్థం. verbs finite అంటున్నామంటే అర్థం అవి subjectకి, అంటే personకీ, numberకీ, timeకీ పరిమితం అవుతున్నాయి అని Simple Present, Past, continuous లాంటి tenseలన్నీ finite verbలే. Indicative, imperative, subjunctive moodsలో వుండే verbలన్నీ finite verbs అనే అంటాం.

అలాకాక subject numberకి, personకి, timeకి, limit కానివన్నీ Infinitiveలనే వ్యవహరిస్తారు.

To err is human, to forgive divine అనే వాక్యం వుందనుకోండి. యిక్కడ 'to err', 'to forgive' లని చూస్తే వీటికి వేరే subject లేదని తెలుస్తుంది. యివే 'is' అనే verb కి subjectగా వున్నాయి. యివి 'err' 'forgive' అనే verbలు చేసే actionని పేర్కొంటున్నాయి They merely name the action.

Infinitive moodకి usualగా 'to' అనేది గుర్తుగా వుంది. దీన్ని to infinitive అంటారు. యిది do, may, shall, will అనే auxialiary verbs తర్వాత, bid, dare, let, make, can, must, observe, feel, hear, watch, see, need లాంటి ప్రధాన verbs తర్వాత లోపిస్తుంది. I can (to)read. I heard him (to)speak. I saw him (to) do it.

అయితే యీ ప్రధానక్రియలు Passive voiceలో వున్నప్పుడు 'to' లోపించదు.

I saw him read this (active)

He was seen to read this (Passive)

'let' అనే verb వున్నప్పుడు Passiveలో కూడ 'to' లోపిస్తుంది He was let go by me (Passive)

అయితే 'had better', 'rather' అనేవాటి తర్వాత 'to' లోపిస్తుంది

You had better go now.

I would rather starve than beg.

యీ 'to infinitive' వాక్యంలో subjectగా, objectగా, లేక మరో verbకి complementగా వుండచ్చు.

యీ 'to infinitive'తో వుండే కొన్ని patternsని తెలుసుకుని మిగిలిన infinitive forms చూద్దాం

**Pattern 1**

The object of the verb is an infinitive

Sub + verb + (not) to - infinitive - etc

| | | | |
|---|---|---|---|
| She | wants | | to read now. |
| I | forgot | | to tell him this. |
| He | decided | not | to see us. |

**Pattern 2**

Verbకి తర్వాత noun గాని pronoun గాని రావడం, తర్వాత infinitive.

Sub + verb + noun/pronoun + (not) + to infinitive

| | | | |
|---|---|---|---|
| I | want | you | to read this letter. |
| He | told | his wife | to open the door. |
| They | wanted | us | not to be late. |
| She | asked | me | to sing a song |
| She | begged | him | not to go. |

**Pattern 3**

Verb తర్వాత adjective రావడం.

Sub + Verb + adj + to infinitive

The book is easy to read.

Your story is interesting to hear.

English is difficult to learn

**Pattern 4**

Infinitiveని వొక finite verbకి subjectగా వుంచడం.

It + to be(form) + Subject complement + to infinitive (subject)

It is a pleasure to talk to her.
It is difficult to convince you.
It is wrong to steal
It is dangerous to play with fire

**Pattern 5**

Infinitiveని purposeకి, aimకి వాడడం

Sub + verb + to infinitive

They came to talk to us.
She went to buy sweets.
We eat to live.

'To Infinitive' కాక Participle, gerund వున్నాయి Participle గురించి యింతకుముందు కొంత చూశాం.

'Participle' అనేది సగం verb, సగం adjectiveగా వుంటుంది. Participle మూడు రకాలుగా వుంటుంది, Present, Past, Perfect అని. Verbకి 'ing' చేరితే అది Present participle అవుతుంది. 'going', coming, eating, living లాగా. దీన్ని continuous tenseలలో వాడడం చూశాం. యిది adjectiveగా nounని qualify చెయ్యడం కూడా తెలుసుకున్నాం. 'These days we talk of flying saucers', 'All living creatures breathe' లాంటి ఉదాహరణల్లో యిది కనిపిస్తుంది. యివికాక absolute phrasesలో adjectiveగా వుంది:

God willing, we will succeed.
Weather permitting, we shall go out for a walk.

Past Participle అంటే verb conjugationలో మూడవది. 'd, ed, t, n, en'లతో అంతమయే verb రూపాలు వున్నాయికదా అవి. Wounded, teased, burnt, broken వగైరాలన్నీ యిలాంటివేకదా. Perfect tensesలో యీ రూపాలు వస్తున్నాయని చూశాం యిక Perfect participle అంటే 'having', 'having been' అనేవి ముందు వచ్చే Past Participles.

Having heard the lecture, we returned home.
Having been rewarded, the players came back.

## Gerund

Gerund అంటే verbal noun. Nouns in 'ing' with verbal meaning or with verbal meaning and function combined are called gerunds.

అంటే 'ing'తో వుండే యీ రూపం partly a verb and partly a noun. Verbకి Present Participle రూపం వుంది కదా, అదే యీ మాదిరి function చేస్తుంది. ఉదాహరణకి "I am reading a book" అన్నచోట Verb Present Participle రూపంలో continuous tenseలో వుంది 'Reading is a good habit' అన్నచోట అదే 'reading' అన్నపదం gerund.

My sister is fond of reading novels
Doing is more difficult than talking.

యీ వాక్యాల్లో reading, doing, talking అనేవి verbal nouns, లేదా gerunds, 'Reading' వొక prepositionకి objectగా వుంటే, 'doing' వాక్యంలోని verbకి subject గా వుంది.

అయితే gerundకీ Present participleకీ తేడాయేమిటి? రెండూ verbకి 'ing' వచ్చేరూపాలే Present Participleని adjective functionలో వాడితే, gerundని nounగా వాడతారు అంటే gerund verbal noun, present participle verbal adjective.

| Present Participles. | Gerund. |
|---|---|
| Walking along the road | He is very clever at gambling. |
| I saw a stray cow. | Swimming is a good exercise. |
| She saw me painting. | Talking is easier than doing |
| I found her reading. | |

Gerundకీ, Infinitiveకీ ఉపయోగాలు యించుమించు వొకటే. వాటిని వొకదాని బదులు వొకటి వాడవచ్చు. To see is to believe. Seeing is believing

అనేక verbs తర్వాత, verbal phrases తర్వాత gerundని గాని, infinitiveని గాని వాడచ్చు ఉదాహరణకి, to begin, to cease, to continue, to dislike, to dread, to tear, to hate, to intend, to like, to love, to neglect, to prefer, to propose, to recollect, of no use, to remember, to start, to try లాంటివి. వీటి తర్వాత gerund గాని, infinitive గాని రావచ్చు

To continue, to dread, to fear, to intend, to neglect వగైరా verbs తర్వాత gerund కంటే frequentగా infinitiveని వాడడం వుంది. అయితే cannot, could not for bear, to recollect, to remember లాంటి verbs తర్వాత gerundని యెక్కువ commonగా వాడతారు.

'Remember' అనే verb తర్వాత infinitive వస్తే futureకి refer చేస్తుంది, gerund అయితే Pastకి refer చేస్తుంది.

I must remember to ask him.
I remember seeing her when she was a little girl

'To try' అనే verbకి 'to make an attempt' అనే అర్థంలో అయితే infinitive, 'to make an experiment, to take up' (some job) అనే అర్థంలో అయితే gerund వస్తాయి.

Try to keep still for a moment.
He tried writing, painting and various other things to make a living.

Gerundని వాక్యంలో verbకి subjectగా, objectగా, prepositionకి objectగా, subjective complementగా, లేదా verbకి objective complementగా వాడచ్చు.

Seeing is believing (Subject)
Stop talking (object)
I am fond of eating (Object to Preposition)
His pastime is playing (Subjective complement)
I heard him singing (Objective complement)

Gerundని Compound nounలో భాగం అయినప్పుడు ఆ రెండు పదాలకీ మధ్య hyphen (-) వుంచాలి Hyphen లేకపోతే వేరే అర్థం వచ్చి Participle అవుతుంది. ఉదాహరణకి a walking - stick అన్న చోట చేతికర్ర అన్న అర్థం వస్తుంది. Hyphen లేకుండా Walking stick అంటే యేదో magic stick, నడిచేకర్ర అన్న అర్థం వస్తుంది.

Gerund అనగానే nouns formed from a verb అని కదా అర్థం. అయితే gerund రూపమే వుంటున్నా verb ఛాయలు యేమీ మిగలకుండా, పొట్టి nouns గానే గుర్తింపుపొందేవి verbal nouns. Gerund రూపమే వుంటుంది కాని వాటికి ఆ రూపం తప్ప యిక యే మార్పులూ వుండవు. యీ verbal nouns countable, uncountableగా కూడా వుంటాయి. వీటికి definite article ముందు రావచ్చు, adjectives రావచ్చు కొన్ని verbal nounsకి plural form వుంటుంది.

Have you finished washing (అంటే wash one's face వగైరా)
Take the washing to laundry (అంటే ఉతకాల్సిన బట్టలు)
I gave him many warnings (యిక్కడ countable, హెచ్చరికలు)
He listened to the singing of the nightingale (uncountable)
Have you seen the building? (definite article)
Painted green this looks a new building (adjective)

Savings, shavings, forebodings లాంటివి plurals వున్న రూపాలు.

యిక ఆఖరిగా split infinitiveని గురించి చూసి యీ విషయాన్ని ముగిద్దాం.

Split infinitive అంటే యేమిటి? వాక్యంలో adverbial adjuncts అనేక స్థానాల్లో వుండచ్చు. అర్థాన్నిబట్టీ, function బట్టీ వుంటాయి. అయితే verbకీ,

'to'కి మధ్యన adverbనో, adverb phraseలో వుంచడాన్ని, అంటే "to"ని "verb"నీ split చెయ్యడాన్ని split infinitive అంటారు. ఉదాహణకి to kindly grant leave, seems to partly correspond అనేలాంటి చోట toకి grantకి మధ్య kindly, toకి correspondకీ మధ్య partly వచ్చాయి. యిలా split infinitiveని వాడడం మంచిదికాదని stylistic reasons దృష్ట్యా కొంతమంది అంటూ వుంటారు. యిలా split చెయ్యడం passive formలో వుండదు. 'to be kindly granted', to తర్వాత 'be' form వచ్చేసింది. 'split'లేదు.

Stylistic reasons దృష్ట్యా infinitiveని యిలా split చెయ్యకూడదని అన్నా, పనిగట్టుకుని avoid చేస్తూపోతే style దృష్ట్యా యింకా clumsyగా తయారయ్యే ప్రమాదంవుంది. ఉదాహరణకి:

The government is trying to effectively prevent the loss of abkari revenue.

Split చేసినా meaningకి, styleకీ యిబ్బంది లేదు. కాని effectively to prevent అనో, to prevent effectively అనో అంటే split చేసినా వున్నంత అర్థస్ఫూర్తి వుండదు. అవసరం అయితే split చేసినా ఫరవాలేదు కాని అనవసరంగా split చేస్తూనూ పోకూడదు.

## Sequence of tense

Verbs గురించి పైన చాలా విషయాలు చెప్పుకున్నాం. యిక anomalous finities లేక auxiliary verbs గురించి తెలుసుకోవాలి ఆ subjectకి వెళ్లేముందు Sequence of tenseని గురించి చూద్దాం, యేమంటే పైన Present, Past, Future tenseల గురించి అధ్యయనం చేశాంగనక. యీ Sequence of tense direct, indirect speechలలో బాగా ఉపకరిస్తుంది.

Tenseని గురించి చెప్పుకునేటప్పుడు Perfect tenseలు presentతో, pastతో యే relationతో వుంటాయి, వుండాలీ అని ప్రస్తావించుకున్నాం అయితే వాక్యాలు అనేకరకాలుగా యేర్పడుతూ వుంటాయికదా. వాక్యంలో clauses వుంటాయని మొదట్లో చూశాం యీ clauses రెండో, అంతకంటే యెక్కువో కలిసి conjunction వల్ల వొక వాక్యం యేర్పడితే, ఆ clausesని Principal clause అనీ, subordinate clause అనీ విభజించుకుంటాం. యిప్పుడు conjunction లేకుండా independentగా వుండే clauseని Principal clause అంటారు. దానిమీద ఆధారపడి వుండే clauseని subordinate clause అంటారు. Principal clauseలో వుండే verb tenseని బట్టి subordinate clauseలోని verb tense వుండడాన్నే sequence of tense అంటారు.

Principal clauseలో verb present tenseలోనో, futureలోనో వుందనుకోండి తర్వాతవచ్చే clausesలో verb యే tenseలో నేనా వుండచ్చు.

She says that he is well.
he was well.
he will be well.

అంటే అర్థాన్నిబట్టి యిలా subordinate clauseలో యే tenseలో నేనా వుండచ్చు

అయితే Principal clauseలో verb presentలో గాని, futureలో గాని వుంటూ, subordinate clauses 'Purpose'ని తెలియచేసేటప్పుడు, subordinate clauseలో verb Present Tenseలో వుండాలి. 'May' అనే auxiliaryని వాడాలి.

We eat that we may live.
I shall help them that they may improve.

Principal clauseలోని verb pastలో వుంటే subordinate clauseలో verb కూడా pastలో వుండాలి. అంతేకాక 'that'తో కలిసి వచ్చే వాక్యంలోని (యిది indirect లో బాగా తెలుస్తుంది) Present tense, Past tense గానూ, Past tense, Past perfect గానూ వుంటాయి.

He said that he was alright
She said that her husband would leave for Bombay soon.
I was so weak that I could not walk.

యిక్కడ వొక మినహాయింపు, exception వుంది, rules అన్నిటికీ మామూలుగా వున్నట్టుగానే. Principal clauseలో verb pastలో వున్నా, తర్వాత వచ్చే clause లో వో universal truth ని verb refer చేస్తూవుంటే, అది Present tenseలోనే వుండిపోతుంది.

The teacher said that honesty is the best policy.
Galileo proved that the Earth moves round the sun.
She commented that the earth is round.

Principal clauseతో subordinate clause than, as much as, as well as అనేవాటితో కలుస్తూ వున్నప్పుడు, principal clauseలో past verb వున్నా, తర్వాత clauseలో verb అర్థాన్నిబట్టి యే tenseలో నేనా వుండచ్చు.

The value of a rupee was much greater than what it is now.
He liked me better than he likes you.
He treated me as much as he treats you.

కొన్ని వాక్యాల్లో Past tense, Present tense అర్థాన్నిబట్టి వొకే వాక్యంలో వుండవచ్చు.

Vijayanagara, which was once a prosperous city, is now in ruins.

Lest తర్వాత should వస్తుంది.

He works hard, lest he should fail
He is running, lest he should miss the train

యిక్కడ tense sequence గురించే చెప్పుకున్నాం, కాని syntax గురించి కాదు. Syntax అంటే వాక్య నిర్మాణ నియమాలు, rules of sentence construction (దీన్ని గురించి ఆఖర్న చూద్దాం).

Tenseని use చెయ్యడం గురించి యింకా వొకటిరెండు ఉదాహరణలు చూద్దాం.

It is time we commenced this Project. (Past tense, but Present time)

You had better take rest (Past tense, but Present time.) (had better తర్వాత to infinitiveలో వున్న to లోపించి bare infinitive వస్తుందన్న సంగతి యింతకుముందే చూశాం)

యిప్పుడు auxiliary లేక anomalous verbs అనే వాటిగురించి విపులంగా తెలుసుకుందాం.

## Auxiliary or helping verbs or Anomalous

Auxiliary verb అంటే యేమిటి? Verbని గురించి మొదట్లో ప్రస్తావించుకున్నప్పుడు కొద్దిగా చెప్పుకు న్నాం. Auxiliary verb అంటే 'a verb used to form the tenses, moods, voices etc. of other verbs' అని నిర్వచనం.

Verbsలో ordinary అనీ, auxiliary verbs అనీ రెండురకాలు. Ordinary verbsకి పరిమితి లేదనీ, auxiliary verbs సంఖ్యాపరిమితం అనీ కూడా మొదట్లో చూశాం. యీ auxiliary verbsనే anomalous finites, modal auxiliary verbs అనికూడా అంటారు. యివి 24 వున్నాయి. ఈ list మొదట్లో ఓసారి చూశేం. కాని వివరణ కోసం మళ్లీ చూద్దాం.

## 24 auxiliary verbs

| Root verb | Derivatives |
|---|---|
| be | is, am, are, was, were |
| have | has, have, had |
| do | do, does, did |
| shall | shall, should |
| will | will, would |
| can | can, could |
| may | may, might, |

must, ought, need, dare, used to

యిలా యెందుకు వర్గీకరించాల్సి వచ్చిందీ అంటే వీటిలో, is, am, are, was, were, do, does, did, has, have, had అనే 11 verbsని Principal auxiliary verbs అంటారు యివి మామూలు verbs మాదిరే మారే రూపాలతో వుంటాయి. అంటే isకి was, areకి were Past tenseలో వచ్చేటట్టు. Third person singularకి does రావడం, has రావడం యీ మార్పు గుణం వల్లనే shall, should, will, would, can, could, may, might, must, ought అనే పదింటినీ modal auxiliaries అంటారు, సూక్ష్మంగా modals అనీ అంటారు. need, dare, used అనేవి semi - modal auxiliary verbs లేదా semi-modals

యీ modal auxiliary verbs లేదా modals యేమిటో semi-modals యేమిటో చూసేముందు మొత్తంగా యీ auxiliary verbs, లేదా anomalous finites అని పిలిచే యీ verbs, యే function చేస్తాయో మిగిలిన verbsకి – అంటే ordinary verbsకీ – వీటికీ విభేదం యెక్కడుందో చూద్దాం ఉదాహరణకి,

I teach English

అన్న వాక్యం చూడండి. 'teach' అసంఖ్యాకమైన ordinary verbs లోదేకదా యిప్పుడు యీవాక్యాన్ని interrogative లోనో, negative లోనో చెప్పుకోవాలి. అప్పుడేం చెయ్యాలి? What do you teach? అనో, Do you teach English అనో 'do'ని తెచ్చుకుని ప్రశ్న అడగాలి అంతేకాని 'teach you English' అనిగాని, 'teach I English' అనిగాని అడగడానికి లేదు.

అదేవిధంగా negative చెప్పాలంటే "I teach not English' అనడానికి లేదు "I do not teach English" అని మళ్లీ 'do'ని తెచ్చుకోవాల్సిందే (do -దాని రూపాలైన does, didలలో, సందర్భాన్నిబట్టి యేదో వొకటి లేకుండా ప్రశ్నలు లేవు, negatives లేవు)

అంచేత, వోరకంగా చెప్పుకోవాలంటే, యీ 24 verbs లో ఏదో ఒకటి దాదాపు ప్రతి Interrogative, negative sentence లోనూ వుండాల్సిందే

యీ anomalous finits నిర్వహించే functions వివరంగా చూసేముందు modals అంటే యేమిటో కూడా పరిచయం చేసుకుందాం

Modals అంటే relating to the mood of a verb అని వీటిని permission, ability, possibility, probability, obligation, politeness, necessity మొదలైన భావాలని తెలియచెయ్యడానికి వాడతారు. I can teach English (ability), It may rain (Possibility), You must study well (obligation), You should go there (duty), May I come in? (politeness) లాంటివి ఉదాహరణలు.

యీ modal finitesని జరిగిపోయిన సంఘటనలకీ, definiteగా ఉనికిలో వున్న వాటికీ వాడరు

యిప్పుడు anomalous finites నిర్వహించే functions యేమిటో వివరంగా చూద్దాం.

Interrogatives, negatives, (పైన I teach English అన్న ఉదాహరణలో వున్నట్టు) short answers, tag questions, emphatic affirmatives యేర్పడ్డానికి యివి వుండితీరాలి.

యీ 24 Verbsకీ ప్రధానంగా వున్న functions చూద్దాం

మొదటగా

**Formation of negatives :**

*1. Negative form* చెయ్యడానికి యీ auxiliary తర్వాత not పెడితేచాలు Ordinary verbsకి అలాకాక యేదో వొక auxiliary తీసుకువచ్చి negative చేస్తాం. పైన I teach English అన్నవాక్యం చూశాం కదా యీ 24 verbsకి అలాకాక, వాటి తర్వాత 'not' వస్తేచాలు, negative యేర్పడుతుంది.

| | | |
|---|---|---|
| I shall go | - | I shall not go. |
| I can come | - | I can not come. |
| You ought to come | - | you ought not to come |
| She has gone | - | She has not gone. |

Ordinary verbs అలాకాక యీ auxiliary help తీసుకుంటాయి

| | | |
|---|---|---|
| I go | - | I do not go |
| He reads | - | He does not read |
| She cooked food | - | She did not cook food |

అంతేకాని I go not అనీ, she cooked not foodఅనీ అనకూడదు.

యిలా negative form కావడమేకాదు, spoken English లోనూ, informal written English లోనూ యీ negative 'not' ఆ anomalous finiteతో merge అవుతుంది, contracted form యేర్పడుతుంది.

I can come - I can not come → I can't come.
They are ready - They are not ready → They aren't ready.

అంటూ can't, aren't, didn't, wouldn't, won't, shan't అనే contracted రూపాలు యేర్పడ్డానికి యీ verbs function కారణం

2. రెండవ function, interrogative formation. వాక్యంలో subjectని స్థానం మారిస్తే, invert చేస్తే, interrogative యేర్పడుతుంది

| | | |
|---|---|---|
| He can speak English | - | Can he speak English? |
| She is right | - | Is the right? |
| They will come tomorrow | - | Will they come tomorrow? |
| They did not do it | - | Didn't they do it? |

యితర verbsకి question form కావాలంటే do-does-did రావాలి. I teach English - Do I teach English? She cooks - Does she cook? They went away - Did they go away?

3. యిక conversationలో question tagsకీ, short (yes, no) answersకీ, substitute verbకీ వగైరాలకీ యీ anomalous finites వుండాలి.

Question tag అంటే మనం వొక విషయం చెప్పినప్పుడు confirmation కోసమో, agreementని ఆశిస్తూనో అవతలి వారిని ఉద్దేశించి అడిగే short additions. తెలుగుభాషలో అయితే 'యేమంటావ్' అని అడుగుతూవుంటాం 'కదా' అని జోడిస్తూ వుంటాం. "యివాళ బాగా యెండగా వుంది, కదా?" "నేను లక్షసార్లు చెప్పేను, బుద్ధి రాలేదు నీకు. యేమంటావ్?" లాంటి మాటలు వినిపిస్తూ వుంటాయి. మనం వీటిని ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకుని, ఆభాషలోనూ ప్రయోగిస్తూ వుంటాం. 'It is very hot today, isn't it?', 'He is a careless fellow, what do you say?' అని తెలుగు, ఇంగ్లీషు ప్రయోగం చేస్తాం. అయితే యీ question tags విషయంలో Indianisms చాలా వున్నాయి. అసలు ఇంగ్లీషు భాషా సంప్రదాయానికి చెందనివి దొర్లుతూ వుంటాయి. అందుకనే Indian English అనేది విస్తరించింది.

ఇంగ్లీషులో question tags contracted formలో వుంటాయి (contracted form అంటే 'Don't I' లాగా వుండేవి). question tagకి subject సర్వదా pronoun మాత్రమే, noun రాదు.

Question tags యెలా form అవుతాయి?

(a) *affirmative statement*ని, negativeలో వుంచి, pronoun formలో subjectని repeat చెయ్యడం.

Gopal is a good teacher, Isn't he?

(b) *negative statement*ని affirmativeలోకి మార్చి subjectని repeat చెయ్యడం – It isn't proper, is it?

(c) యీ 24 verbsలోనూ యేదో వొకటి question tagలో వుండాల్సిందే. మామూలు verbsకి question tag యేర్పడాలంటే do, does, did, don't, doesn't, didn't question tag లో రావాలి.

I spoke English well, didn't I?
He came late, didn't he?
She sings well, doesn't she?

యీ ordinary verbకి negative 'not' 'do' - రూపాలతో గాని tag రాదు కాబట్టి, యీ 'do' రూపమే question tagలో repeat అవుతుంది, సమస్యలేకుండా.

She doesn't sing well, does she?
They didn't pass the test, did they?

యీ anomalous finites 24లోనూ యేదోవొకటి statementలో వుండాలి కదా. దాన్ని tag లో repeat చేస్తే question tag అవుతుంది.

I can write - can't I?
She mustn't see the film - must she?

వాక్యంలో యే *finite* వుందో దాన్ని మాత్రమే *repeat* చేస్తూ *question tag* వుండాలి. అన్నిటికీ *'Isn't it?'* అని మనం వ్యవహారంలో వాడుతూ వున్నట్టు అడగకూడదు. 'She doesn't sing well, Isn't it?' అని అడగడం భారతదేశంలో సర్వసామాన్యం. అయినా, అది తప్పు.

*(d) Short answer questions* వున్నాయి, అంటే yes or no అనే జవాబుని మాత్రమే అపేక్షించేవి. యిక్కడ అసలు verbని మొత్తంగా repeat చెయ్యనక్కర్లేదు.
Did he pass the examination? Yes, he did. లేదా, he didn't

యిక్కడకూడా pronoun మాత్రమే వస్తుంది, అసలు వాక్యంలో proper noun వున్నా.

Can Lata come here? Yes, she can. No, she can't.
Will Rama drive the car? Yes, he will. No, he won't.

*(d)* వొకళ్లకి సంబంధించిన విషయమే మరొకళ్లకి కూడా వర్తిస్తూవుంటే మళ్లీ వాక్యంగా దాన్నంతట్నీ repeat చెయ్యక్కర్లేకుండా యీ anomalous finite ఉపకరిస్తుంది.

I ate a mango, my wife also ate a mango అన్న వాక్యాల్ని I ate a mango, so did my wife అని సూక్ష్మంగా చెప్పచ్చు

*(f)* యిదేరకంగా వొకళ్లకి వర్తించనిది మరొకళ్లకీ వర్తించనప్పుడూనూ, I can not sit here longer, you can not sit either అన్న వాక్యం I can not sit here longer, nor can you అవుతుంది. యింకోవాక్యం: She did not write the composition. Her friend did not write the composition, either. దీన్ని She did not write the composition, nor did her friend అని తేల్చి చెప్పవచ్చు.

పైన చూసినట్టు short answers పద్ధతిలోనే వొక statementతో agree అవుతూనో, disagree అవుతూనో మనం జవాబు చెప్పేటప్పుడూ anomalous finiteని వాడతారు.

The map is fine. Yes, it is.
They say we shall win. Of course we shall.

ఇప్పుడు, మొదట అన్న వాక్యంలోనే anomalous finite వుంటే, అదే repeat అవుతుంది, agreement తెలియచేసేటప్పుడు ఆ వాక్యంలో anomalous finite లేకపోతే do, does, did వస్తాయి

She works hard. Yes, she does.
They came yesterday. Yes, they did.
You smoke too much. Yes, I do.

Negative statements తో agree అవుతూవున్నప్పుడు 'no' వచ్చి, auxiliaryకి not వస్తుంది. ఇక్కడ auxiliary 'not' merge అవుతాయి, contract అవుతాయి. పైన చూశేంకదా contraction గురించి.

We are not going there. No, we aren't.
He hasn't gone there No, he hasn't.

Assertive అయినా, negative అయినా ఆ statementలో agree అవుతూవుంటే పైన చూసినట్టు formula వుంటుంది. అలాకాక వొక assertive statement వుందనుకోండి. దాంతో మనం disagree అవుతున్నాం. అప్పుడు No అనో, oh, no అనో, but, no అనో వుండాలి.

I saw you at the cinema theatre - No, you didn't.
She is beautiful. No, she isn't.
I have done my best. No, you haven't.
He gave him his salary. No, he didn't.
Why did you go there? But, I didn't.

Negative statements వున్నాయనుకోండి. మనం ఆ negativeతో disagree అవుతున్నాం అప్పుడూ yes అనో Oh, yes అనో అంటూ auxiliaryని affirmativeలో వాడతాం.

He can't write a letter. Yes, he can. అయ్యో రాయకేం అని.
He doesn't like tea. Oh, yes, he does. అబ్బె, ఇష్టపడకేం అని.

ఇలా question tags, short answer questions, agreement, disagreement anomalous finitesతో యేర్పడ్డమేకాదు.Adverbs of frequency –అంటే sometimes, always, often, frequently, generally, ever, usually, rarely, seldom లాంటివి – యీ 24 finitesకి తర్వాతనే సర్వదా వస్తూ వుంటాయి. మామూలు verbకి అయితే ముందు వస్తూ వుంటాయి.

He is usually busy.
They are generally good.
She will frequently visit you.

మామూలు verbs అయితే ముందు వస్తూ వుంటాయి He always comes late. He never failed.

అయితే anomalous finiteని emphasize చెయ్యాల్సివచ్చే సందర్భాల్లో యీ నియమం సడలుతుంది. He never will give it to you.

Emphasis కోసం, anomalous finite మీద ఊనిక పెట్టి చెప్పవచ్చు. మామూలు verbs విషయంలో do/does/did అనే వాటిని ఉపయోగించాలి ఉదాహరణకి I can do this అని can మీద ఊనిక పెట్టవచ్చు. అదే మామూలు verb అయితే I do go there అని do తెచ్చుకోవాలి.

యిదే మాదిరి negative ideaని stress చెయ్యవచ్చు. ఆ negativeని వాక్యం మొదట్లోకి తెచ్చి. No sooner did he hear the news than he jumped for joy.

'So' అనే పదాన్ని వాక్యం మొదట్లోవుంచి adjectiveనో, adverbనో - stress చెయ్యవలసిన దాన్ని - తర్వాతవుంచి emphasis చెయ్యవచ్చు.

So fond was she of sweets that she used to eat them every day.
So much did he fear it, that he avoided going there.

యిప్పుడు auxiliary verbs అనీ, modal auxiliaries లేదా modals అనీ, semi-modals అనీ వర్గీకరించుకున్న యీ 24 verbsనీ విడివిడిగా చూద్దాం.

## Be

Base verb 'be' derivatives అయిన is am, are, was, were అనే అయిదూ anomalous verbsగా (a) continuous tense యేర్పడ్డానికీ, (b) Passive voiceలో అన్ని tenseలకీ ఉపకరిస్తాయి. (దీని Past participle 'been' రూపం, being రూపం Passiveలో యెలా వుండేదీ చూశాం).

Continuous tenseల ఉదాహరణలు Tenseలో చూశాం. కాని వొకటిరెండు ఉదాహరణలు మళ్లీ గుర్తుచేసుకుందాం. Present, Past, Future continuousలలో యీ 'be' రూపాలు: I am writing He is writing. They are writing; I was writing You were writing; I shall be writing. you will be writing.

యిక Passive: He was given a memo. You are awarded the prize. He will be rewarded properly. It, being a holiday we went to the beach.

యిలా continuousలో 'be' రూపాలు వున్నాయి యివికాక The flower is faded They are gone to public meeting లాంటి వాక్యాలు కనిపిస్తాయి. యివి Passive voice కావు, Verb Past Participle రూపంలో 'be' రూపాన్ని అనుసరించి వచ్చినా. యీ verbs intransitive కాబట్టి Passive voice కాదు.

యిక్కడ వొకానొకస్థితిని express చెయ్యడమే వుంది. అయినా యీ బాపతు వాక్య నిర్మాణానికి వాడుక తప్పింది.

'Be' forms – దీని derivatives అన్నీ అని అర్థం – Present tenseలో, Past tenseలో infinitiveతో వస్తే వొక agreementనో, arrangementనో, ఉద్దేశాన్నో తెలియచేస్తాయి. He is to attend this meeting. (arrangement అన్నమాట) She was to visit us this christamas, but she failed for some other reason. (యిక్కడ ఉద్దేశం) You are to go home at once (అంటే యీపని నువ్వు చెయ్యాల్సివుంది అన్న 'command యేదో వున్నట్టు). She is to be found at women's club. (అవకాశం)

'Be' forms యిక్కడ చెప్పుకున్నవన్నీ anomalous finite అనే విభాగానికి చెందినవి. యిలాకాక 'Be' forms full verbsగా వుంటాయి అంటే ordinary verbsగా వుంటాయి, continuous tenseలో, perfect tenseలో form కావడానికి help చేసే verbలు గానే వుండకుండా.

He is a doctor (యిక్కడ incomplete predication కాబట్టి full verbగా వుంది). Complete predication వున్నా వేరేవేరే అర్థంలో వుంటుంది. God is everywhere (exists)

'To be'కి వో indifinite person గాని, thingకాని represent చేసే noun subjectగా వున్నప్పుడు: There are many visitors in the lounge. There is a boy in the garden.

'Be' forms non-anomalousగా negative, interrogative, imperativeలలో వాడతారు. Why don't you be more reasonable? Be quiet, Don't be crurious అనేవి ఉదాహరణలు. యివికాక యింకా యీరకంగా దీని వాడకం కనిపిస్తుంది.

They are satisfied (mental condition). My mother is ill (physical condition).

He is twenty five years old.
How much is this book?
I am fifty five kilograms.
It is far from here.
What is the time?
What is the date?
It is noon.
It is five.
How old is he?

## Have

Has, have, had. యివి anomalousగా function చేసేటప్పుడు auxiliary verbగా Perfect tenses form కావడానికి ఉపకరిస్తాయి యీ Perfect tenses Present, Past, future timeలలో వున్నాయి. వీటి గురించి Tense అన్న విభాగం కింద విపులంగా చూశాం

యిప్పుడు haveకి వున్న యితర anomalous ఉపయోగాలు కొన్నింటిని చూద్దాం

'Have' గనక infinitiveతో వస్తే వొక obligation గాని necessityగాని వెల్లడి చేస్తున్నట్టు. యిలాంటి usageలో విధ్యర్థకద్యోతకంగా వుంటుంది I have to go now (I must అని) 'have' యిలా presentలో obligationని వ్యక్తం చేసినట్టే 'had' pastలో obligationని వ్యక్తం చేస్తుంది I had to go to the meeting, but he won' t let me go.

She had to visit us then.

యీ 'had' 'must'కి Past form లాగా పనిచేస్తుంది, mustకి past tense లేదు కాబట్టి యిది ఆ అర్థద్యోతకంగా వుంటుంది

'Have'ని causativeగా వాడే రూపం వుంది

Sub + have రూపాలు + object + participle
He had his house repaired.
She has the letter written.
They have their command obeyed.

యిక్కడ 'have' formsకి బదులుగా 'get' substitute చెయ్యొచ్చు.

ఉదాహరణకి He got the house painted.
He got the work done.

అయితే కొన్ని పన్లకి సంబంధించి యీ మాదిరీ చేయించుకోవడం కుదరదు. యింటికి రంగు వేయించుకుంటాం, ఉత్తరం రాయించుకుంటాం కాని మన వశంలో లేకుండా కొన్ని పన్లు జరిపించుకోవాల్సి వస్తుంది

He had his money stolen
He had his leg amputated.
He had his pocket picked

'Have'ని యిలా causative గానే కాకుండా యేదన్నా పనిని జరిపించేటట్టు అర్థం యిచ్చే వాక్యంలోనూ వాడతారు.

He had his audience laughing.
I shall have your car running.

యింతేకాక కొన్ని idiomatic phrasesలో 'had better' 'had rather', 'had sooner' వగైరా పద్ధతుల్లో వాడడం కనిపిస్తోంది (దీన్ని గురించి యింతకు ముందే చూశాం subjunctive mood లో) యీ వాడుకలో 'to' లేకుండా bare infinitive వస్తుంది.

You had better take rest.
You had rather walk than go by train.

యిక్కడ అర్థం presentకీ, futureకీ చెందుతుంది కాని pastకి కాదు.

Have/has/had పైన చెప్పిన auxiliary గానే కాదు, full verbsగా సహాయకారిగా కాక principal verbగా - కూడా వున్నాయి.

'Have' కలిగివుండు (possess) అనే అర్థంలో transitive verbగా వుంది.

Birds have wings She has blue eyes. I have a house.

దీన్ని అనేక తరహాల అర్థంలో వాడతారు. 'possess' అనే అర్థమే కాకుండా receive, experience, eat, drink అనే అర్థాల్లో నుడికార ప్రయోగం వుంది.

Do you have letters from your son? (receive)
I have a cold bath. (take)
Do you have notes for this lesson? (use)
She had coffee and I had tea (drink)
They have their breakfast at 8 O'clock.
Will you have a cigarette?
He has a pleasant experience.

Possess అనే అర్థంలో వాడినప్పుడు సామాన్యంగా Present continuous tense వాడరు. అంటే I am having two houses అని, నాకు రెండిళ్లు వున్నాయి అర్థంలో. Continuous tense లో ఈ విషయం చూశాం.

Anomalousకీ non-anomalousకీ తేడాయేమిటి?

Anomalousకి questions form చెయ్యడంలోగాని, negatives form చెయ్యడంలో కాని ప్రత్యేకత వుందని కదా చూశాం. Non-anomalous అయితే question formationకీ, negatives formationకీ do/does/did సహాయంగా వస్తాయి. యిక్కడ 'have'ని anomalousగా వాడితే,
He has gone there - He has not gone there?
Has he gone there? అని వాక్యాలు వుంటాయి.

'Possess' అనిగాని, యితర అర్థాల్లోగాని అయితే, అంటే principal verbగా అయితే యిలాకాక do/does/didలతో questionss వస్తాయి.

Anomalous - Have you a cold now (particular occasion)

Non-anomalous - Do you have colds? (generally)

Anomalous - Have you to attend office now? (the necessity then)

Non-anomalous - Do you have to attend office in the morning? (regularly)

Non-anomalous అయినప్పుడు, అంటే ordinary verb అయినప్పుడు ఆ verbకి questions, negatives యేర్పడే రీతిలోనే వీటికీ యేర్పడతాయి. do/does/did ల తర్వాత 'have' అనే రూపమే వస్తుంది కాని 'has, had' రావు.

## Do

*Do* అనే verb auxiliaryగా, Principal verbగా రెండు functionsతో వుంటుంది. యీ 'do' రూపాలే does, did, done. 'Does' third person singular present tense form, 'did' past tense form, 'done' past participle.

Ordinary verbs questionsగా, negativesగా యేర్పడ్డానికి present tenseలో, past tenseలో auxiliaryగా 'to do' form రావాల్సిందే.

**Negatives :**

| | | |
|---|---|---|
| She goes there | - | She does not go there. |
| I come now | - | I do not come now. |
| They went away | - | They didnot go away. |

**Interrogatives :**

| | | |
|---|---|---|
| I like it | - | Do you like it? |
| He writes well | - | Does he write well? |
| He arrived yesterday | - | Did he arrive yesterday? When did he arrive' |

"To do" తో మొదలయే questionsకి వచ్చే short answersలో repeat అవుతుంది.

Do you like sweets? Yes, I do./No, I don't.

Does he speak well? Yes, he does/No, he doesn't.

Did she meet you? Yes, she did/No, she didn't.

Questions tagsలోనూ, short answersలోనూ ordinary verbకి do/does/did రావడం చూశాం కదా. 'To do' functionsలో అదివొకటి.

యిదికాక emphasis కోసం auxiliaryగా 'to do'ని వాడడం కనిపిస్తుంది.

I do say that he is a fool.

He does speak well.

They did go there.

Negative imperatives form చేసేందుకు To do వస్తుంది.
Don't talk. Don't be silly.

Imperatives ముందర requestనో, invitationనో మరింత వొత్తి చెప్పేందుకు 'to do' వాడతారు.

Do come and dine with us.
Do tell us everything that happened.

అలాగే యెవళ్లన్నా permission to do something అడిగితే అలాగే నన్నట్టు చెప్పడానికి to do వాడతారు.

Shall I see the principal? Yes, do.
May I talk to him? Do

యిక 'do'ని principal verbగా వాడడం చూద్దాం. 'Do అంటే చేయు, perform అని అర్థం.

I shall do that work.

How do you do? అనే పలకరింపు సామాన్యంగా విన వచ్చేదేకదా. యిక్కడ బాగున్నారా అనే అర్థం. దీనికి జవాబు దీన్నే తిప్పి అడగడం ధర్మం, How do you do అని.

What is she doing?
He did all that by himself
You do what all you could do.

యీ వాక్యాల్లో 'చెయ్యి' అనే అర్థం. యీ అర్థంలో మామూలు verbs మాదిరే Interrogative లో, negativeలో 'do' helping verbగా వచ్చి యీ 'to do' వుంటుంది.

He does not do his duty.
They didnot do it themselves
I do not do as you say.

*Shall, Will; Should, Would.*

యీ shall, will గురించి future tense ని ప్రస్తావించుకున్నప్పుడు చూశాం

Auxiliary verbsగా shall, will future tense indicate చెయ్యడానికి ఉపకరిస్తాయనీ, shall first personకీ will మిగతా వాటికీ simple future ద్యోతకంగా వుంటుందనీ కూడా చూశాం. యీ సందర్భంలో సరదాగా వుండే ఓ పద్యంలోని పాదాలు గుర్తుచేసుకుందాం

(a) When used in the first person shall foretells,
In will a threat or else a promise dwells,
Shall in the second and third does threat
Will simply then foretells a future feat.

(b) 'I will', 'you shall', 'He shall', the speaker's will express.
'I shall', 'you will', "He will" the coming future guess.

పై పద్యపాదాల్లో చెప్పినట్టు 'shall' first person లోనూ, 'will' second, third personల లోనూ simple future tenseని తెలియచేస్తాయి

I shall see the principal tomorrow.
He will meet you tomorrow.
They will be back in an hour.

*Second, third persons*లో 'shall' వాడితే యేయే అర్థాలు ద్యోతకమవుతాయి?

(a) Command
You shalll not tell a lie.
He shall obey me.
They shall meet me

(b) Promise
She shall have her salary tomorrow.
You shall be rewarded.

(c) He shall be punished
They shall pay for it.

'Will' ని first person లో వాడితే willingness, promise, threat determination వెల్లడవుతాయి.

(a) Willingness
I will convey your message to him.
We will help you this way.

(b) Promise
I will give you the money you need.
We will look into that matter.

(c) Threat
Don't move, I will shoot you, if you do.
We will take revenge on them.

(d) determination
I will have my way.

యిప్పుడు Interrogativesలో, negativesలో వీటిని యెలా వాడతారు? అన్ని anomalous finites మాదిరీ వీటినీ invert చేసి questions form చేస్తారు. వీటికీ అసలు verbకీ మధ్య 'not' చేర్చి negative చేస్తారు. Shall I see him? Will he come? అనేవి యీరీతిలో యేర్పడ్డ questions. I shall

not see him. He will not come అనేవి negative forms. యివి మిగతా anomalous finites లాగా contract అయి 'shan't', 'won't' అవుతాయి I shan't come. They won't go.

## Should, would

యివి రెండూ shall, will auxiliaryలకి Past forms. యివి shall, willలకి వర్తించే rulesని అనుసరించే generalగా వర్తిస్తూ వుంటాయి. Indirect speech లోనూ, subordinate clauses లోనూ shall, willలకి Past tenseగా వస్తాయి. Principal clauseలో verb Past tenseలో వున్నప్పుడు యిలా వీటికి past రూపాలు వస్తాయి.

Should auxiliary verbగా Pastలో future tense form కావడానికి help చేస్తుంది I told them that I should do all I could. If clause లో emphases కోసం అన్ని persons లోనూ వస్తుంది. If she should return, I would convey your opinion.

'Lest' అనే conjunction తర్వాత, అన్ని persons లోనూ, verb యే tenseలో వున్నాగానీ 'should' రావాలి.

I went there lest he should misunderstand me.
He studied hard lest he should fail.

Dutyని, తప్పకుండా చెయ్యాల్సిన పనిని, ఉద్దేశించినప్పుడు మూడు persons లోనూ should వాడతారు. అదేరకంగా adviceకినీ.

I feel you should begin it now.
You should not misbehave in the class.

ఒక కోరికని, wish or desireని, indicate చెయ్యడానికి should వాడతారు.

I should very much like to perform this journey.

Probabilityని, వొకమేరకి uncertaintyని తెలియచెయ్యడానికి should వాడచ్చు.

I should think it is about fifty miles from here.

అదేరకంగా politeగా వుండేందుకు must స్థానంలో shouldని వాడతారు.

You should book your ticket early.
దేన్నైనా offer చేసేందుకు should వాడతారు. Should I help you?

## Would

యిది willకి Past tense form, auxiliaryగా Pastలో futureని indicative చేస్తుంది.

He said that he would visit you the following day.
She said that she would write the examination

Pastలో habitual actions తెలియజేసేందుకు 'used to'కి బదులుగా wouldని ఉపయోగిస్తారు, యిది మూడు personsకీ వర్తిస్తుంది

I would take a walk with her every morning.
As a child I would play cricket.
When they were children they would get up early.

మనం చెయ్యడానికి యిష్టపడే సంఘటనలకి would వాడతాం

I would like to have a cup of tea.
She would like to sing

Polite requestని తెలియ చెయ్యడానికి దీన్ని వాడతాం (could నీ యిలా వాడవచ్చు.)

Would you lend me some money?
Would you, please, do this for me?

అదేరకంగా అవతలి వాళ్లకి అభ్యంతరమా అన్న అర్థంలో దీన్ని వాడతారు

Would you mind if I smoke?
Would you mind if I close the door?

యీ would you mindతో gerundనీ యీ అర్థం యిచ్చేటట్టు వాడతారు

Would you mind writing on my behalf?

ఊహల్ని, కోరికల్ని wouldతో express చేస్తాం.

I wish she would marry him.
I wish you would talk politely.

If clauseలో wouldని వాడడం గురించి యింతకుముందు చూశాం. మరి రెండు మూడు ఉదాహరణలు యీ కోరికలకి, ఊహాలకి సంబంధించి చూద్దాం.

If I had wings, I would fly.
If I were you, I wouldn't do it.

Conditional tenseలో wouldని వాడడం గురించి కూడా చూశాం. Improbable conditionలో 'if only'తో వాడడం ఉదాహరణ: If only it would rain sovereigns!

'Would'ని it seems, అలా అనిపిస్తోంది, అనే అర్థంలో కూడా వాడచ్చు.

One would think, from his talk, that he had done something wrong.

'would be' అని సంభవించబోయే, జరగబోయే, యేర్పడబోయే వాటికి వాడతారు. It would be alright.

Negativeలో would not contract అయి wouldn't, won't అవుతుంది. Rejection అనే అర్థం వస్తుంది, వ్యతిరేకించడం, నిరాకరించడం అని.

I won't go there..
She is angry, because her child won't listen to her.
He won't help me.

యీ సందర్భాల్లో 'wouldn't'ని won'tకి బదులుగా వాడచ్చు, రెండు వొకటే అయినా.

## Can, could

Can అంటే 'be able to', 'to have the power to' అని అర్థం. 'గల', 'చేయగల' అని abilityని, powerని తెలియచేస్తుంది. Canకి Past tense రూపం could Futureలో దీనికి రూపం లేదు కాని 'be able to' అని వాడతారు (He will be able to do that అన్న వాక్యంలో లాగా). Can అంటేనే 'be able to' అని అర్థం కాబట్టి 'I can be able to come' లాంటి సాహస ప్రయోగాలు చెయ్యకూడదు. మన దేశంలో సామాన్యంగా యీ బాపతు వాక్యాలు వినిపిస్తూ వుంటాయి. కాని యిది తప్పు.

The principal can admit the students. (యిక్కడ ఆ power ద్యోతకం)
I can swim here (ability ద్యోతకం)
She can play violin (skill)
Can you speak English? I can drive.

She can cook European food. The child can learn it లాంటివన్నీ యీ ability ని, powerని తెలియ చేస్తాయి. వో ప్రత్యేక సమయంలో, వో ప్రత్యేక సామర్థ్యాన్ని ప్రదర్శిస్తే యీ canకి బదులు be able to, succeed in, manage to లాంటి పదబంధాల్ని వాడతారు.

I ran fast and was able to catch the train. (యిక్కడ ఆ సందర్భంలో మాత్రమే running వల్ల అందుకోగలిగాం).
We managed to reach there in time.
They succeeded in getting it done.

అంతేకాక 'can'ని equals, సమానహోదా వున్నవాళ్ళు, పరిచయస్థులూ వాడడం, could ని పరాయి వాళ్లకి superiors కి వాడడం ధర్మం.

'Could' can కి Past form. Indirect లో 'could' అనే past రూపం అక్కడ Present tense లోని can కి వస్తుంది.

He said that he could go home.

Main verb యీ pattern లో వున్నప్పుడు could ని తప్పనిసరిగా వాడాలి

I knew that I could borrow your car.

Condition గాని speculation గాని అర్థద్యోతకంగా వున్నప్పుడు could ని present meaningతో వాడాలి.

Could he get another job? (ప్రస్తుతం వున్న దాన్ని వదిలిపెడితే)
Could I get another chance? (ప్రస్తుతం వున్నది పోతే)

ఒకప్పుడు వున్న ability ని తెలియ చేసేందుకు could వాడతారు

He could walk two miles when he was a boy of eight

Can నీ, could నీ కూడా permission కోసం వాడచ్చు Can కి సంబంధించి పైన చూశాం అదే మాదిరీ

Could I borrow your pen?

యీ permission విషయంలో doubt వుంటే could తప్పకుండా వస్తుంది.

Could I ask you something?

యింతేకాక యిక గత్యంతరం లేదనుకొనే సందర్భంలో can't help, couldn't help అని వాడతారు.

We can't help pulling on like this.
Sorry, I have spoiled your carpet, I couldn't help it

Past tense లో could, was able వొకదాని బదులు వొకటి వాడచ్చు Past ability ని యిది తెలియచేస్తుంది.

I was able to finish writing it in time.

'Could' can కి Past tense అయినా గానీ Present tense ని signify చేసేందుకూ వాడచ్చు.

I could read it today.
I could do it now.

## May, might

'May' Present tense form, దీనికి Past form might అంటే 'be allowed to', 'to be permitted to' అని అర్థం. యివి Present tense form అనీ, Past tense form అనీ చెప్పినా Present లో రెండింటినీ వాడచ్చు

వీటిని Permission కి వాడచ్చు, request కి వాడచ్చు

You may go to school now
May I have your pen?
May I accompany you?
Might I accompany you?

చివరి రెండు వాక్యాల్లోనూ 'may' direct question అయితే might కొంత doubtనీ, hesitation నీ తెలియచేస్తుంది ఉదాహరణకి తెలుగులో 'రమ్మంటావా' అనే దానికీ 'రావాలంటావా' అనే దానికీ యెలాంటి భేదం వుందో అలాంటిదన్నమాట.

వీటిని possibility, సంభవం కాబోయే దానికి వాడచ్చు

It may rain today.
He may come.

ఏదన్నా కోరికని (wish) express చెయ్యడానికి వాడచ్చు.

May god bless you!
May he prosper in life

యేదోవొక ఉద్దేశాన్ని, purpose ని, express చెయ్యడానికి వాడచ్చు

He works hard so that he may pass.
Work hard that you may earn money.
మర్యాదగా, polite గా, అడిగేందుకు వాడచ్చు
May I take this book?

ఓ ప్రశ్నలో uncertainty ని నొక్కి చెప్పేటప్పుడు, అనిశ్చితంగా వున్నట్టు కనిపపించేటప్పుడు వాడచ్చు.

Who this girl may be?

యేదన్నా మినహాయింపుని, concession ని, యిచ్చేటప్పుడు వాడచ్చు.

However innocent he may be, he will be dragged into this case

కొన్ని idiomatic use లకి వాడచ్చు.

I wish, I may go.

'Might' may కి Past tense. 'may, might' లు రెండూ future action indicate చేసేవే అయినా Past tense లో మాత్రం might నే వాడాలి

Might ని may ని doubtful possibility కి వాడినట్టే వాడచ్చు అయితే ఆ possibility మరింత doubtful గా వుందనుకోండి అప్పుడు might నే

వాడతారు. It may rain కీ It might rain కీ తేడా అదే. He might visit you అనేది He may visit you కంటే more doubtful.

అలాగే మరింత polite గా వుండే questions కీ might వస్తుంది. Might I take your notes?

Suggestion కీ might వస్తుంది.

You might have a talk with him.
She might sound you on this point.

Wish కి కూడా might ని వాడతారు.

We hoped that he might succeed.

Purpose కీ వాడతారు.

He sacrificed his life that his offspring might thrive.

## Must

'Must' అంటే తప్పనిసరి, విధిగా వుండాల్సింది అని అర్థం. యీారకంగా 'compulsion' ని 'necessity' ని తెలియజేసే దీనికి యితరరూపాలు లేవు -do కీ did, done లాగా, can కి could లాగా. యిది యెప్పుడూ Present tense గానేవుంటుంది. Past tense రూపంలేదు. ఉదాహరణకి 'I must leave this place' అనే వాక్యంలో ఆ సమయంలో వెళ్లి తీరాలన్న necessity వుంది. అయితే Past tense లో అలాంటి necessity వున్నప్పుడు యెలా వ్యక్తం చెయ్యాలి? Must కి యిలా Present tense form మాత్రమే వుండడంతో Past నీ, యితర tenses నీ తెలియ చెయ్యడానికి 'have' కి వున్న tenses వస్తాయి. అయితే యీ 'have' రూపాలు Present necessity కీ వాడచ్చు must ని వాడినట్టు.

I must leave this place అనీ అనచ్చు, I have to leave this place అనీ అనచ్చు, Past tense లో మాత్రం 'I must leave this place yesterday' అని అనడానికి లేదు. 'I had to leave this place yesterday' అనే అనాలి. 'I shall have to leave this place soon' అని future లో అంటారు. 'Must' కి బదులు 'have/has to' ఉపయోగించవచ్చు కాని బయటి వాళ్ల అనుమతి గర్భితమై వున్నచోట 'have/has to' వస్తాయి, లేకపోతే must వస్తుంది. 'I must give up drinking; I have to give up smoking (external obligation).

Indirect speech లో 'must' 'had to' గా మారదు. He said, 'I must go' అనేది indirect లో He said that he must go అవుతుంది.

Must ని యెలా వాడతారు?

(i) determination కి.

We must write to him now.
I must help her at all costs

(ii) duty ని తెలియచెయ్యడానికి:

We must obey the law.
We must respect our elders.

(iii) Compulsion లేదా necessity ని తెలియచెయ్యడానికి:

We must visit the famine area.
The government must take care of the poor.

(iv) certainty or strong probability: తెలియజెయ్యడానికి .

He must be sixty.
They must be reaping the harvest now.

(v) inevitable, అంటే తప్పించలేని దాన్ని, తెలియ చేసేందుకు

We must all die.

## Need

'Need' అంటే మామూలు మాటగా అర్థం 'కావాలి, అవసరం, require, want' అని. మామూలు verb గా దీనికి అన్ని రూపాలు వుంటాయి. Third person present tense లో 's' చేరుతుంది. Negative లో questions లో do, does, did లు వస్తాయి

You need money now.
I need some cool drink.
He needs control.
Do you need my presence here?
Does he need your help?
We don't need to tell you.

అయితే 'need' modal auxiliary verb గా వున్నప్పుడు అన్ని tense రూపాలు వుండవు 's' రూపం రాదు. Do, does, did లేకుండా negatives, questions యేర్పడతాయి; need ని యెక్కువగా negative లో వాడతారు. యీ modal auxiliary గా, అంటే anomalous finite గా వాడేటప్పుడు 'అవసరంలేదు, not under the necessity to do something' అని అర్థం. 'must' విధ్యర్థకంగా వాడతామని పైన చూశాంకదా, 'must go there' అంటే 'వెళ్లి తీరాలి' అని కదా అర్థం. 'వెళ్లి తీరాల్సిన పనిలేదు' అని చెప్పడానికి 'you must not go there' అనకూడదు, యేమంటే యిక్కడ కూడా విధ్యర్థకమే అవుతుంది, 'వెళ్లకూడద'న్న ఆంక్ష పెట్టినట్టు అర్థం వెళ్లి తీరాల్సిన పనిలేదు లేదా అవసరం లేదు అని చెప్పడానికి 'need not' వాడతారు.

He need not go there.
You needn't go.
Need he go so early?

Need you go? No, I needn't.
I need hardly tell you.

Need + have + Past participle అనే structure ని 'అలా చెయ్యకుండా వుండాల్సింది' (కాని తొందర పడ్డావు)

I needn't have done this, చెయ్యకుండా వుండాల్సింది, (కాని చేశాను).
They needn't have come, రాకుండా వుండాల్సింది, (కాని వచ్చేరు).

## Ought

దీనికి వొకప్పుడు 'owe' అనేక్రియ Past రూపంగా వాడుక వుండేది యిప్పుడవేమీ మిగల్లేదు. దీనికి infinitive లేదు, participle లేదు, మరే యితర inflected రూపమూ లేదు. ప్రస్తుతం దీనికి 'must' మాదిరీ అన్ని tense లకీ, persons కీ, singular తో, plural లో 'ought' అనే వాడుక. యిది 'to infinitive' తో వస్తుంది. Negative లో 'ought not', దాని contracted form (అంటే didn't, can't లాగా) oughtn't వుంటుంది. దీన్ని యెలా వాడతారు?

(i) duty కీ obligation కీ:

You ought to have done that earlier
Such things ought not to be allowed.

(ii) advisable, disirable లేదా right అయిన వాటికి:

There ought to be more buses during the rush hours.
You ought to be more careful.

(iii) Probability ని తెలియచెయ్యడానికి.

That ought to be enough rice for four.
Her son ought to pass the examination.

(iv) Order, తప్పకుండా చెయ్యవలసిన పని అయితే:

You ought to be here on time.

Question గా Ought I to do this work? దీన్ని చెయ్యాలా అని.

యిక మిగిలిన వాటికి వెళ్లేముందు must, need, ought లని వొకసారి చూద్దాం. Must, ought లని obligation కీ duty కీ వాడతారు అని చూశాం. need ని యెలా వాడతారో చూశాం. యిప్పుడు యీ వొక్క విషయం గుర్తుంచుకుంటే చాలు: Duty గాని, obligation గాని లేదని చెప్పడానికి need n't, don't need to, don't have to లని వాడతారు. You needn't go, you don't need to go, you don't have to go అని అంటే వెళ్లాల్సిన అవసరంలేదు అని.

## Dare

దీన్ని మామూలు verb గాను, helping verb గాను కూడా వాడతారు.

దీనికి 'having courage or impudence enough to do something' అని అర్థం. Ordinary verb గా దీనికి verb కి వుండే రూపాలన్నీ వుంటాయి. Third person singular లో Present tense use లో 's' చేరుతుంది. 'to' infinitive వస్తుంది.

do, does did లతో negatives, questions యేర్పడతాయి.

He dares to say such things
Does he dare to jump across the stream?
He did not dare to return home.
I shall dare any danger.
How dare you come here?

యిక 'dare' ని modal auxiliary verb గా వాడినప్పుడు verb కి third person లో 's' రాదు. do, does, did లు లేకుండా negative లో వాడకం వుంటుంది.

He daren't ask me.
I daren't approach the principal.

## Used to

'Used' అనేమాట Past tense form. Present tense రూపం దీనికి లేదు. లేకపోవడమే కాదు. Past నీ Present నీ contrast చెయ్యడానికి దీన్ని వాడతారు. యేదన్నా idea of habit కి లేదా repetition implied అయివున్నప్పుడు వాడతారు. దీని తర్వాత to, infinitive వస్తాయి.

I used to smoke before my marriage.
He used to write regularly when he was abroad.

గతంలో వుండే అలవాటు, లేదా గతంలో repeated గా జరిగేపని తెలియ చేస్తాయీ వాక్యాలు. అంతేకాక గతంలో వుండే వొక ఆచారాన్ని, లేదా గతంలో అస్తిత్వంలో వున్న దాన్ని కూడా తెలియచేస్తాయి.

The Hindu kings used to be crowned by Purohits (ఆచారం)
There used to be a house there (there was).

గతంలోని అలవాటునీ, repetition నీ would తో కూడా express చెయ్యొచ్చు. అయితే 'used to' కీ would కీ తేడా యేమిటి? used to గతానికీ వర్తమానానికి contrast ని తెలియచేస్తుంది కదా, would అలాకాదు. 'Used to' గతంలో ఆ

పని హెకకొంత కాలం మేర జరిగినట్టు అర్థం అందిస్తే, would + infinitive వూరికే momentary action ని మాత్రమే తెలియచేస్తుంది

Questions లోను, negatives లోను used ని అనుసరించే 'to' వుండక్కర్లేదు.

Used he to go out into the garden after dinner?
He used not (or Usen't) to answer.

Calloquial, అంటే informal English లో, did తో question అడగడం వుంది. అప్పుడు 'Used' అని కాక 'Use to' అనే వాడకం

Did he use to go there regularly last year?

Question tags లో కూడా:

He used to write letters regularly then Didn't he? (or usedn't he?)

యీ 'used to' కి to be used to (accustomed) కి తేడా గమనించాలి

I am not used to this sort of thing (familiar)
He is not used to carrying heavy luggage. (అలవాటు లేదు)
She will soon get used to this type of work. (అలవాటు పడుతుంది)

'Used to' యిలా anamalous గా వున్న వాడకం చూశాం. అయితే 'Use' అనే మామూలు verb వుంది. దీనికీ, దానికీ తేడా గమనించాలి యీ 'use' అంటే "ఉపయోగించు, వాడుకొను"అని అర్థం. యిది regular verb. పై దానిలాగా అలవాటు వగైరాలని వేటినీ తెలియ చెయ్యదు.

What kind of glass did you use for the windows?
Did you use the pen I gave you?
May I use your name as a reference?
(అంటే ఉద్యోగదరఖాస్తులు వగైరాలలో reference)

He has used up all his strength.
Use others as you would like them to use you. (అంటే behave, వుండు, ప్రవర్తించు).

**Agreement of the verb with the subject :**

యిప్పటిదాకా anomalous verbs గురించి చూశాం. యిప్పుడు subject, verb agreement చూద్దాం. దీన్నే concord అనీ అంటారు. Agreement of the verb with the subject అంటే యేమిటి? 'the verb must agree with its subject in number and person'. క్రియ యెప్పుడూ కర్త యే పురుషలో వుందో (ఉత్తమ, మధ్యమ, ప్రథమ – ఇంగ్లీషులో Ist person, second person, third person-) దాంతో, number తో అంటే యేకవచనం, బహువచనం

(singular and plural) సమసిస్తూ వుండాలి. మన తెలుగుభాషలో మహత్, అమహత్ అనే విభజనబట్టి క్రియ వుంటుంది. Nouns లో gender గురించి చెప్పుకున్నప్పుడు యీ విషయం గురించి కొంత గమనించాం ఇంగ్లీషుభాషలో gender గురించిన బాధలేదు. He అయినా, She అయినా verb మారదు. 'అమె వచ్చింది,' 'అతను వచ్చేడు' అని తెలుగులో gender తో verb agree అవుతుంది, కాని ఇంగ్లీషులో she came, He came అంటూ వొకటే 'came' (కాకపోతే మరో verb అనుకోండి) అని వాడతారు

I am coming, He/She is coming, You are coming, They are coming, We are coming.

యిక్కడ am, is, are అనే verb రూపాలు అయా కర్తల person ని బట్టి వచ్చేయి

A chair is placed here.
Chairs are placed here.

వొకటే chair కాబట్టి 'is' అన్నాం, "chairs" సంఖ్య యెక్కువ కాబట్టి 'are' అన్నాం. Singular subject, plural subject లని బట్టి ఆ verbs మారుతూ వుంటాయి.

యిలా singular యేదో, plural యేదో చక్కగా తెలుస్తూ వుంటే యే verb వాడాలో యిబ్బంది లేకుండా తేల్చేయ్యొచ్చు. కాని అలా subjects విషయంలో లేనప్పుడు యీ agreement యెలా వుండాలో తెలుసుకొనే నియమాలనే యిక్కడ చూస్తున్నాం.

Verb should be of the same number and person as the subject - దీన్నే
agreement of the verb with the subject అంటాం.

1. Singular subject వొకటే వాక్యంలో వుంటే singular verb వాడేస్తాం. కాని two or more singular subjects ని 'and' కలుపుతూ వుంటే అప్పుడు వాక్యానికి subject plural అవుతుంది, verb plural లో వుండాలి.

Rama and Gopal are friends.
He and his brother are going to cinema.
She and I are classmates.
Time and tide wait for no man.

అయితే వొక సందర్భంలో and తో కలుస్తూ వున్నాగానీ, ఆ రెండు subjects వొకే భావాన్ని, idea ని వెల్లడి చేస్తూ వుంటాయి; అప్పుడు verb singular లోనే వుంటుంది.

Slow and steady wins the race.
Bread and butter is a wholesome food.
Brick and mortar does not make a university.

అదే రకంగా రెండు singular nouns వొకేవ్యక్తికో, వొకే వస్తువుకో refer చేస్తూ వుంటే verb singular లోనే వుంటుంది.

The poet and novelist is here
The orator and statesman has come.

యిక్కడ *poet, novelist* వొక వ్యక్తేనని, *Orator, statesman* వొక వ్యక్తేనని- అంచేత singular verb వచ్చింది. యిద్దరూ వేర్వేరు వ్యక్తులైతే plural వస్తుంది. యిద్దరూ వేరు అని తెలుసుకుందుకు మార్గం యేమిటి? అది యిక్కడ వాడే article, వొకసారే గనక article ని వాడితే ఆ nouns వొక వ్యక్తినే ఉద్దేశించినట్టు. అలా కాక article ని రెండు nouns ముందూ రెండుసార్లు వాడితే వాళ్లు వేర్వేరు అని అర్థం.

The poet and the novelist are here.
The orator and the statesman have come.

అప్పుడు plural verb వస్తుంది యెందుకంటే poet వేరు, novelist వేరు. Orator వేరు, statesman వేరు.

2. రెండు singular nouns ని కలుపుతూ వున్నా వాటికి ముందు each గాని every గాని precede అయివస్తే verb singular లోనే వుంటుంది.

   Each day and each hour brings us a fresh anxiety.
   Every man and every woman in the village was hit by the tragedy.

3. Two or more singular subjects, అంటే వొకటిగాని అంతకంటే యెక్కువ యేకవచన subjects or, nor, either....or, neither....nor లతో కలుస్తూ వుంటే singular verb వుంటుంది.

No man or woman is left untouched.
Either he or his wife is in the wrong.
Neither his son nor his daughter is present here.
Neither food nor water is available there.
Either my wife or I am to go there.

యీ సందర్భాల్లో రెండు subjects కూడా singular లో వున్నాయి కాబట్టి యిలా singular verb ని యిబ్బంది లేకుండా వాడగలిగేం. అయితే వొకటి singular subject, రెండోది plural subject అయినప్పుడు వాటిని or, nor లు కలిపేటప్పుడు యెలా? అప్పుడు plural subject ని verb దగ్గరిస్థానంలో వుంచి verb ని plural లో ఉపయోగించాలి.

Rama or his brothers are at fault.
Neither she nor her classmates are present.

అయితే or, nor లు కలిపే రెండు subjects వేర్వేరు persons కి చెందినవైతే verb సమీపంలో వున్న subject తో agree అవుతుంది.

Either you or he is wrong.
Neither the students nor the teacher is ready.

కాని యిలా మాట్లాడ్డం, రాయడం చెవికి యింపుగా వుండదు, శైలీరీత్యా. అంచేత plural subject ని verb కి దగ్గరగా చేర్చి plural verb వాడడం బాగుంటుంది. Neither the teacher nor the students are ready అని అంటే కటువుగా వుండదు

Either you are wrong or he is
Neither the students are ready, nor the teacher అనీ రాయచ్చు.

4 రెండు nouns with తోగాని, as well as తో గాని కలిసేటప్పుడు verb మొదటి noun తో agree అవుతుంది. అంటే మొదటి verb singular అయితే verb singular లో వుటుంది, రెండవ noun plural అయినా గానీ.

Gopal as well as his family is happy.
Kindness as well as mercy allows it.
The general, with his soldiers, was killed.

5 యిక collective nouns వున్నాయి – fleet, crew, multitude, government లాంటివి – వీటికి sense ని బట్టి singular గాని, plural గాని వస్తుంది. వ్యక్తం అయే idea, భావం oneness ది అయితే verb singular లో వుంటుంది. అలాకాక collection లోని individuals ని ఉద్దేశించినట్లయితే verb plural లో వుంటుంది.

The multitude was frightened at the sight of the lion.
The council has elected its president.
The committee was of one opinion (one body గా వున్న అర్థం)
The committee were divided in their opinions. (individual members of the committee ఉద్దేశ్యం)

Council, jury, cabinet లాంటి subjects అన్నీ యీ rule కిందకి వస్తాయి

6. మరికొన్ని nouns వున్నాయి. అవి రూపంలో, form లో, plural గా వుంటాయి. కాని అర్థం మాత్రం singular గానే వుంటుంది. అప్పుడు వాటికి singular verb వస్తుంది.

The news is true.
The wages (reward) of sin is death.

7. వొక plural noun specific quantity ని గాని లేదా amount ని గాని మొత్తంగా పరిగణించేటప్పుడు verb సామాన్యంగా singular లో వుంటుంది

A hundred rupees is not a big sum
Four weeks is a good holiday
Two - thirds of the city is in ruins
యిక్కడ 'are' రాదు.

యిదేరకంగా titles of books తో, sciences పేర్లతోకూడా, plural noun వొక దాని పేరుగా వున్నప్పుడు singular verb వస్తుంది

The Arabian Nights is an interesting book
Physics is an interesting science.
Mathematics is a difficult subject.
The United States has a big army

8. 'Either, neither, each, everyone, many a' must be followed by a singular verb:

Either of the two boys is suitable.
Neither of the two girls is beautiful.
Each of these boys has done his best.
Each one of these men is reliable.
Every one of the boat's crew was drowned.
Many a man is tempted by gold.
None of these students is hard working
Any of the four questions was to be attempted.

9. Relative pronoun సర్వదా దానికి ముందు వుండే antecedent number తో, person తో agree అవుతుంది.

I am a person who seeks my children's welfare
The child, whose parents are dead is called an orphan.
He is one of those men who know everything.
I, who am your friend, will stand by you.

10. One of the best, the first of many లు వస్తే verb plural లో వుంటుంది.

This is one of the best books I have ever read.

యిప్పుడు 'errors due to proximity' యెలా వుంటాయో కొంచెం చూద్దాం.

సాధారణంగా అసలు subject తో కంటే, proper subject తో కంటే, verbకి దగ్గరగావున్న subject తో verb ని singular గానో, plural గానో చేసేస్తూ వుంటారు. యీపైన చెప్పుకున్న rules లో కొంత వాటి విషయం తడిమాం కాని అసలు యెలా తప్పులు దొర్లేదీ, యెలా సరిదిద్దుకోవాల్సింది చూద్దాం.

(a) Not one of his essays have ever been printed.
(b) A series of lectures have been arranged.
(c) By that time two weeks' salary were due.

యీ మూడు వాక్యాల్లోనూ errors of proximity వుంది. అసలు subject తో కాక nearest subject తో verb agree అయ్యేట్టు రాయడం కనిపిస్తుంది, అదే error of proximity.

వాక్యం (a) లో అసలు subject essays కాదు, not one. అంచేత 'have ever been published' అనకూడదు, 'has ever been published' అనాలి. (b) 'a series' singular idea ని denote చేస్తుంది, అసలు subject అదే, 'lectures' కాదు అంచేత 'has been' అని వుండాలి. మూడోదాంట్లో కూడా 'was' వుండాలి

యింతవరకూ verb ని ఉపయోగించే విధానాలగురించి తెలుసుకున్నాం. ఆధునిక ఇంగ్లీషు భాషలో వాక్య నిర్మాణానికి సంబంధించిన patterns ని develop చేశారు. వాటి ఆధారంగా వాక్యనిర్మాణ విధానాన్ని విద్యార్థులకి భాషని నేర్పడం సులభం అవుతుందని భావన. ఆ విభాగం కూడా యీ verb పరిచ్ఛేదం కిందికే వస్తుంది. అయితే భాషా భాగాలలో యింకా మిగిలివున్నవాటిని, Direct, indirect speech లాంటి వాటినీ చూసి యీ patterns ని చూద్దాం.

యిప్పటివరకూ అన్ని పరిచ్ఛేదాల్లోనూ అనుసరించిన పద్ధతినే యీ verb విషయంలో కూడా అనుసరించి, యిప్పటివరకూ అధ్యయనంచేసిన అంశాల correct, incorrect వాక్యాల అభ్యాసంతో దీన్ని ముగిద్దాం.

| Incorrect | correct |
|---|---|
| 1. What you are saying? | What are you saying? |
| 2. Why you can't come? | Why can't you come? |
| 3. Tell him where is the Post Office. | Tell him where the Post Office is. |
| 4. Ask her why does she want a hundred rupees. | Ask her why she wants a hundred rupees. |
| 5. Why he has gone to Madras? | Why has he gone to Madras? |
| 6. Please tell me why are you going there. | Please tell me why you are going there. |
| 7. Why you washed those clothes? | Why did you wash those clothes? |
| 8 When you passed your examination? | Whe did you pass your examination? |
| 9. What she cooks for dinner? | What does she cook for dinner? |
| 10. I am loving her. | I love her. |
| 11. He is hating his master. | He hates his master. |

| | |
|---|---|
| 12. She is liking the saree. | She likes the saree. |
| 13. I am believing you. | I believe you. |
| 14. We are going out for a walk every morning. | We go out for a walk every morning. |
| 15. She is not belonging to our club anymore. | She does not belong to our club anymore. |
| 16. I have seen the film yesterday. | I saw the film yesterday |
| 17. He had gone to Bombay yesterday. | He went to Bombay yesterday. |
| 18. She has passed the examination two years ago. | She passed the examination two years ago. |
| 19. I lived in Hyderabad since 1960 | I have lived in Hyderabad since 1960 |
| 20. I did not hear from you for a month. | I have not heard from you for a month. |
| 21. He has arrived a week ago. | He arrived a week ago. |
| 22. The new theatre has been opened last Sunday. | The new theatre was opened last Sunday. |
| 23. I am working here for the last ten years. | I have been working here for the last ten years. |
| 24. He is writing the letter for two days. | He has been writing the letter for two days. |
| 25. When he reached the station the train left. | When he reached the station, the train had left. |
| 26. She died before her brother arrived. | She had died before her brother arrived. |
| 27. By the time we arrived at the college, the Principal left | By the time we arrived at the college, the Principal had left. |
| 28. When I had joined the college, I completed twenty years of service. | When I joined college, I had completed twenty years of service. |
| 29. I will go by the time she will come. | I shall have gone by the time she comes. |
| 30. He will wait for you till you will finish it. | He will wait for you till you finish it. |
| 31. Please meet them when you will visit Hyderabad. | Please meet them when you visit Hyderabad. |
| 32. She may leave, before I shall be free to meet her. | She may leave before I am free to meet her. |
| 33. If you will work hard, you will get promotion. | If you work hard you will get promotion. |

| | |
|---|---|
| 34 You are going to Delhi, Isn't it? | You are going to Delhi, Aren't you? |
| 35. He likes you, isn't it? | He likes you, doesn't he? |
| 36. He left this place, isn't it? | He left this place, didn't he? |
| 37. They are joking, isn't it? | They are joking, aren't they? |
| 38. He can read English, isn't it? | He can read English, can't he? |
| 39 She is not beautiful. No, she is! | She is not beautiful. Yes, she is! |
| 40. His father gave him the money. Yes, he didn't. | His father gave him the money. No, he didn't. |
| 41. If I was you, I should not do it. | If I were you, I should not do it. |
| 42. I wish I was there. | I wish I were there. |
| 43. I said him to go. | I told him to go |
| 44. He told me 'go away'. | He said to me 'go away'. |
| 45. The murderer was hung. | The murderer was hanged. |
| 46. The hen has lain eggs. | The hen has laid eggs. |
| 47. He laid under the tree. | He lay under the tree. |
| 48 The subject is hard to be learnt. | The subject is hard to learn. |
| 49. I never have, never shall talk to that girl. | I never have talked, and never shall talk, to that girl. |
| 50. The king, with his ministers, have come. | The king, with his ministers, has come. |
| 51. Raghu as well as Ramu have come. | Raghu as well as Ramu has come. |
| 52. You speak as if you don't know the facts. | You speak as if you did not know the facts. |
| 53. Nothing but cinema and play make him happy. | Nothing but cinema and play makes him happy. |
| 54. He made me to do this work. | He made me do this work. |
| 55. Dare he to do it? | Dare he do it? |
| 56. I would advise you buy the same medicine as I have. | I would advise you to buy the same medicine as I have bought. |
| 57. Every one of them have done their duty. | Every one of them has done his duty. |
| 58. Each boy and each girl were given a reward. | Each boy and each girl was given a reward. |
| 59. He is one of those men who knows everything. | He is one of those man who know everything. |

| | |
|---|---|
| 60 Many a men were present there. | Many a man was present there (or Many men were present there) |
| 61. Physics require brains. | Physics requires brains. |
| 62 Either he or I is to blame | Either he or I am to blame. |
| 63. He as well as I am guilty. | He as well as I is guilty |
| 64. Mohan said that oil was lighter than water. | Mohan said that oil is lighter than water. |
| 65. He asked had we written our exercise. | He asked if we had (or whether we had) written our exercise. |
| 66. He availed of the offer. | He availed himself of the offer. |
| 67. She resigned to her fate. | She resigned herself to her fate. |
| 68. I engaged myself in politics. | I engaged in politics. |
| 69. I left smoking | I gave up smoking. |
| 70. If you leave the horse's reins you will fall. | If you let go the horse's reins, you will fall. |
| 71. I should take you leave. | I should take leave of you. |
| 72. You should not cut jokes in the presence of others. | You should not make jokes in the presence of others. |
| 73. He is troubling me unnecessarily. | He is giving me trouble unnecessarily. |
| 74. My foot is paining. | My foot is hurting. (or I have a pain in my foot.) |
| 75. You had better not to remain here. | You had better not remain here. |
| 76. Bid him to do this. | Bid him do this. |
| 77. He need not to go there. | He need not go there. |
| 78. He cannot dare to see me. | He dare not see me. |
| 79. I often hear you speaking ill of me. | I often hear you speak ill of me. |
| 80. I had better to take rest. | I had better take rest. |
| 81. A hue and cry were raised. | A hue and cry was raised. |
| 82. Our only guide were the teachers. | Our only guide was the teachers (or teachers were our only guide.) |
| 83. I insisted to go there. | I insisted on going there. |
| 84. Refrain to do evil. | Refrain from doing evil. |
| 85. Hindus are prohibited to eat beef. | Hindus are prohibited from eating beef. |

| | | |
|---|---|---|
| 86 | Do not prevent him to go there | Do not prevent him from going there. |
| 87 | Abstain to take wine. | Abstain from taking wine. |
| 88 | Law and order have to be maintained. | Law and order has to be maintained. |
| 89 | This book is not worth to buy. | This book is not worth buying. |
| 90. | She does not want Raghu come there. | She does not Raghu's coming there. |
| 91. | None but the brave deserves the fair | None but the brave deserve the fair. |
| 92. | Two pair of shoes is with her. | Two pair of shoes are with her. |
| 93. | Sitting on the gate, a scorpion stung her | While she was sitting on the gate a scorpion stung her. |
| 94. | I used to smoking at that time. | I used to smoke at that time |
| 95. | I am reminding lest you may fail | I am reminding you lest you should fail. |
| 96. | He came to me for seeing my uncle. | He came to me to see my uncle. |
| 97. | None of them are of much use in life. | None of them is of much use in life. |
| 98. | The building with all its furniture were sold | The building with all its furniture was sold. |
| 99. | When your teacher comes you must wish him | When your teacher comes, you must greet him. |
| 100. | Try to fair out this exercise. | Try to make a fair copy of this exercise. |

# 8 Prepositions

ఇంగ్లీషు భాషని నేర్చుకునే విద్యార్థులకి Prepositions పెద్ద పరీక్ష పెడతాయి. Prepostions సంఖ్య తక్కువే. కాని నేర్చుకునే వాళ్లకి యేది యెలా వాడాలో తెలియక పోవడంవల్ల తప్పులు దొర్లిపోతాయి. మనం సాధారణంగా మన భాషని దృష్టిలో వుంచుకుని ఇంగ్లీషులో ఆ భావాన్ని చెప్పడం యిందుకు కారణం. ఉదాహరణకి 'He is suffering with fever' అని వో విద్యార్థి అంటాడు. "జ్వరంతో బాధపడుతున్నాడ"ని తెలుగులో అంటాం కదా, ఆ దృష్టితో. అయితే ఇంగ్లీషు భాషా నియమం ప్రకారం 'from' అనాలి. అదేరకంగా (a) 'I have been working since ten years' అంటాడు, (b) 'This book is different to that' అంటాడు, మరి తెలుగులో 'దానికీ దీనికీ తేడా' వుందిగా. కాని యీ సందర్భాల్లో (a) for అనీ, (b) from అనీ వాడాలని తెలుసుకోవడమే prepositions గురించి సరిగ్గా తెలుసుకోవడం. అంచేత తెలుగు విభక్తి ప్రత్యయాలని వాడే విధానంతో ఇంగ్లీషు Prepositions ని కలిపేసి ప్రయోగించకుండా వుండడమే యీ Prepositions ని నేర్చుకోవడం. ఫలానా Preposition కి ఫలానా అర్థం అని తెలుగు విభక్తి ప్రత్యయాలకి సమానార్థకంగా చెప్పడానికి లేదు. తెలుగులో తో, కొరకు లాంటివాటికి ఇంగ్లీషులో సర్వదా 'with' 'for' రావు. 'వాడు నాతో మాట్లాడేడు'- ఇంగ్లీషులో 'He spoke to me'. యిక్కడ తెలుగు వాడిక ప్రకారం 'with me' అనకూడదు. వొకే పదం Preposition కావచ్చు, adverb కావచ్చు. Preposition వాక్యంలో వున్న మాటల మధ్య సంబంధాన్ని తెలియచేస్తుంది. అలా connect చేస్తే Preposition అవుతుంది. అలాకాకుండా verb తో కలిసినప్పుడు adverbial particle అవుతుంది. Preposition తర్వాత noun కాని, pronoun కాని వస్తాయి. ఉదాహరణకి Book, table, is - Book is on the table. యీ book కీ table కీ వున్న connection ని on తెలియచేస్తోంది. 'The table is on the book' అని కూడా వుండచ్చు! అంటే యీ రెండూ యే సంబంధంతో వున్నాయో 'on' వల్ల తెలుస్తోంది.

ఇంగ్లీషులో కొన్ని కొన్ని మాటలకి ప్రత్యేకమైన Prepositions వాడాలి. రెండో, అంతకంటే యెక్కువో మాటలు చేరి వొక Preposition చేసే పనిని చేస్తాయి వాటిని phrase - preposition అని కాని prepositional phrase అనికాని అంటారు. వీటినే compound prepositions అనీ అంటారు.

Simple prepositions: on, in, at, of, off, out, up, down, for, since వగైరా.

Double prepositions: రెండు simple prepositions కలిస్తే యేర్పడేవి: out of, from among, into, within వగైరా.

Phrase prepositions: for the sake of, in front of, by way of, with reference to వగైరా.

Prepositions వాడడానికి నియమాలు లేక సూత్రాలు యేమన్నా వున్నాయా? Active voice, Passive voice మాదిరీ, verb tense మాదిరీ వీటికి కచ్చితమైన సూత్రాలు లేవు. కాని అభ్యాసంవల్ల నేర్చుకోవాలి. అయితే కొన్ని prepositions కొన్ని verbs, nouns, adjectives, participles ముందు విధిగా వుంటాయి. వాటిని గురించి కొంత తెలుసుకుంటే కొంత సులభం అవుతుంది

At, in, on, by, from, since, between లాంటివన్నీ place కీ time కీ వాడేటు వంటివే. అయితే వీటిని యెప్పుడు యెలా వాడాలో తెలుసుకోవడమే prepositions గురించి కొంత మేరకైనా తెలుసుకోవడం. వొక్కొక్కదాన్ని గురించే చూసి, ఆఖర్న prepositions follow అయివచ్చే words ని list చేసుకుందాం.

## At

1. వొక point of time ని సూచించడానికి at వాడతారు.
   He came at 4 O'clock in the evening.
2. వొక స్థలాన్ని లేక స్థానాన్ని నిర్దేశించేందుకు
   He is at the bus stand.
   I was at college.
3. వొక పరిస్థితిని సూచించేందుకు
   China and India were at war then.
4. ధరని, వేగాన్ని సూచించేందుకు
   Paddy is sold at two hundred rupees a quintal.
   The train is running at full speed
5. యేదేనా గురిని, వొకవేపు వెళ్లేదాన్ని సూచించేందుకు
   He threw a stone at the dog.
   They were aiming at the tree.
6. యే పనిలోనేనా నిమగ్నం అయేరన్న సూచనతో
   All the students are at play.
   They were at work

7. ప్రముఖంకాని వూళ్లని, చిన్నస్థలాల్ని సూచించేందుకు
   He was born at a small village in Andhra
   యిదేరకంగా in ని కూడా place కి, time కి వాడతారు.

**In**

1. చిన్న స్థలాలకి at ని వాడితే in ని పెద్ద స్థలాలకి వాడతారు.
   He lives in Calcutta.
   He arrived in Delhi yesterday.
2. పైన చూసినట్టు at point of time ని నిర్దేశిస్తే, 'in' period of time ని నిర్దేశిస్తుంది.
   We shall start at five in the morning.
   He returned in two months
   He was born at Bellary in 1967.
   He joined college in 1984.
3. యేదేనా కార్యకలాపాన్ని సూచించేందుకు
   He wastes his time in gambling.
   They spend their time in reading.
4. యేదేనా వొక పరిస్థితిని, పరిసరాల్ని తెలియచేస్తూ
   He is in troubles.
   They went out in rain.
   Donot be in a hurry to do this.

**By**

దీన్నికూడా time కి, place కి వాడతారు. Passive voice లో verb తర్వాత వస్తుంది.

1. స్థలానికి వాడే సందర్భంలో 'దగ్గర, పక్కన' అనే అర్థం.
   He sat by the principal on the dais.
   Our house is by the river.
2. Time కి 'before' అని, 'during' అనీ అర్థం వచ్చేటట్టు
   I must go there by five.
   It must be posted by tomorrow.
   He comes by night.
3. యేదన్నా పని జరిగిన తీరుని, వొక చర్య జరిగే పద్ధతిని తెలియచేస్తూ
   He pulled him by the hand.
   The house was destroyed by storm.
   He received the money by M.O.

4. Passive voice లో యెవరు ఆ పనిని చేశారో సూచించే agency ని తెలియచేస్తూనూ, means ని తెలియస్తూనూ :
   He was scolded by his teacher.
   Do not estimate a person by his clothes

5. దేన్నన్నా సాక్ష్యంగా, సహాయార్థంగా తెచ్చుకున్నప్పుడు
   I swear by the Bhagavad Gita that I am innocent.

6. కొలమానంగా, సంఖ్యగా, పరిమాణాత్మకంగా,
   She is taller than her husband by two inches.
   He eats eggs by the dozen.
   They sold the cloth by the metre.

7. Means of travel, transport, ప్రయాణ సాధనాలకి
   All modern yogis travel by air.
   He came by train.

8. ఆ ప్రకారం, దాని రీత్యా అనే అర్థంలో
   By my watch it is 2 O'clock.

9 పక్కనుంచి, దగ్గర్నుంచి అనే అర్థంలో
   He walked by me without speaking.
   They passed by our house without calling on us.

10. ఆ మేరకి, ఆ పరిమితికి, extent, అన్న అర్థంలో
   He missed his aim by an inch.
   He failed in English by two marks.

యివికాక అనేక idiomatic expressions లో 'by' వస్తుంది. 'by and by', 'by and large', 'by all means' వీటిని గురించి అధ్యయనం ద్వారా తెలుసుకోవాలి.

## On

పై మూడింటిలాగానే time కీ, place కీ 'on' కూడా వస్తుంది. కొన్ని సందర్భాల్లో 'on' బదులు upon కూడా వాడచ్చు. అంచేత యీ నియమాలు స్థూలంగా తెలుసుకుందాం.

1. కాలనిర్దేశకంగా, time indicating గా, during, exactly అనీ, at the time of అనీ అర్థం యిస్తూ
   India won freedom on the 15th, August 1947.
   We shall leave for Delhi on Sunday.

2. స్థల నిర్దేశకంగా, యేదన్నా స్థిరంగా వున్న తావుని నిర్దేశిస్తూ
   He sat on a chair.
   There was a carpet on the floor.
   You keep it on the desk.

3. దేనికేనా సంబంధించి వుంటే, concerning a thing,
There was a lecture on yoga yesterday.
This is a book on heat.

4. యే సంస్థలోనేనా, బృందంలోనేనా సభ్యత్వంలో వున్న సూచనకి
He is on the committee of our college.

5. వొకవేపు, direction లో, వున్నదాన్ని సూచించేందుకు
The army was marching on the enemy's Capital.
Donot turn your back on her.

6. దేనికేనా ఆధారంగా, కారణంగా వున్నదని చెప్పేందుకు
This is a story based on facts.
You act on your guide's advice. (యిక్కడ upon కూడా వాడచ్చు)

7. సమీపంలో, రెండువేపులా అన్న అర్థంలో
1. Venice is on the coast of the Adriaetic sea.
2. There are fields on both sides of the river.
3. She sat on my left side.

8. దేనికైనా సంబంధించి, యే కార్యకలాపంలోనేనా వున్న పరిస్థితికి
He is on leave.
The Thames is on fire.
He bought the house on loan.

9. వొకదాని మీద వొకటిగా కలిసి వున్నదానికి
The village suffered disaster on disaster.

10. పన్ను, సుంకం విధించినప్పుడు
Heavy duty is imposed on imported goods. (యిక్కడ upon కూడా వాడచ్చు)

On, upon యిలా కొన్ని సందర్భాల్లో వొకదాని బదులు మరొకదాన్ని వాడినా 'on' స్థిరంగా వున్నవాటికి upon కదిలిక వున్నవాటికి వాడడం గమనించాలి.
He sat on the chair.
The dog sprang upon him.

## For

దీన్నికూడా place కీ, time కీ యితర usages తో బాటు పైవాటి మాదిరీ వాడతారు.

1. గమ్యస్థానానికి, ఫలానా వొకచోటికి, destination కి
He was leaving for Delhi.
The ship was making for the open sea.

They set out for home.
Is there a train now for Vizag?

2. కాల నిర్దేశకంగా period of time కి
I am going away for a few days.
It has been raining for two hours.

3. దూరానికి, ఫలానా యింత ధరకి అని చెప్పేటప్పుడు
We walked for three miles.
I bought it for five rupees.

4. వొక ఉద్దేశ్యాన్ని, ప్రయోజనాన్ని నిర్దేశించేటప్పుడు
He was destined for something great.
I applied for that job.
He came for dinner.

5. వొక కోరికని, ఆశని, వెతకడాన్ని, విచారణని తెలియచేసేందుకు
Let us hope for the best.
He has a strong desire for becoming great.
We prayed for peace.
He searched for his books.

6. వొకదాని బదులుగా, వొకదాని exchange కి బదులుగా
This table will serve us for a chair.
He has come for his brother.
I gave the book to him for his pen.

7. అయినప్పటికీనీ, in spite of, అనే అర్థంలో
For all his wealth, he is unhappy.

8. యేదన్నా సరిపడుతుందో లేదో, suitability, తెలియజేసేందుకు
Drinking is bad for health.
Filtered water is good for health.

9. అందుకుగాను, ఆ కారణంగా, on account of, అనే అర్థంలో
He won a medal for bravery.
The thief was jailed for stealing.

10. వొకదాని పట్ల అభిరుచి వుందని తెలియజేసేందుకు, సామర్థ్యం వుందని తెలియజేసేందుకు
She has a taste for art.
He has a good ear for music.

11. వొకదాని గురించి, వొకదానికి అనుకూలంగా వున్న సందర్భంలో
I was anxious for her safety.
Are you for this proposal?

12. Comparative తర్వాత వొకదాని ఫలితంగా,

Are you any the better for your long sleep?

యివికాక verb combinations లో 'for' అనేక అర్థాలలో వస్తుంది. 'Take something for', 'stand for' లాంటి phrases ని తెలుసుకోవాలి. *"For good"* అన్నదానికి అర్థం *finally, permanently* అని అర్థం. *"He intends to leave the country for good"* అంటే యిక యెప్పటికీ తిరిగిరాకుండా వెళ్లిపోవాలని ఉద్దేశిస్తున్నాడని అర్థం.

**From**

దీనికి కూడా, పై వాటిలాగా మిగిలిన usages తో బాటుగా, time, place లని నిర్దేశిస్తూ వాడకం వుంది.

1 వొకదాని ఆరంభదశని తెలియచేసేందుకు దీన్ని వాడతారు
She will begin her work from tomorrow
The prices of oil will go up from today.
He has been learning music from childhood.

2. వొకదాని దూరం వొక స్థలం నుంచి యెంత తెలియజెయ్యడానికి వగైరాలకి
It is ten miles from the coast.
He stayed away from college.

3. వొకదానికీ మరొక దానికీ తేడా, విభేదం తెలియచేసేందుకు
How would you know an Englishman from an American?

4. దేనికేనా కారణం, ఉద్దేశం తెలియజేసేటప్పుడు
He was suffering from fever.
She suffered from starvation and disease.

5. దేనికేనా ఆధారం, source, ఆరంభ స్థానం departure తెలియజేసేటప్పుడు
It is a quotation from Milton.
He comes from Wales.
From his point of view, he is right.

6. యేదేనా తయారైనప్పుడు వాడిన material వగైరాలు, అవి రూపాంతరం చెందడం
Wine is made from grapes.
This yarn is spun from cotton.

7. యేదన్నా model వగైరాల్ని సూచించేందుకు
This picture is painted from life.

8. యేదన్నా separation, escape, prevention వగైరాలని తెలియజేసేందుకు
The detenue was released from prison.
The students were prevented from copying.

## Of

యిది సాధారణంగా genitive case ని, 'యొక్క' అంటారే, ఆ అర్థాన్ని తెలియచేస్తుంది. అయితే యిదికూడా space, time లని మిగిలిన అర్థాలతో బాటుగా, పైన చెప్పకున్న prepositions, మాదిరీ అందిస్తుంది.

1. దూర వ్యత్యాసాన్ని తెలియచేసేందుకు, సమయాన్ని తెలియచేసేందుకు దీన్ని వాడతారు.
Our village is five miles north of Vijayawada.
I shall meet you at 12 O'clock.

O'clock అంటే of the clock, దీన్ని specifying the hour of the day. యీ 'O'clock' adverbial.

'In days of old' గతకాలంలో, 'of late' యిటీవల 'of an evening', 'five minutes of six' లాంటివన్నీ కాల నిర్దేశకమైన ప్రయోగాలు.

2. మరొకదానితో వున్న సంబంధాన్ని తెలియజేసేందుకు, యీ సంబంధం objective కావచ్చు, subjective కావచ్చు.
He is the writer of the story.
The kidnapped had the fear of being killed.
I achieved this with the help of my family.

3. వొక division ని తెలియజేసేందుకు
He wrote the application on a sheet of paper
He took two metres of cloth for his shirt.

4. దేనికేనా కారణం తెలియజేసేందుకు
She died of cholera.
The thief did it out of necessity.

5. దేనికేనా ఆధారం తెలియజేసేందుకు
They come of a rich family.

6. వొక material ని గాని, సారూప్యతని గాని తెలియజేసేందుకు
It is made of gold.
Received your letter of 2 June.

7. వొక *quality* ని తెలియజేసేందుకు
He is a man of noble character.

8. Possession ని, కలిగివుండడం అనే, అర్థంలో
   This is a factory of his father-in-law.

9. దేనికేనా connection ని వగైరాలని తెలిపేందుకు
   What was the cause of the accident?
   'Economic crisis in India' is the topic of discussion.

10. వొక subjective relation ని తెలియజేసేందుకు
    The love of motherland prompts people to sacrifice themselves.

11. Pattern లో noun + of + noun
    Where is that fool of an assistant?

12. ఉద్రేకంగా adj + of + noun or pronoun pattern లో
    How kind of you to help!

## About

దీన్ని adverbial particle గా ఉపయోగిస్తారు. అయితే preposition usage కూడా verbs of movement తో వాడతారు 'here and there' 'in no particular direction' అని 'walking about town' 'travelling about world' లలో కనిపిస్తుంది.

1. స్థలనిర్దేశకంగా nearness of place ని సూచిస్తుంది:
   I dropped the key somewhere about here.

2. కాలసూచకంగా
   It is about to dawn.

3. దేనితోనేనా concerned అయినా, occupied అయినా
   The doctor went about his daily rounds.
   While you are about it, we have no point raising it.

4. దేనికేనా సంబంధించి, connection తో వుంటే
   He is worried about his son's studies.
   You know nothing about her.

5. యేదన్నా information అడుగుతూవున్నా, సూచన చేస్తూవున్నా
   How about going to France for our holidays?
   What about my request to you?

6. దేనినేనా చెయ్యసిద్ధంగా వున్నప్పుడు
   He was about to leave the place when his wife rushed in.
   She was about to reveal the secret when he interuppted her.

## Between

1. స్థలం సూచిస్తూ
   The distance between Tanuku and Tadepalligudem is 20 Kilometres.

'Between' ని రెండు వస్తువులకి, రెండుస్థలాలకి, యిద్దరు వ్యక్తులకి సంబంధించే సామాన్యంగా వాడతారు రెండుకంటే యెక్కువ వుంటే 'among' వాడతారు.

There is no comparison between Rama and Krishna.

అయితే దేశ సరిహద్దుల గురించి చెప్పే సందర్భం అయితే more than two limits కి కూడా between వస్తుంది.

Switzarland lies between France, Italy, Austria and Germany.

2. Time కి
   He will visit you between 2 O'clock and 3 O'clock.
   Many changes took place between the two world wars.

3. 'to and from' కి
   The train runs between Vizag and Hyderabad.

4. దేన్నైనా sharing, dividing వున్నప్పుడు
   Divide these apples between the two brothers.
   There should be no secrets between husband and wife.

5. రెండింటిమధ్య relation ని తెలియచెయ్యడానికి
   You should understand the distinction between right and wrong.

## Till

దీన్నికూడా time కి మిగిలిన usages తో బాటుగా వాడతారు, పైన చెప్పుకున్న prepositions మాదిరీ.

1. అంతదాకా, 'upto', అని చెప్పేందుకు
   He slept till six O'clock.
   He works from morning till night.

'till', 'until' సమానార్థకాలే. వీటి వాడకం గురించి భేదం లేదు, వాడేవాళ్ల choice తప్ప.

## To

1. 'to' ని ఏ వైపు వుండే కదిలికని సూచించేందుకు, 'towards' అనే అర్థంలో; (కి, కు, ట అనే అర్థంలో)
   You go straight and then turn to the left.
   Hold it upto the light.

2 'as far as' అనే అర్థంలో
He read it from beginning to end.
It amounts to a hundred

3 అప్పటిదాకా, 'until' అనే అర్థంలో
He was here from morning to night
Did you stay to the end of the meeting?

4 వొక ratio ని, reference ని, తెలియచేసేందుకు
I prefer walking to climbing.
We won by six goals to three
I am grateful to you He is polite to me.

### With

దీనికి సాధారణంగా 'తో' అనే అర్థంలో ప్రయోగం వుంటుంది. 'Have' కలిగివుండు, having, carrying అనే వాక్యనిర్మాణాలకి సమానార్థకంగా వుంటుంది. 'It is a coat with two pockets' , 'a girl with blue eyes' అనేలాంటి ఉదాహరణల్లో యీ అర్థాన్ని చూడచ్చు

1. సాధనానికి, instrument కి, method or means కి
He beat the dog with a stick
I carried it with both hands.

2. సంబంధం reaction అనుసరించి వుండడం తెలియజేసేందుకు
She lives with her parents
Is he with anybody or alone?

3. వ్యతిరేకతని, opposition ని తెలియజేసేందుకు
He argued with his wife yesterday.
Don't quarrel with them

4. ఆ కారణంగా, because of, అనే అర్థంలో
He was trembling with fear.
The orphan was shaking with cold.

5. పద్ధతిని, manner ని తెలియజేసేందుకు
He succeeded with an effort
He stood there with his hands in his pockets.

6. దేనికి సంబంధించేనా, in regard to, concerning అనే అర్థంలో
A doctor must be patient with his patients.
What do you want with me?
I have nothing to do with her.

7 వేర్పాటుని సూచించేందుకు, అదేరకంగా agreement ని సూచించేందుకూ
She broke with her husband
I disagree with you
I agree with you.
He who is not with me is against me

8 దేన్నైనా నింపే దాన్ని గురించి, మూసేదాన్ని గురించి తెలియజేసేందుకు
Fill the bag with currency notes.
The hills were covered with snow.

యిప్పటిదాకా వో డజను prepositions ని యెలా వాడతారో కొన్ని నియమాలు చూశాం. యిలా యింకా పరిశీలించుకుంటూ పోవచ్చును. అయితే ముఖ్యమైన వాటిగురించి చూశాంకనక, కొన్ని preposition ల correct usage కూడా తెలుసుకుని, prepositions ని వాడక్కర్లేని మాటలు యేమిటో, తప్పుగా వాడే మాటలు యేమిటో కూడా తెలుసుకుందాం. యీ correct usage of prepositions గురించి చెప్పుకుంటున్నప్పుడు పైన చూసిన prepositions కొన్ని యిక్కడ మళ్లీ రావచ్చు, కొన్ని అక్కడ ప్రస్తావించుకోనివి వుండచ్చు.

## At, in

యీ రెండింటి గురించీ పైన చూశాం. అయినా పునశ్చరణ చేసుకున్నట్టూ వుంటుంది కనక ముఖ్యమైన usage చూద్దాం.

'at', 'in' రెండింటినీ time కీ, place కీ వాడడం వుందని తెలుసుకున్నాం. అయితే at ని small towns కీ, villages కీ place కి సంబంధించే సందర్భంలో వాడతారు Time విషయంలో definite point of time కి వాడతారు 'In' దేశాలకీ, పెద్ద నగరాలకీ, విఖ్యాతంగా వుండే స్థలాలకీ వస్తుంది, Period of time కి వస్తుంది

Meet me at five O'clock in the evening.
He lives at Munganda in Andhra Pradesh

## Between, among

'Between' గురించి కొంత చూశాం. అయితే between కీ among కీ తేడా వొకటే వుంది 'two persons or things' కు between, more than two అయితే 'among' వాడాలి

The cat intervened in the quarrel between the two birds.
The yadavas quarrelled among themselves

## By, with

'by' ని agent కి లేదా పని చేసేవాడికి, doer కి, వాడతారు. 'With' ని instrument కి వాడతారు.

He was killed by the thief with a knife.
He was scolded by his parents.
She hit him with a stick.

### In, into

నిశ్చలంగా, కదలకుండా వున్న వాటికి వర్తించే సందర్భంలో in, కదలిక, motion, వున్న వాటికి into.

The child is in bed.
They marched into the hall.
She jumped into the well.

### In, within

యిక్కడ 'in' భవిష్యత్‌లో వొక 'period of time' end గురించి చెప్తుంది. Within 'before the end of a period in future గురించి వుంటుంది.

He will be back in a week
He will come back within two days.

### In, after

సాధారణంగా 'in' some period of time in the future కి వస్తుంది. 'after' some period of time in the past కి వస్తుంది.

He returned to Hyderabad after a week (అంటే past లోనే వో వారం తర్వాత అని)

He will return to Hyderabad in a week. (యీ పైన, వారాంతంలో అని)

అయితే 'after' కి యితర usages కూడా వున్నాయని మరిచిపోకూడదు.
I shall see you after dinner.

'వెనక' అనే అర్థంలో
She shut the door after you

ఆ కారణంగా అనే అర్థంలో
I shall never see him again after what he has said about me.

తర్వాత, next in order అనే అర్థంలో
Dinner will be served after the meeting.
My wife came after me.

### Beside, besides

వొకటేమాట వొక్క 's' చివర రావడంతో అర్థం యెలా మారుతుందో చూడండి! 'Beside' అంటే by the side of, 'పక్కన' అని. 'Besides' అంటే in addition to 'కూడా,' (వొకదానితో) బాటుగా అని.

She sat beside him in the meeting.
Besides giving him advice, they gave him money.
Besides money, he wants clothes.

## By, till

'by' గురించి పైన చూశాం, ఆ time లోపలే, ముందుగానే అనే అర్థంలో వుంటుంది. Till అప్పటిదాకా, upto that time అని అర్థం యిస్తుంది.

He will come home by six 6 P.M.
We slept till 6 P.M

## Before, for

'Before' ని వొక 'point of future time' లో negative and affirmative sentences లలో వాడితే, for ని a period of future time ని indicate చేసేందుకు negative sentences లలో వాడతారు.

The sun will not rise for an hour.

'The sun will not rise before an hour' అనకూడదు.
before ని point of time కి use చెయ్యొచ్చు కాని period of time కి కాదు.

The sun will rise before seven O'clock
The sun will not rise before seven O'clock.

## for, from, since

For ని period of time కి, from ని point of time కి since ని వొక్క point of time కి మాత్రం వాడతారు.

For ని present continuous లో తప్ప మిగిలిన అన్ని tenses లోనూ వాడచ్చు From ని అన్ని tense లోనూ మినహాయింపులు లేకుండా వాడచ్చు. From తర్వాత to, till, until వుంటాయి. Since ని point of time కి తప్ప period of time కి వాడకూడదు.

For
I have not gone there for five days.
He has been studying for six hours.

From
He worked from morning to evening.
The college works from 10 A.M. to 5 P.M.
She wept from morning till evening.

Since
She has not seen him since last month
I have been writing this since last week

'Since' ని present perfect tense లోనే వాడాలి అయితే past time ని ఉద్దేశించినప్పుడే correct usage అవుతుంది. Present ని, future time ని refer చేస్తూ వాడకూడదు.

He will be here since next Monday అని యెప్పుడూ అనకూడదు, from next Monday అనవచ్చు.

**On, upon**

On నిశ్చలంగా వున్న వాటికి, upon కదిలికవున్న వాటికి వస్తాయి
He stood on the platform.
The tiger sprang upon the deer.

చాలా సందర్భాల్లో యీ రెండింటికీ అర్థం సమానమే. అయితే 'on' నే మరింత యెక్కువగా వాడతారు, upon కంటే అది less formal గా వుంటుంది.

యింకా యిలా prepositions చాలా వాటికి వున్న ప్రయోగాల్ని అభ్యాసం ద్వారా తెలుసుకోవచ్చు యిప్పుడు prepositions రాని మాటల్ని (యేమంటే మన దేశంలో wrong association వల్ల ఆ మాటలకి prepositions చేరుస్తూ వుంటాం) కొన్నిట్ని చూద్దాం అదే రకంగా prepositions ని వదిలిపెట్టకూడని మాటల్ని (యిలా వదిలి పెట్టడం కూడా ఆ కారణం వల్లనే) చూద్దాం

Prepositions రాని మాటలు

He ordered lunch (not ordered for)

He criticised my article (not criticised upon)

We discussed the problem *(not discuss about)*

He obeys my orders (not obeys to)

This boy resembles his sister. (not resembles to)

Please inform your parents. (not inform to)

Did he sign the papers? (not signed to or upon)

She has opened a school. (not opened up)

The team ascended the hill. (not ascended on)

A minister recommended him (not recommended for)

She assisted me in my work. (not assisted to)

The sea air will benefit you. (not benefit to) (అయితే you will benefit by/ from a holiday అనచ్చు.)

Students should not violate this rule. (not violate against)

He entered the room. (not entered into)

I am awaiting your reply *(not awaiting for)*

This glass resists heat. (not resist from)

He avenged that insult. (not avenge for)

Prepositions ని తప్పుగా వదిలి పెట్టే మాటలు·

Beware of dogs. (not beware dogs)
I am aware of the fact (not aware a fact)
Partake of a meal. (not partake a meal)
You dispose of the work. (not dispose a work)
He listened to the speech. (not listened the speech)
You must apply to him (not apply him)

యిప్పుడు ఆఖరిగా prepositions follow అయివచ్చే మాటల్ని కొన్నిట్నే చూద్దాం. కొన్ని nouns, adjectives, verbs ప్రత్యేక prepositions తో వుంటాయి.

Nouns followed by prepositions వీటిని వాక్యాల్లో ఉపయోగించే అభ్యాసం చెయ్యండి.

| | |
|---|---|
| acquaintance with | (పరిచయం) |
| affection for | (ఆదరం) |
| apology for | (క్షమాపణ) |
| aptitude for | (యిష్టం) |
| access to | (మార్గం, వీలు) |
| adept in | (నైపుణ్యం) |
| advantage of/over | (అనుకూలం, లాభం) |
| advice on | (సలహా) |
| agreement with/on | (ఒప్పందం – వ్యక్తితో, విషయం గురించి) |
| anxiety about/for | (ఆతృత – వొదాన్ని గురించి, వ్యక్తిగురించి) |
| appetite for | (ఆకలి) |
| appreciation of/for | (మెచ్చికోలు – వొకదాన్ని గురించి) |
| approach to | (సమీపం) |
| attention to | (శ్రద్ధ) |
| attitude towards | (వైఖరి – వొకదానిపట్ల) |
| assurance of | (నమ్మిక) |
| authority on | (ప్రామాణికం) |
| blame for | (తప్పు) |
| basis for | (ఆధారం) |
| candidate for | (అభ్యర్థి) |

| | |
|---|---|
| capacity for | (శక్తి) |
| care of | (హెచ్చరిక, జాగ్రత్త) |
| cause for | (కారణం బెంగపడ్డానికి) |
| cause of | (కారణం - వొకదానికి, ప్రమాదానికి వగైరాలకి) |
| chance of | (అవకాశం, అదృష్టం) |
| charge of | (అభియోగం) |
| choice of | (ఎంపిక) |
| claim on/to | (హక్కు) |
| complaint against | (ఫిర్యాదు) |
| confidence in | (విశ్వాసం) |
| comparison with/between/of | (పోలిక, సామ్యం - వొకదానితో, రెండింటిమధ్య, వొకదానికీ మరోదానికీ) |
| control over | (అదుపు) |
| contrast between | (తారతమ్యం) |
| contempt for | (ద్వేషం) |
| cure for | (చికిత్స) |
| danger of | (ప్రమాదం) |
| demand for | (అడగడం, గిరాకీ) |
| desire for | (కోరిక) |
| difference between | (తేడా) |
| difficulty in | (కష్టం) |
| disagree/ment/with/over | (విభేదించడం వొకరితో, వొకదానిమీద) |
| discussion about/on | (చర్చ) (యిక్కడ about వాడచ్చు verb తో వాడకూడదుగాని) |
| disgrace to | (తలవంపులు) |
| doubt about | (సందేహం) |
| duty to | (కర్తవ్యం) |
| esteem for | (గౌరవం) |
| excuse for | (మన్నింపు, క్షమాపణ) |
| experience in | (అనుభవం) |
| expression to | (వెల్లడించడం) |
| facility for | (సౌకర్యం) |
| faith in | (నమ్మకం) |
| (in) favour of | (అనుకూలంగా వుండడం) |
| fear of | (భయం) |
| feeling towards | (అనుభూతి) |
| fondness for | (ఇష్టం) |
| freedom from | (స్వతంత్రత) |

| | |
|---|---|
| gratitude to/for | (కృతజ్ఞత) |
| grief at | (విచారం) |
| hope of | (ఆశ) |
| hatred for | (ద్వేషం) |
| heir to | (వారసత్వం) |
| impression of | (అభిప్రాయం) |
| improvement in | (అభివృద్ధి) |
| influence with | (పలుకుబడి) |
| influence on/over | (ప్రభావం–వాళ్లమీద) |
| information about | (సమాచారం) |
| interest in | (ఆసక్తి) |
| interference with | (జోక్యం) |
| invitation to | (ఆహ్వానం) |
| insistence on | (పట్టు బట్టడం) |
| knack for | (నేర్పరితనం) |
| knowledge of | (తెలిసివుండడం) |
| lack of | (లోపం) |
| likeness to | (పోలిక) |
| liking for | (ఇష్టత) |
| limit to | (హద్దు) |
| love for | (ప్రేమ) |
| leisure for | (తీరిక) |
| longing for | (బెంగ) |
| match for | (ఉజ్జీ) |
| method of | (పద్ధతి) |
| necessity for | (అవసరం, తప్పనిసరి) |
| need of/for | (అవసరం) |
| neglect of | (ఉపేక్ష) |
| obedience to | (విధేయత) |
| objection to | (అభ్యంతరం) |
| opinion on/about | (అభిప్రాయం) |
| peace with | (శాంతి) |
| pity for | (కనికరం) |
| penalty for | (జరిమానా) |
| preference for | (ప్రత్యేకంగా చూడ్డం) |
| prejudice against | (మత్సరం) |
| preparation for | (సంసిద్ధత) |
| proficiency in | (నైపుణ్యం) |
| pride in | (గొప్ప) |

| | |
|---|---|
| progress in | (పురోగతి) |
| proof of | (సాక్ష్యం, దాఖలా) |
| punishment for | (దండన) |
| quarrel with | (పేచీ) |
| recovery from | (పుంజుకోవడం) |
| regard for | (మన్నన) |
| relief from | (ఊరట) |
| remedy for | (మందు) |
| reputation for | (ప్రఖ్యాతి) |
| respect for | (గౌరవం) |
| reply to | (జవాబు) |
| request for | (విన్నపం) |
| resemblance to/between | (పోలిక) |
| response to | (ప్రత్యుత్తరం) |
| result of | (ఫలితం) |
| reward for | (కానుక) |
| skill in | (నేర్పరితనం) |
| slave to/of | (బానిస) |
| stranger to | (పరాయివాడు) |
| substitute to | (బదులు) |
| suggestion for | (సూచన) |
| subscription to | (చందా) |
| surprise at | (ఆశ్చర్యం) |
| sympathy with/for | (జాలి) |
| taste for/of | (అభిరుచి) |
| talent for | (ప్రతిభ) |
| traitor to | (ద్రోహి) |
| tolerance for | (సహనం) |
| use of/for | (ఉపయోగం) |
| victim to/of | (బలి అయిన వ్యక్తి) |
| witness to | (సాక్షి) |
| eal for | (ఉత్సాహం) |

Adjectives and participles followed by prepositions

| | |
|---|---|
| accused of | (నిందమోపిన) |
| absorbed in | (నిమగ్నమైన) |
| acceptable to | (అంగీకారంగా వున్న) |
| accomplished in | (అందె వేసిన, కళల్లో) |

| | |
|---|---|
| accustomed to | (అలవాటు పడిన) |
| acquainted with | (పరిచయమైన) |
| addicted to | (అలవాటుపడ్డ, దురభ్యాసాలకి సంబంధించి) |
| adjacent to | (సమీపంలో వున్న) |
| afraid of | (భయపడ్డ) |
| alarmed at | (భయపడ్డ) |
| drive to | (తెలుసుకుని వున్న) |
| amazed at | (ఆశ్చర్యపడ్డ) |
| angry with | (కోప్పడ్డ, వ్యక్తులతో) |
| angry at | (కోపంగా వున్న, దేనిగురించేనా) |
| anxious for | (ఆత్రంగా వున్న, దేనికోసం అయినా, యెవరికోసం అయినా) |
| anxious about | (ఆత్రంగా వున్న, దేనికోసం అయినా) |
| appropriate to | (తగివున్న) |
| applicable to | (వర్తించే, సంబంధించిన) |
| ashamed of | (సిగ్గుపడ్డ) |
| associated with | (కలిసివున్న) |
| astonished at | (ఆశ్చర్యపడ్డ) |
| based on | (ఆధారపడ్డ) |
| backward in | (వెనకబడి వున్న) |
| bent on | (పట్టుగా వున్న) |
| beneficial to | (ఉపయోగంగా వుండే) |
| blessed with | (ఆశీర్వాదం పొందిన) |
| blind of/to | (గుడ్డి అయిన – వ్యక్తికి సంబంధించి; పట్టించుకోని, ఉపేక్షించే – దోషాలు వగైరాల్ని) |
| born of | (పుట్టిన) |
| bound for | (ప్రయాణమైన) |
| busy with | (తీరికలేకుండా వున్న) |
| capable of | (సమర్థమైన) |
| careful about/with | (జాగ్రత్తగావుండు, – పనికి సంబంధించి, ఆరోగ్యం డబ్బు వగైరాలకి సంబంధించి) |
| certain of/about | (నిశ్చయమైన – విజయం వగైరాలకి, విఫలమవడం వగైరాలకి సంబంధించి) |
| charged with | (నేరారోపణ చేసిన) |
| clear of | (స్పష్టమైన) |
| committed to | (నిబద్ధమైన) |

| | |
|---|---|
| common to | (సమానంగా వుండే) |
| comparable to | (పోల్చదగ్గ) |
| concerned with | (సంబంధించి వున్న) |
| confident of | (నమ్మకంతో వున్న) |
| conscious of | (యెరుక వున్న) |
| contented with | (సంతృప్తి చెందిన) |
| contrary to | (వ్యతిరేకంగావున్న) |
| convinced of | (నమ్మిన) |
| deaf to | (పట్టించుకోకుండా వున్న) |
| deficient in | (లొక్కుగా వున్న) |
| different from | (తేడాగా వున్న) |
| diffident of | (బెరుగ్గా వున్న) |
| disappointed with | (నిరుత్సాహపడ్డ) |
| disappointed at | (నిరుత్సాహపడ్డ – దేనికి సంబంధించినా) |
| disgusted with | (విసుగు చెందిన) |
| disqualified for | (అర్హతపోయిన) |
| doubtful of | (సందేహంగా వున్న) |
| engaged in/to | (నిమగ్నమై వున్న – యే పనిలోనేనా, నిశ్చితార్థమైన – యెవరితోనన్నా) |
| entitled to | (అర్హత వున్న) |
| envious of | (అసూయపడే) |
| equal to | (తుల్యమైన) |
| essential to/for | (అవసరమైన) |
| faithful to | (విధేయంగా వున్న) |
| familiar to/with | (బాగా పరిచితం అయివున్న – వ్యక్తితో, విషయాలతో) |
| famous for | (ప్రఖ్యాతి పొందివున్న) |
| fit for | (తగిన) |
| fond of | (యిష్టపడే) |
| free from | (బాదర బందీలేని) |
| full of | (నిండివున్న) |
| gifted with | (కలిగివున్న) |
| glad at/of | (సంతోషపడే) |
| good at | (నైపుణ్యం వున్న) |
| good for | (శ్రేయస్కరమైన) |
| grateful to/for | (కృతజ్ఞతగా వున్న) |
| greedy for | (దురాశగా వున్న) |
| guilty of | (దోషపూరితమైన) |

| | |
|---|---|
| harmful to | (చెరుపుగా వున్న) |
| honest in | (నిజాయితీ కల) |
| honoured with | (సత్కరించిన) |
| hopeful of | (ఆశవున్న) |
| horrified at | (భీతిచెందిన) |
| ignorant of | (తెలియని) |
| ill with | (జబ్బుగా వున్న) |
| impatient with/at/of | (ఓర్మి లేక పోయిన – వ్యక్తితో, విషయంతో, మరిదేంతోనేనా) |
| indebted to | (ఋణపడివున్న) |
| independent of | (సంబంధంలేని) |
| indifferent to | (పట్టించుకోని) |
| indulgent to | (మరీ అనుకూలంగా వుండే) |
| injurious to | (హానికరంగా వున్న) |
| intent on | (పట్టుగా వున్న) |
| interested in | (ఆసక్తి వున్న) |
| innocent of | (అమాయకంగా వున్న) |
| intimate with | (చనువుగావున్న) |
| introduced to | (పరిచయం చేసిన) |
| irrelevant to | (సంబంధంలేని) |
| jealous of | (అసూయగా వున్న) |
| liable for/to | (జవాబుదారీ అయిన – దేనికి సంబంధించేనా) |
| loyal to | (విధేయంగా వున్న) |
| mistaken for | (పొరపాటు పడ్డ) |
| married to | (వివాహం జరిగిన) |
| negligent of/in | (నిర్లక్ష్యంగా వున్న) |
| notorious for | (చెడ్డపేరు వచ్చిన) |
| obedient to | (విధేయంగా వున్న) |
| obliged to | (కట్టుబడివున్న) |
| occupied with | (నిమగ్నమై వున్న) |
| offended with | (బాధపడిన) |
| open to | (వెల్లడిగా వున్న) |
| partial to | (పక్షపాతంగా వున్న) |
| peculiar to | (ప్రత్యేకంగా వున్న) |
| polite to | (మన్ననగా వున్న) |
| preferable to | (యెంచుకోదగ్గ) |
| proficient in | (ఆరితేరిన) |
| profitable to | (లాభదాయకంగా వున్న) |

| | |
|---|---|
| proud of | (గర్వంగా వున్న) |
| quick of | (చురుకైన) |
| quick at | (యుక్తివున్న) |
| ready for | (సిద్ధంగా వున్న) |
| reconciled with | (సయోధ్యకుదిరిన) |
| reduced to | (తగ్గిపోయిన) |
| regardless | (లెక్కలేని) |
| related to | (సంబంధించిన) |
| relevant to | (సంబంధించిన) |
| repentant of | (పశ్చాత్తాప పడ్డ) |
| respectful to | (గౌరవించే) |
| responsible to | (బాధ్యతగా వున్న) |
| restricted to | (పరిమితం అయిన) |
| rich in | (సమృద్ధిగా వున్న) |
| sacred to | (పవిత్రంగా వున్న) |
| satisfied with | (సంతృప్తిపడ్డ) |
| sensitive to | (సులభంగా చలించే) |
| short of | (కొరత అయిన) |
| serviceable to | (ఉపయోగించే) |
| silent about | (ఉపేక్షించే) |
| similar to | (పోలికవున్న) |
| skilful in | (నేర్పువున్న) |
| sick of | (విసుగు చెందివున్న) |
| slow of/at | (మందకొడిగా వున్న) |
| sorry for | (బాధపడే) |
| sufficient for | (సరిపడా) |
| suitable for | (తగినట్టు) |
| suited to | (తగ్గట్టు) |
| sure of | (ఖాయం అయిన) |
| suspicious of | (అనుమానించే) |
| sympathetic with | (సానుభూతి వున్న) |
| thankful for | (కృతజ్ఞతగా వున్న) |
| tired of | (విసిగిపోయిన) |
| true to | (నిజాయితీ వున్న) |
| useful for | (ఉపయోగకరమైన) |
| vexed with/at | (విసుగుచెందిన) |
| wanting in | (లేకపోయిన) |
| worthy of | (యోగ్యమైన) |

యింతవరకూ కొన్ని adjectives తో వచ్చే prepositions చూశాం. యిప్పుడు verbs తో prepositions ని చూద్దాం.

Verbs followed by prepositions

| | |
|---|---|
| abide by | (కట్టుబడివుండు) |
| abound with | (నిండివుండు) |
| abstain from | (తప్పించుకొను) |
| accede to | (అంగీకరించు) |
| accuse of | (నిందించు) |
| admit (someone) to/of | (చేర్చు, అంగీకరించేట్టు వుండు) |
| agree to/with | (వొప్పుకొను – ప్రతిపాదనకి, వ్యక్తితో) |
| aim at | (గురిపెట్టు, ఉద్దేశించు) |
| apologize to | (క్షమాపణ చెప్పుకొను) |
| appeal to | (విజ్ఞప్తి చేయు) |
| appoint to | (నియమించు) |
| arrive at | (చేరు) |
| attend upon | (హాజరుగా వుండు) |
| avail of | (ఉపయోగించుకొను) |
| avenge on | (పగతీర్చుకొను) |
| Bear with | (సహించు) |
| beat against | (కొట్టుకొను) |
| beg of/for | (అర్థించు) |
| believe in | (విశ్వసించు) |
| bestow on | (వుంచు) |
| beware of | (జాగ్రత్తగా వుండు) |
| blame for | (నిందించు) |
| boast of | (గొప్పలు చెప్పు) |
| borrow from | (యెరువు తెచ్చుకొను) |
| buy of | (ఖరీదుచేయు) |
| call on | (దర్శించు) |
| call to | (పిలుచు) |
| call for | (అపేక్షించు, అడుగు) |
| care for | (జాగ్రత్తపడు) |
| catch up | (అందుకొను) |
| charge with | (ఆరోపించు) |
| come across | (కలుసుకొను) |
| compare with/to | (తారతమ్యం చూపు, పోల్చు దేనితోనైనా, యెవరితోనైనా) |

| | |
|---|---|
| compete with | (పోటీపడు) |
| complain of/against | (ఫిర్యాదుచేయు, ఆరోపించు) |
| comply with | (అంగీకరించు) |
| confer on | (ప్రదానం చేయు) |
| confide in | (విశ్వాసం వుంచు) |
| congratulate on | (అభినందించు) |
| consent to | (ఒప్పుకొను) |
| convict of | (శిక్షించు) |
| cure of | (నయంచేయు) |
| deal in | (వ్యవహరించు) |
| deal with | (వ్యవహరించు) |
| defend from | (సమర్థించు) |
| depend on | (ఆధారపడు) |
| deprive of | (లేకుండాచేయు) |
| derive from | (పొందు) |
| differ from | (తేడాగా వుండు) |
| die of/by | (చనిపోవు – జబ్బుతో, సాధనంతో) |
| differ with | (విభేదించు) |
| disagree with | (అంగీకరించకుండా వుండు) |
| dispose of | (వదిలించుకొను) |
| distinguish from | (తారతమ్యంచూపు) |
| dream of | (కలగను) |
| enlist in | (చేరు) |
| exchange for | (బదలాయించుకొను) |
| explain to | (వివరించు) |
| fall upon | (దూకు) |
| feed on | (బతుకు) |
| feel for | (బాధపడు) |
| fight with/against | (పోరాడు) |
| fly at | (యెగురు) |
| fly into | (యెగిరిపోవు) |
| furnish with | (అమర్చు) |
| get at | (కనిపెట్టు) |
| get over | (తేరుకొను, కోలుకొను) |
| get to | (చేరుకొను) |
| get through | (కృతార్థత పొందు) |
| grieve at/for | (బాధపడు, శోకించు) |
| grumble at | (సణుక్కొను) |
| guard against | (రక్షించు) |

| | |
|---|---|
| hear of | (విను) |
| hide from | (దాంకొను, దాచు) |
| hinder from | (నిరోధించు, ఆపు) |
| hope for | (ఆశించు) |
| inform of | (చెప్పు) (somebody) |
| impress on | (హత్తుకొనేటట్టుచేయు) |
| inquire into | (శోధించు) |
| insist on | (పట్టుబట్టు, నొక్కిచెప్పు) |
| interfere with | (జోక్యంచేసుకొను) |
| interfere in | (కలిగించుకొను) |
| introduce to | (పరిచయంచేయు) |
| invite to | (పిలుచు) |
| jeer at | (హేళనచేయు) |
| join to | (కలుపు, చేర్చు) |
| join in | (చేరు) |
| jump at | (యెగిరి గెంతువేయు) |
| jump to | (త్వరపడి తీర్మానించు) |
| keep away | (దూరంగా వుండు) |
| keep to | (వొకదానిమీద నిలబడు) |
| kick at/against | (వ్యతిరేకించు, నిరసించు) |
| labour for | (శ్రమించు) |
| laugh at | (పరిహాసంచేయు) |
| lay to | (అధీనంలో వుంచు) |
| lead to | (తీసుకువెళ్లు) |
| lean to | (వాలు) |
| level with | (సమమవు) |
| listen to | (విను) |
| live at | (వొకస్థలంలో వుండు) |
| live on | (బతుకు – ఫలానా ఆహారంతో) |
| live by | (బతుకు – యే వృత్తితోనేనా) |
| look at | (చూచు) |
| look after | (కాపాడు) |
| look forward to | (యెదురుచూచు) |
| look down upon | (చిన్నచూపు చూచు) |
| look out for | (వెతుకు) |
| meddle with | (కలగాపులగం చేయు) |
| meet with | (యెదుర్కొను) |
| mix with | (కలిపివేయు) |
| murmur against | (గొణుక్కొను) |

| | |
|---|---|
| object to | (అభ్యంతరపెట్టు) |
| occur to | (బుర్రకి తట్టు) |
| originate in | (ఆరంభమగు) |
| part with | (విడిపోవు) |
| part from | (విడతీయు) |
| partake of | (పాలుపంచుకొను) |
| pass for | (అనిపింపచేయు) |
| perish by | (నాశనం అగు) |
| pine for | (విరహం చెందు) |
| play with | (ఆడుకొను) |
| play on | (వాయించు) |
| prefer to | (ఇష్టపడు) |
| present with | (బహూకరించు) |
| preserve from | (రక్షించు) |
| preside over | (అధ్యక్షత వహించు) |
| prevail on | (ఆధిపత్యం జరిపించు) |
| prevent from | (అడ్డగించు) |
| profit by | (లబ్దిపొందు) |
| prohibit from | (నిషేధించు) |
| protect from | (కాపాడు) |
| provide for | (సమకూర్చు) |
| provide with/against | (సమకూర్చుకొను) |
| put up with | (భరించు) |
| quarrel with | (పేచీపడు) |
| reconcil/with | (సర్దుకుపోవు) |
| recover from | (కోలుకొను) |
| refrain from | (ఆపుకొను) |
| rejoice at | (సంబరపడు) |
| relieve of/from | (ఉపశమనం కలిగించు) |
| rely on | (ఆధారపడు) |
| remind of | (గుర్తుచేయు) |
| repent of | (పశ్చాత్తాప పడు) |
| revenge on | (కసితీర్చుకొను) |
| reward with | (బహూమతీ యిచ్చు) |
| save from | (కాపాడు) |
| search for | (వెతుకు) |
| seek for | (వెతుకు) |
| send for | (కబురుచేయు) |
| shudder at | (వణుకు) |

| | |
|---|---|
| side with | (వత్తాసువుండు) |
| smile at | (పరిహాసించు) |
| stick to | (మళ్లకుండా వుండు) |
| submit to | (లొంగివుండు) |
| succeed in | (జయించు, నెరవేరు) |
| supply to/with | (యెవరికేనా, యేదేనా యిచ్చు) |
| sympathise with | (సానుభూతి చూపించు) |
| talk of/about | (చెప్పుకొను) |
| trust in | (విశ్వసించు) |
| wait for | (యెదురుచూచు) |
| warn of | (హెచ్చరించు) |
| wonder at | (ఆశ్చర్యపడు) |
| wrestle with | (కుస్తీ పట్టు, యెదిరించు) |
| yield to | (లొంగిపోవు) |

యిక మరొక్క అంశం చూసి prepositions ని ముగిద్దాం. అదేమిటంటే పైన తెలుసుకున్న వాటితో బాటుగా gerund వచ్చే prepositions కొన్ని వున్నాయన్న విషయం. పైన nouns కి, verb కి, adjectives కి వచ్చే prepositions చూశాం. Gerund or verbal noun కొన్ని prepositions ని follow అయి వస్తుంది. ఆ ఉదాహరణలు కొన్ని చూద్దాం.

| | |
|---|---|
| addicted to drinking | (not drink) |
| disqualified for working | (not work) |
| desist from talking | (not talk) |
| negligent in paying | (not pay) |
| intent on going | (not go) |
| insist on doing | (not do) |
| right of holding | (not hold) |
| gift of attracting | (not attract) |
| fortunate in having | (not have) |
| fond of eating | (not eat) |
| excuse for being late | (not excuse to be late) |
| assist in doing | (not to do) |
| abstain from smoking | (not to smoke) |
| bent on coming | (not to come) |
| confident of succeeding | (not to succeed) |
| refrain from speaking | (not to speak) |
| passion for studying | (not to study) |
| prevented from working | (not to work) |
| prohibited from smoking | (not to smoke) |

| | |
|---|---|
| desirous of visiting | (not to visit) |
| succeeded in achieving | (not to achieve) |
| hinder from going | (not to hinder) |

కొన్ని సందర్భాల్లో infinitive, gerund కూడా వస్తాయి ఉదాహరణకి accustomed to walk or walking, afraid to go or of going; decide to stay or decide upon staying.

Prepositions కి సంబంధించి యింతవరకూ అధ్యయనం చేసిన అంశాల్ని బట్టి అభ్యాసాలు చెయ్యడం నేర్చుకోవాలి. Prepositions correct గా use చెయ్యడం ఇంగ్లీషుభాషా పరిజ్ఞానానికి ముఖ్యం పైన అన్ని సందర్భాల్లోనూ prepositions ఉపయోగంలో తప్పులు ఒప్పులు చూశాం అయినా గానీ యింతకుముందు అనుసరించిన పద్ధతినే అనుసరిస్తూ అభ్యాసంగా కొన్ని incorrect, correct uses ని చూసి దీన్ని ముగిద్దాం. పైన తడమని అంశాల్నే సాధ్యమైనంతవరకూ చూద్దాం

| Incorrect | Correct |
|---|---|
| 1. Your conduct admits no excuse | Your conduct admits of no excuse. |
| 2 The examination will begin from Monday. | The examination will begin on Monday |
| 3 They discussed about the matter | They discussed the matter. |
| 4 The student is able to cope up with studies | The student is able to cope with his studies |
| 5 He picked up a quarrel with me. | He picked a quarrel with me. |
| 6. *Due to the accident, I could not go | Owing to the accident I could not go |
| 7. I signed on the agreement. | I signed the agreement |
| 8. What is the time in your watch? | What is the time by your watch? |
| 9 He resigned from his post | He resigned his post. |

*వివరణ :

ఈ మాదిరి వాక్యాలు మన దేశంలో వినిపిస్తూ వుంటాయి. వాక్యాన్ని Owing to తో ప్రారంభించవచ్చు కాని due to తో ప్రారంభిస్తే 'be' form ని దానిముందు వాడాలి. It was due to the accident అంటూ. The accident was due to careless driving, అనచ్చు. 'due to' అంటే that may be attributed to అని అర్థం. Owing to అంటే because of అని. దీనితోనే వాక్యం మొదలు పెట్టవచ్చు

| | | |
|---|---|---|
| 10. | He does not pray god. . | He does not pray to god. |
| 11 | He was late for an hour. | He was late by an hour. |
| 12 | I told him the whole thing on his face. | I told the whole thing to his face |
| 13. | He washed his hands in water. | He washed his hands with water. |
| 14 | His name precedes before mine. | His name precedes mine. |
| 15 | We must guard ourselves from bad habits. | We must guard ourselves against bad habits. |
| 16. | He disposed off the complaint. | He disposed of the complaint |
| 17 | I went there by foot. | I went there on foot. |
| 18. | She rides on a car | She rides in a car. |
| 19 | We saluted to him | We saluted him |
| 20 | He sat on a tree | He sat in a tree. |
| 21 | I have no sympathy for him. | I have no sympathy with him (or I feel no sympathy for him ) |
| 22 | He is popular among his students. | He is popular with his students |
| 23 | Here is the book that you asked | Here is the book you asked for. |
| 24. | I met with you father yesterday. | I met your father yesterday. |
| 25 | This is the road to go on. | This is the road to go by |
| 26 | He gave the constable a pistol to shoot | He gave the constable a pistol to shoot with. |
| 27. | The Bank is on the backside of our house. | The Bank is behind our house. (లేదా on the back of our house) |
| 28. | It happened during 1920-1922. | It happened between 1920-1922. |
| 29. | It happened between my absence. | It happened during my absence. |
| 30 | They spend much money for luxuries | They spend much money on luxuries |

# 9 Conjunctions

Conjunction అంటే యేమిటో ఆ పదంలోనే కొంత అర్థవివరణ వుంది. word that joins other words or clauses etc., కలిపేపదం, మన వ్యాకరణంలో సముచ్చయం అంటారు.

Bread and butter, cakes and ale,
Try and come early; spoke loudly and clearly, choose watch or clock;

పైన చూసిన ఉదాహరణల్లో 'and' అనే పదం రెండు మాటల్ని కలుపుతోంది, 'or' కూడా అంతే. ఆ రెండు మాటలూ వొకే రకమైన unit కి చెందినవి.. అంటే noun అయితే రెండూ nouns, verb అయితే రెండూ verbs, adverb అయితే రెండూ adverbs. అంటే 'and' రెండు సమాన units ని కలిపే సముచ్చయం అన్నమాట. యెక్కువ ప్రాచుర్యంగా కనిపించేది కాబట్టి యిది వొక conjunction అని సులభంగా చెప్పగలుగుతున్నారు. అయితే యిది వొక విభాగానికి చెందినది మాత్రమే. యిలా రెండు equal rank కి చెందిన వాటిని కలిపేవి conjunctions ని co-ordinating conjunctions అంటారు.

అలాకాక unequal rank లో వుండే రెండు clauses ని కలిపేవి subordinating conjunctions.

I cannot see how he can win.
He will pass, if he works hard.

యీ వాక్యాల్లో 'how' 'if' రెండు వాక్యాల్ని కలుపుతున్నాయి. అయితే వొకటి main or independent clause రెండవది. depending or subordinate clause. అంచేత how, if subordinating conjunctions.

యివి రెండూ కాక correlative conjunctions వున్నాయి. వాటిని pairs లో వాడతారు.

He is either a rogue or a fool.
He was neither rich not clever.

యీ వాక్యాల్లో either..or, neither..nor లు correlative conjunctions.

యిప్పుడు విడివిడిగా యీ conjunctions గురించి తెలుసుకుందాం. ముందుగా coordinating conjunctions ని చూద్దాం.

Coordinating conjunctions నాలుగురకాలు:

**1. Cumulative:** యీ conjunctions వోదాన్ని మరోదానికి కలుపుతాయంతే.

and : We bought a table and spent some money.
both...and : He was both fined and imprisoned.
as well as : She as well as her husband is lazy.
No less than · She no less than her husband is guilty.
Not only...but also · He was not only fined but also expelled

**2. Alternative conjunctions or disjunctive conjunctions :**

యీ conjunctions వొక alternative నో choice నో తెలియచేసేందుకు వాడతారు.

Either...not : Either he is innocent or feigns innocence
Neither...nor : Neither a borrower nor a lender be
Or : Buy a pen or a pencil.
Otherwise, else : Work hard, otherwise you will not pass.

**3. Adversative :** అంటే opposition నో contrast నో తెలియజేసేవి.

But : He is sad, but hopeful.
Still, yet : He is rich, yet (still) he is not happy.
Nevertheless : There was no news; nevertheless she went on hoping.
Where, while : Wise men love virtue, whereas (while) fools shun it.

4. యింకా యీ conjunctions ని వొక అంశాన్నిinfer చేస్తున్నప్పుడో, మరొకదాన్నిబట్టి రుజువు చేస్తున్నప్పుడో వాడతారు.

Therefore : He was caught stealing, and therefore he was fined.
So, and so : She was not attractive, and so she was not married.
for : He failed in the exam for he was lazy.

**Subordinating conjunctions :**

యివి చాలారకాలున్నాయి. That, because, if, as, since, though, although, eventhough, unless, lest, before, till, until లాంటివన్నీ యీ రకం conjunctions.

యివి కాలాన్ని, కారణాన్ని, ఫలితాన్ని, పోలికని, షరతుని యింకా అలాంటి వాటిని తెలియ చేసేందుకు వస్తాయి. ఆయా విభాగాలకిందనే వీటిని గురించి తెలుసుకుందాం.

### Time

Do it now before you forget

Wait till I return.

I have known her since we were at school.

They left the hall after the national anthem had been played.

Make hay while the sun shines.

### Cause or Reason

I went home early because I had a severe headache.

I shall meet her since she desires it.

Let us go to bed as it is twelve.

### Result or Consequance

She did not think that I could pass the test.

### Purpose

We eat that we may live.

Work hard lest you should fail.

### Condition

I do not see him if he does it again.

He will help you provided you behave well.

### Contrast

He is not contented though he is very rich.

Her health has not improved, although good treatment was given her.

### Comparison

She is as tender as a flower.

I like you no less than he(likes you).

యిప్పుడు కొన్ని correlative conjunctions ని చూద్దాం. Pairs లో వాడేవాటిని correlative conjunctions అంటారు. వీటిలో అతి సామాన్యంగా వాడేవాటిని చూద్దాం.

### Either...or

He is either a rogue or a fool.

Either he is mistaken or his mother.

**Neither...nor**

He was neither happy nor sad.
She neither wept not cried

**So...that**

He is so weak that he cannot walk

**Not only...but also**

He is not only my brother, but also my guide.
She is not only beautiful, but intelligent also.
Not only does he speak well, but he writes well also.

**No sooner...than**

No sooner did the bell ring than the boys left the class.
No sooner does he arrive than he begins to work.

**Hardly...when**

We had hardly come out of the house when it began to rain.

**So, as...as**

He is not so rich as you think.
It is as pure as a crystal.

యిప్పుడు conjunctions కి సంబంధించిన correct usage కొంతచూసి యీ అధ్యాయం ముగిద్దాం

call, appoint, elect, make, name, choose, consider, think అనే verbs కి తర్వాత 'as' గాని, 'to be' గాని రాదు.

We call it as mango తప్పు, we call it mango. యిలాగే మిగిలినవీనీ.

'As if', 'as though' ల తర్వాత present tense వాడకూడదు. 'Were' ని main verb present tense లో వుంటేనూ, 'had been' ని main verb past tense లో వుంటేనూ వాడాలి.

He weeps as if he were poor.
He ran as if he had been shot.

Hardly తర్వాత సర్వదా 'when' వస్తుంది, 'than' కాదు. Scarcely తర్వాత 'before' కాని, 'when' కాని వస్తుంది. No sooner తర్వాత 'than' వస్తుందేకాని 'then' కాని, but కాని రావు. Such తర్వాత 'as' సర్వదా వస్తుంది.

Lest తర్వాత విధిగా 'should' రావాలి.

Either...or, neither.. nor, both...and, not only...but also, లని వాడే టప్పుడు first member ని 'immediately before the words that are contrasted' వుంచే జాగ్రత్త తీసుకోవాలి. ఉదాహరణకి

Neither he is a rogue nor a mad man అనకూడదు, He is neither a rogue nor a mad man అనాలి.

Either తర్వాత yet వస్తుంది కాని but కాదు.
Though తర్వాత yet వస్తుంది, but కాదు.

Than అనేది subordinating conjunction. దీని తర్వాత వచ్చే subordinate sentence elliptical. అంచేత case విషయం జాగ్రత్తగా చూసుకోవాలి. ఉదాహరణకి

He is stronger than I (అంటే am strong) అని, అంచేత He is stronger than me అనకూడదు.

యిప్పుడు యీ రెండు వాక్యాలకీవున్న తేడాని చూడండి, case విషయం correct గా బోధపడుతుంది.

(a) I love you better than him (I love him – అంటే better than I love him అని.)
(b) I love you better than he (loves you)

యిదేరకంగా She is as clever as I (am)
He can jump as high as I (can jump) అని వుండాలికాని 'as clever as me' అని, 'as high as me' అనీ అనకూడదు.

Rather, other ల తర్వాత than వస్తుంది.

Unless, until, if not, so that లని negative, అంటే 'not' వున్న వాక్యంలో వాడకూడదు. యేమంటే 'unless' అంటేనే 'if not' అని.

'Since' ని conjunction గా వాడేటప్పుడు తర్వాత వచ్చే verb simple past tense లో వుండాలి

'Before' ని future event ని నిర్దేశించే conjunction గా వాడితే principal clause future లో వున్నా, before తర్వాతి verb future లో వుండదు. ఉదాహరణకి

The leaves will fall before autumn will set in అనకూడదు.
The leaves will fall, before autumn sets in (or autumn has set in)

Supposing తర్వాత if రాదు; యేమంటే యీ రెండు conditional usage కి చెందినవే, యేదో వొకటే రావాలి.

ముగింపుగా Incorrect, Correct sentences ని కొన్నింటిని చూద్దాం.

| | Incorrect | Correct |
|---|---|---|
| 1 | College life is charming and school life is dull | College life is charming but school life is dull |
| 2. | He is very noble, but helps the poor. | He is very noble and helps the poor. |
| 3. | Both Mohan and his brother were not there. | Neither Mohan nor his brother was there |
| 4. | He not only lost his ticket but also his luggage. | He lost not only his ticket, but his luggage also. |
| 5 | He dresses like his brother. | He dresses as his brother does. |
| 6. | I met no other man but Mr.Raghav. | I met no other man than Mr.Raghav. |
| 7. | He does not speak before he is compelled | He does not speak unless he is compelled. |
| 8. | Neither did I eat, nor I slept. | Neither did I eat nor did I sleep. |
| 9. | I doubt that he will come. | I doubt whether he will come |
| 10 | The choice is between glorious death or shameful life | The choice is between glorious death and shameful life. |
| 11. | His flat is equally beautiful as that of mine | His flat is as beautiful as that of mine. |
| 12. | Before you will come, she will have left. | Before you come, she will have left. |
| 13 | Take care of the boy until he is with you | Take care of the boy as long as he is with you. |
| 14. | Because he is dull, therefore he is punished. | He is dull, therefore he is punished లేదా Because he is dull, he is punished. |
| 15. | He is not hard working or intelligent. | He neither hard working nor intelligent. |
| 16. | He had no choice than to yield. | He has no choice but to yield. |
| 17. | Hardly he had reached home that the rain started. | Hardly he reached home, when the rain started. |
| 18. | He had scarcely reached the station than the train started. | He had scarcely reached the station when the train started. |
| 19. | No sooner we reached there when it began to rain. | No sooner did we reach there than it began to rain. |
| 20. | He ran away lest you should not be punished. | He ran away, lest you should be punished. |

| | |
|---|---|
| 21. Unless you donot go there you cannot see him | Unless you go there you cannot see him. |
| 22. Either the action was just or unjust | The action was either just or unjust. |
| 23. He was chosen to be captain | He was chosen a captain. |
| 24. We did nothing else than cry | We did nothing else but cry. |
| 25. So far they are concerned | So far as they are concerned |
| 26. He said that, "I am not feeling well" | He said, "I am not feeling well." |

# 10 Direct and Indirect Speech

యిప్పుడే ముగించిన conjunctions అధ్యాయంలో He said that "I am not feeling well" అనే వాక్యాన్ని correction of sentences లో ఆఖర్న చూశాం. అది తప్పని, He said, "I am not feeling well" అని 'that' తీసేస్తే correct అని చూశాం. అయితే 'that' వుంచడం తప్పవుతుందా? He said that he was not feeling well అంటున్నప్పుడు that వుందికదా అని అడగచ్చు. That వుంచడం తప్పా కాదా అని కాదు ప్రశ్న. యెక్కడ వుంచకూడదో అక్కడ వుంచడం, యెక్కడ వుంచాలో అక్కడ వుంచక పోవడం తప్పు. పైన చూసిన వాక్యంలో direct sppech కి ముందు, అంటే quotations లో వుందే, ఆ వాక్యానికి ముందు 'that' అక్కర్లేదు. రెండో వాక్యంలో, అంటే quotation marks లేని వాక్యానికి ముందు, that వుందే అది ఒప్పు. అక్కడ that వుండాలి.

యిప్పుడు quotation marks వుండడం, లేకపోవడం యేమిటి అనే ప్రశ్న వస్తుంది. యీ విషయం గురించి చూడబోయేదే యీ అధ్యాయం.

'Quotation marks' లో వుందంటున్నవాక్యం direct speech లో వున్న వాక్యమన్న మాట. అంటే actual words of the speaker, వో వ్యక్తి చెప్పిన మాటల్ని యధాతధంగా అలానే తిరిగి చెప్పడమన్నమాట. అలా కాకుండా quotation marks తీసేసి ఆ భాషణ 'substance' ని, ఆ వ్యక్తి చెప్పిన exact words ఉపయోగించకుండా చెప్పడాన్ని In direct speech, పరోక్షంగా చెప్పడం, అంటారు. ఇంగ్లీషుభాషలోని విశిష్ట విషయాల్లో యీ Direct, Indirect speech వొకటి. మన భాషలో యీ actual words, substance of speech లాంటి యిబ్బందులు లేకపోవడంవల్ల ఇంగ్లీషుభాష usage లో మనం తప్పులు చేస్తూవుంటాం. దీనికి సంబంధించిన grammatical rules తెలుసుకుని తప్పులు తప్పించుకుందాం.

Actual words of the speaker quotation marks లో చెపితే అది Direct అనీ, quotations తీసేసి, substance చెపితే అది indirect speech అనీ చూశాం.

Direct speech లో quotation marks ముందు వున్నదాన్ని *reporting*

*speech* అంటారు Quotations లోని భాగాన్ని *reported speech* అంటారు He said, "I am not feeling well" అన్న వాక్యంలో He said అనేది reporting speech. Quotations లో వున్న "I am not feeling well" అనేది reported speech.

యిలా quotations లో వున్నదాని substance ని వాక్యం మార్చి చెప్పచ్చు. అంటే direct speech లో వున్న దీన్ని indirect speech లోకి మార్చవచ్చన్నమాట. అలా మార్చాలీ అంటే యేం చెయ్యాలీ అన్నదే ప్రస్తుతాంశం.

ఆ విషయానికి వెళ్లేముందు Direct speech కి సంబంధించి యీ విషయాలు జాగ్రత్తగా గమనించాలి .

Reported speech ని inverted commas లో వుంచాలి.
Reported speech లోని first word capital letter తో మొదలవుతుంది.
Reported speech నీ reporting verb నీ comma separate చేస్తుంది

He said, "I am not feeling well" అన్న వాక్యంలో యీ పద్ధతి అంతా వుంది.

యిక Indirect speech లోకి యీ direct వాక్యాన్ని మార్చేటప్పుడు : Inverted commas ని, అంటే quotation marks ని " " తీసేస్తారు

Reporting verb ని reported speech నీ separate చేసే comma పోతుంది.

Reporting verb తర్వాత general గా conjunction 'that' ని తీసుకువస్తారు.

Reporting verb లో వున్న tense ని యెన్నడూ మార్చరు.

అంటే 'He said' అని పైన వుంది కదా, యిక్కడ అది Past tense లో వుంది, అది present tense లోనూ వుండచ్చు, future tense లోనూ వుండచ్చు. యింతకీ అది (reporting verb) యే tense లో వుంటే ఆ tense లోనే అలానే వుంటుంది – దీన్నిబట్టి reported speech లో verb మారుతుందేగాని, యిది మారదు.

Question marks, (?), exclamatory marks (!) వుండవు– అంటే Direct speech లో Interrogative, exclamatory sentences గా వున్నవి assertive *sentences* గా మారతాయన్నమాట యిక ముఖ్యంగా గమనించాల్సింది *tense* sequence follow అవడం

Tense change కి rules యేమిటో చూద్దాం.

**I.** Reporting verb గనక Present tense లోనో, future tense లోనో వుంటే–అంటే quotation marks ముందువున్న verb అని తెలుసుకదా–reported

speech లో వున్న verb tense మారదు. అంటే quotation marks లో వున్న verb tense అన్నమాట. ఉదాహరణకి

1. He says, "Jack kills a giant"
2 She says, "Jack will kill a giant"
3 They will say, "He can visit us any time"
4 He says, "They came in the morning"

అనే వాక్యాలున్నాయనుకోండి యిక్కడ quotation marks ముందు వున్న verbs present tense లో వున్నాయి. Quotation marks లో వున్న verbs present లో వున్నాయి, (1-2) 3 future లోనూ, 4 Past tense లోనూ వున్నాయి. వీటిని indirect speech లోకి మార్చేటప్పుడు ఆ tense మారదు, అలానే వుంటుంది.

1 He says that Jack kills a giant.
2. She says that Jack will kill a giant.
3 They will say that he can come at anytime.
4 He says that they came in the morning.

**II.** యిలాకాక reporting verb Past tense లో వుంటే, reported speech లో వున్న verb indirect speech లో corresponding past tense లోకి మారుతుంది. అంటే యేమిటి?

1 *Simple Present tense* లో వున్నది simple past గా మారుతుంది.

She said, "He plays cricket"
She said that he played cricket.

2 *Present continuous* లో వున్నది Past continuous గా మారుతుంది.

She said, "I am cooking food"
Shat said that she was cooking food.

3 *Present perfect* లో వున్నది Past perfect గా మారుతుంది.

He said, "My friend has come".
He said that his friend had come.

4. *Present perfect continuous* లో వున్నది Past perfect continuous గా మారుతుంది.

He said, "Rama has been doing homework".
He said that Rama had been doing homework.

యిక reported speech లోనే Past tense వుందనుకోండి. అప్పుడు యిలా మారుతుంది.

5. *Simple past tense, past perfect* గా మారుతుంది అంటే సర్వదా మారుతుందని కాదు, అధికభాగం మారుతుంది. కొన్నిసార్లు Past tense వుండిపోతుంది.

Gopal said, "Kiran played well".
Gopal said that Kiran had played well (Past perfect)
He said, "I drank water after the meal".
He said that he drank water after the meal (Past)

6 *Past continuous tense Past perfect continuous tense* అవుతుంది.

He said, "Sita was dancing".
He said that Sita had been dancing.

7. *Past perfect, Past perfect continuous* మారకుండా అలానే వుండిపోతాయి.

He said, "I had done the work by then."
He said that he had done the work by then.
He said, "They had been doing good job at that time".
He said that they had been doing good job at that time

8 యీ tense మార్పులు యిలా వుంటే shall, will, can, may corresponding గా should, would, could, might అవుతాయి

I said, "I shall do it".
I said that I should do it.
He said, "Ramu will come in the evening
He said that Ramu would come in the evening.
The teacher said, "Anil may pass".
The teacher said that Anil might pass.
He said, "I can jump over the wall".
He said that he could jump over the wall.

యిప్పుడు వో విషయం గుర్తుంచుకోవాలి. అది యేమంటే reported speech లో Present tense Past tense కి మారే నియమానికి వున్న మినహాయింపు, exception. Reporting speech లో verb past లో వుంటే reported speech లో వున్న Present tense, Past tense లోకి మారుతుందని కదా పైన అనుకున్నాం, II (1). ఉదాహరణగా She said, "He plays cricket". Indirect speech లో She said that he played cricket అని మారడం చూశాం అయితే exception వుంది. Reported speech యేదో వొక universal truth కి refer చేస్తూవుంటే, వొక habitual fact కి refer చేస్తూవుంటే వాటి tense మారదు. వాటి simple present tense remains unchanged. మారకుండా అలానే వుంటుంది.

He said, "Honesty is the best policy".
He said that honesty is the best policy.

యిక్కడ Present tense Past tense గా మారలేదు. యిదేమాదిరి

She said, "Man is mortal".
She said that man is mortal
He proved, "The earth is round".
He proved that the earth is round.

అని మారకుండా Present tense లోనే indirect speech లో వుంటాయి.

**III.** Pronouns, Possessive adjectives మారే rule యిది. Reporting speech లో వున్న person కి అనుగుణంగా reported speech లో pronoun మారుతుంది Reported speech లో, అంటే direct speech లో, వున్న first, second persons indirect speech లో third person లోకి మారతాయి.

(a) I, you (singular), my, your అనేవి he, she, his, her గా మారతాయి.
We, you (plural) our, your, అనేవి they, their గా మారతాయి

Rama said, "I am ill"
Rama said that he was ill.
She said, "My pen is lost".
She said that her pen was lost.
He said to the stranger, "I know you".
He said to the stranger that he knew him.
The teacher said to the student, "I know you and your uncle".
The teacher said to the student the he knew him and his uncle.
I said to the boys, "You should do your duty".
I told the boys that they should do their duty.

(b) యిప్పుడు యింకో విషయం చూద్దాం యెవరినైతే address చేస్తున్నారో ఆ వ్యక్తి speech ని report చేస్తే second person first person గా మారుతుంది. అంటే question marks ముందు first person తో ఆ మాటలు చెప్పడం వుంటే question marks లోపల వున్న second person indirect speech లో first person గా మారుతుంది.

He said to me, "You are intelligent".
He said to me that I was intelligent.
You said to me, "You can do the work".
You said to me that I could do the work.

(c) వొకో సందర్భంలో indirect speech లో వున్న pronoun వేరే వేరే వ్యక్తులకి సంబంధించి వుంటుంది. అప్పుడు స్పష్టత కోసం ఆ ఉద్దేశించిన వ్యక్తుల పేర్లని pronoun తర్వాత brackets లో వుంచడమో, లేదా pronouns బదులు nouns ని, వీలున్నచోట్ల వాడడమో, చెయ్యాలి.

He said, "I approve of your partnership with him".

దీన్ని indirect లోకి మారిస్తే He said that he approved of his partnership with him అని అవుతుంది యిక్కడ యెవరు యెవరో తెలిసేటందుకు brackets లో ఆ వ్యక్తులపేర్లు రాయాలి. లేదా ఆ proper nouns నే చెప్పాలి.

He said that he approved of Mohan's partnership with Gopal.

యిప్పుడు యీ pronouns (అన్ని పురుషలవీ) మారేతీరు గమనించండి :

| I | He(Masculine Singular) | She (feminine singular) | Plural |
|---|---|---|---|
| you (subject) | He | She | They |
| You (object) | Him | her | them |
| Me | him | her | |
| my | his | her | |
| myself | himself | herself | |
| your | his | her | their |
| We | | | they |
| Us | | | them |
| Our | | | their |

పైన చెప్పుకున్న వాటితో వాక్యాల అభ్యాసాలు చెయ్యండి.

(d) Reported speech లో 'nearness' ని తెలియచేసే మాటలు సాధారణంగా distance ని తెలియచేసే మాటలుగా మారతాయి. Direct speech లో now వుంటే indirect speech లో then అవుతుంది. యిదేమాదిరి

| | |
|---|---|
| this | that |
| these | those° |
| here | there |
| hence | thence |
| thus | so |
| ago | before |
| now | then |
| today | thatday |
| tomorrow | the nextday |
| yesterday | the day before |
| last night | the previous night |
| to night | that night |

అయితే యిక్కడ వో విషయం దృష్టిలో వుంచుకోవాలి మాట్లాడే వ్యక్తి ముందు వున్నవాటికి 'this, here, now' అనేవి refer చేస్తూవుంటే వాటిని అలానే వుంచవచ్చు.

He said, "This is the pen I like".

He said this (the pen in his hand) was the pen he liked.

The leader said, "I will fight now or never".

The leader said that he would fight now or never.

Kishore said, "Here is the gun we have been looking for".

Kishore said (pointing to the gun in hand) that here was the stick they had been looking for.

యిప్పటిదాకా direct నుంచి indirect కి speech ని మార్చేటప్పుడు verb tense sequence పద్ధతి, pronouns, nearness ని తెలియజేసే మాటలు యెలా మారతాయో చూశాం. అయితే వాక్యాలు, అంటే sentence structures, అన్నీ వొక్కలాగే వుండవుకదా. Statements వుంటాయి, exclamatory వాక్యాలు వుంటాయి. యివన్నీ direct నుంచి indirect లోకి వొక్కలాగే మారతాయా? పైన చూసిన మార్పులు సాధారణంగా Assertive or statement వాక్యపద్ధతివి Tense sequence నియమాలు అన్నిరకాల వాక్యాలకీ వర్తించేవే. కాని indirect speech లోకి మారే పద్ధతిలో వాక్యనిర్మాణ విధానం మారుతుంది. యిప్పుడు ఆ విషయం చూద్దాం.

వాక్యాలు యెలా వుండేదీ మొదటి అధ్యాయంలో చూశాం. మరోసారి స్థూలంగా చూసి, indirect speech లో యెలా మారేదీ తెలుసుకుందాం.

Assertive sentences - statements : యీవాక్యాలు sibject తో మొదలవుతాయి, full stop తో ముగుస్తాయి.

Interrogative sentences question word తో మొదలవుతాయి, చివర question mark తో ముగుస్తాయి. Where is he?

Imperative sentences లో subject implied గా వుంటుంది, వాక్యం verb తో మొదలవుతుంది. Do not waste your time.

Exclamatory sentences ఆశ్చర్యార్థకంతో (!) ముగుస్తాయి.How clever I am !

యిప్పుడు యీ రీతివాక్యాలు Indirect కి మారే విధానం చూద్దాం.

**Assertive sentences :**

పైన tense sequence, pronouns వివరణల కింద చూసినవన్నీ యీ బాపతువే.

She said, "I am leaving now"

She said that she was leaving then.

'That' అనే conjunction వచ్చి quotations పోతున్నాయి. ఇంతకుముందు చూసినట్టు మిగిలిన మార్పులు వస్తున్నాయి.

## Interrogative sentences :

అంటే questions అని కదా. Questions యెలా వుండేదీ యింతకుముందే చూశాం. అవి యెలా మారేదీ చూద్దాం.

| | | |
|---|---|---|
| Direct | : | I said to her, "What is you father?" |
| Indirect | : | I asked her what her father was |
| Direct | : | The teacher said to the boys, "How do you study?" |
| Indirect | : | The teacher enquired the boys how they studied. |
| Direct | : | "Is the tea ready?" I said to my servant. |
| Indirect | : | I asked my servant if the tea was ready. |

యిక్కడ వున్న ఉదాహరణలనిబట్టి గమనించవలసిన విషయాలు :

(a) Reporting verb 'said to'అనేది askedఅనో enquiredఅనో మారుతుంది.

(b) Question form పోయి assertive form వస్తుంది.

(c) Quotations లోపల who, whom, whose, where, when, which, what, why, how లతో question వుంటే indirect speech లోకి మార్చేటప్పుడు వాటితోనే కలపాలి. యిక వేరే conjunction వుండదు.

(d) యీ question words కాక anxiliary or helping verb తో question వుంటే (అంటే is, are, do, did, can, may లాంటివన్నమాట) if or whether అనే conjunction వస్తుంది.

## Imperative sentences :

యీ వాక్యాలకి subject వాక్యంలో వుండదు, implied గా వుంటుంది. సాధారణంగా యీ వాక్యాలు commands గానో, requests గానో, wishes గానో వుంటాయి. యివి యెలా వుంటాయో, యెలా మారతాయో చూద్దాం.

| | | |
|---|---|---|
| Direct | : | The teacher said, "Seenu, leave the room at once". |
| Indirect | : | The teacher ordered Seenu to leave the room at once. |
| Direct | : | I said to him, "Please post this letter". |
| Indirect | : | I requested him to post that letter. |
| Direct | : | Meena's mother said to her, "Do not waste your time". |
| Indirect | : | Meena's mother advised her not to waste her time. |
| Direct | : | The servant to his master, "Pardon me this time" |

| | | |
|---|---|---|
| Indirect | . | The servant begged his master to pardon him that time. |
| Direct | : | She said to us, "Let us have some music". |
| Indirect | : | She proposed to us that we should have some music |
| Direct | . | He said, "Let me have some tea". |
| Indirect | : | He wished that he might have some tea. |
| Direct | : | Rama said to Murali, "Are you going now?" Murali said, "yes" (Murali said, "No".) |
| Indirect | : | Rama asked Murali if he was going. Murali replied in the positive. (Murali replied in the negative) |

యీ వాక్యాల్నిబట్టి imperative వాక్యాలు indirect లోకి మారే పద్ధతి గమనించండి :

1. reporting verb వాక్యంలోవున్న ధోరణినిబట్టి order, request, beg, implore, told, entreat, command, propose, suggest, wish వగైరాలుగా మారుతుంది.
2. Verb mood infinitive గా మారుతుంది. అంటే verb కి ముందు 'to' వస్తుంది.
3. 'Let' తో వాక్యం మొదలైతే reporting verb proposed అనో suggest అనో మారి that గాని, should గాని వస్తాయి. 'Let' proposal ని express చెయ్యని సందర్భంలో 'might' అనో 'might be allowed' అనో, లేకపోతే మరోకటిగానో మారుతుంది.
4. ఆఖర్న చూసినట్టు yes/no జవాబులకి in the positive అని, in the negative అనీ వస్తాయి.

## Exclamatory Sentences

ఆశ్చర్యార్థక వాక్యాలకి చివర exclamatory mark '!' వుంటుంది.

| | | |
|---|---|---|
| Direct | : | I said, "How sad she is !" |
| Indirect | : | I exclaimed that she was very sad. |
| Direct | : | He said, "Good-bye, friends !" |
| Indirect | : | He bade good-bye to his friends. |
| Direct | : | He said, "God save the king !" |
| Indirect | : | He prayed that god might save the king. |
| Direct | : | He said, "Brave! you have done well!" |
| Indirect | : | He applauded him saying that he had done well. |
| Direct | : | She said, "O, for a glass of iced water!" |
| Indirect | : | She cried out for a glass of iced water. |

| | | |
|---|---|---|
| Direct | : | He said, "Hurrah! my brother has won the match". |
| Indirect | : | He exclaimed with delight that his brother had won the match |
| Direct | . | The merchant said, "Alas! I am undone". |
| Indirect | : | The merchant regretted that he had been undone |

యిప్పుడు exclamatory sentences ని indirect లోకి మార్చేటప్పుడు వచ్చిన మార్పుల్ని గమనించండి.

1. The reporting verb సందర్భాన్నిబట్టి exclaim, cry, regret, pray, wish, bless, declare అంటూ మారుతుంది.

2. Exclamatory form పోయి assertive form వస్తుంది.

3 Exclamatory mark పోయి full stop వస్తుంది.

4. O, well, brave, hurrah, alas, curse it లాంటి interjections and exclamations పోయి వేరే phrases ద్వారా ఆ భావం వ్యక్తమవుతుంది.

యిప్పుడు ముగింపుగా కొన్ని అభ్యాసాలు చూద్దాం యీ అభ్యాసాల్ని అధ్యయనంచేసి మార్పులు యేం జరిగేయో గమనించి ఆ మాదిరి అభ్యాసాన్ని మరిన్నింటిని చెయ్యండి.

## Conversion of Direct to Indirect

1. The captain said, "Is everyone present? Where is John?"
   The captain asked if everyone was present. He asked where John was. (Indirect)

2. He said to his wife, "You are not a singer". (Direct)
   He told his wife that she was not a singer. (Indirect)

3. The teacher said, "The earth moves round the sun. (Direct)
   The teacher said that the earth moves round the sun. (Indirect)

4. He said, "Hurrah! my friend has passed". (Direct)
   He exclaimed with delight that his friend had passed. (Indirect)

5. "Keep quiet boys, do not make a noise" said the teacher. (Direct)
   The teacher told the boys to kept quiet and not to make a noise. (Indirect)

6. The captain said to his men, "Stand at case". (Direct)
   The captain commanded his men to stand at case. (Indirect)

7. The teacher said to me, "Why are you late? What a trouble some boy you are! Have you no watch or clock in your home?

Can you not find out the proper time? Be punctual in future or you will be punished". (Direct)
The teacher asked me why I was late and exclaiming that I was a very troublesome boy, asked me if I had no watch or clock in my home, and could not find out the proper time. He warned me to be punctual in future or I would be punished. (Indirect)

8. George said to his brother Charles, "My dear brother, welcome! When did you arrive here?" "Today, and can you guess why I have come?" "No". (Direct)
George welcomed his brother Charles affectionately and asked him when he had arrived there. Charles replied that he had arrived that day and asked George if he could guess why he (Charles) had come. George replied in the negative. (Indirect)

9. The beggar took the rupee from her saying, "May God bless you with health and prosperity!" (Direct)
The beggar took the rupee from her and prayed that God might bless her with health and prosperity. (Indirect)

10. Raju said to his friends, "Let me do my work, please". (Direct)
Raju requested his friends that he might be allowed to do his work. (Indirect)

Direct నుంచి Indirect లోకి మార్చినట్టే Indirect నుంచి Direct లోకి మార్చడాన్ని నేర్చుకోండి. స్థలాభావంవల్ల ఆ exercise ని ఇక్కడ ఇవ్వడంలేదు. పైన చెప్పుకున్న rules ని పాటిస్తూ విద్యార్థులు తమంత తాము అభ్యాసాలు చెయ్యాలి.

# 11 Simple, Complex and Compound Sentences

Conjunctions గురించి తెలుసుకున్నాక synthesis and analysis of sentencesని అధ్యయనం చెయ్యడం న్యాయం. అయితే మనం Direct and Indirect sentences ని చూశాం. యేమంటే అదికూడా Active voice, Passive voice లాగా, Degrees of comparison లాగా transformation of sentences అధ్యయనం కిందికి వస్తుంది. ఆ మాటకి వస్తే transformation అంటేనే అర్థ విప్రతిపత్తి లేకుండా వాక్యాల్ని వొక రకంనుంచి యింకోరకానికి మార్చడం. Conjunctions అలా వాక్య సంయోగ వియోగాలకి – synthesis, analysis కి బాగా ఉపకరించడం గురించి చూశాం. యిప్పుడు వాక్యాల వ్యాకరణ నామాలూ, వాటి లక్షణాలూ, synthesis సంబంధాలూ చూద్దాం యిది చాలా విస్తృతమైన అంశం ఆ మాటకొస్తే యే అధ్యయన విషయమైనా విస్తృతమే. అంచేత అంత విస్తృతంగానూ పరిశీలించలేం కనక, ముఖ్య విషయాల్ని గురించి తెలుసుకుందాం

Simple, complex and compound sentences ఇంగ్లీషుభాష వ్యాకరణంలో వున్నాయనీ, వాటిగురించి చాలా లోతుగా పూర్వం అధ్యయనం చేసే వాళ్లనీ ఇంగ్లీషుభాష నేర్చుకుందుకు శ్రీకారం చుట్టే రోజునే విద్యార్థులకి చెప్పేస్తూ వుంటారు. అసలు అలా 'complex sentences' నేర్చుకోవడం వల్లనే ఆ తరం వాళ్లకి ఇంగ్లీషుభాష మీద 'command' వచ్చేసిందనీ గొప్పగా చెప్పడమూ వినిపిస్తుంది. సరే, ఆ విషయాన్ని అలా వుంచి అసలీ వాక్యాల స్వరూపస్వభావాలు వాటిని మార్చడం విషయమూ తెలుసుకుందాం.

మామూలుగా simple అంటే సులభం అనీ, తేలిక అనీ complex అంటే క్లిష్టం అనీ, చిక్కుగావున్న అనీ మనకి అర్థం స్ఫురిస్తుంది. అంటే సులభంగా వుండడమే simple sentence అని అర్థం వివరించుకుంటే ఇంగ్లీషు నేర్చుకునే సౌలభ్యం పట్టుబడదు. వ్యాకరణరీత్యా simple sentence అంటే, అదికాదు. మరి యేమిటి?

వాక్యాలగురించీ, phrases గురించీ, clauses గురించీ మొట్టమొదట్లో చెప్పు కున్నాం. Phrases యేమిటో, clauses యేమిటో వోసారి పునశ్చరణ చేసుకుంటే యీ సందర్భంలో అనుకూలిస్తుంది.

పూర్తి అర్థాన్ని యివ్వకుండా, own subject, predicate లేని మాటల సముదాయాన్ని phrase అంటారు. గమనించవలసిన విషయం యేమంటే phrase లో finite verb యేదీవుండదు.

I must start in a short time

యిక్కడ in a short time అనే మాటలు కొంత అర్థాన్ని అందిస్తున్నాయి కాని complete sense ని అందివ్వడంలేదు. వీటిలో వొక finite verb లేదు అంచేత యిది వొక phrase.

అలా కాకుండా subject, predicate వుండి వొక వాక్యంలో భాగంగా వున్నదాన్ని clause అంటారు. యీ clauses, main clause అనీ subordinate clause అనీ రెండురకాలు. Main clause అంటే main fact ని తెలియజేసేది, దానిమీదనే మిగిలిన వాక్యం ఆధారపడి వుంటుంది. Subordinate clause అనేది syntax రీత్యా, meaning రీత్యా main clause మీద ఆధారపడుతుంది. యిప్పుడు phrase నీ clause నీ చూద్దాం. పైన యిచ్చిన వాక్యంలో phrase చూశాంకదా. Phrase మాటలే clause గా యేర్పడే ఉదాహరణ చూస్తే సులభంగా యీ రెండింటికీ వున్న భేదం బోధపడుతుంది.

(a) They started at dawn.

(b) They started when morning came.

యీ రెండు వాక్యాలకీ అర్థం వొకటే. కాని (a) వాక్యంలో at dawn అనేది phrase. (b) వాక్యంలో clause యెందుకని? మొదటి దాంట్లో finite verb లేదు. రెండోదాంట్లో subject 'morning' verb 'came' వున్నాయి. అయితే యిది they started అనే main fact ని తెలియచేసే వాక్యంమీద ఆధారపడింది.

Phrases యెన్నిరకాలు, clauses యెన్నిరకాలు అనేవిషయమంతట్నీ మొదట్లో చూశాం. అంచేత యిప్పుడు simple sentence అంటే యేమిటో వ్యాకరణరీత్యా తెలుసుకుందాం.

On his return to Rome, he was accused of having received bribes.

యిది simple sentence, యింత పెద్దగా వున్నా simple sentence అనడమేమిటీ అనిపించవచ్చు. యింతకంటే పెద్దగా వున్నాకూడా వ్యాకరణరీత్యా యిలాంటి వాటిని simple sentence అనే అంటారు. On his return home లో finite verb వుందా లేదు. Subject, predicate అనే విభజన లేదు. 'he was accused' అనేదాంట్లో subject, predicate వున్నాయి. యికతర్వాత 'of having received bribes' అనేది ఆ 'accused' యెందుకో చెపుతుంది. దీంట్లో subject, predicate విడిగా లేవు, వో finite verb లేదు. ఉన్నదల్లా వాక్యం మొత్తంమీద వొక్క finite verb, subject మాత్రమే. మిగిలినవి phrases. Phrases యెన్ని వున్నా clauses లేనివి simple sentences అనే వ్యాకరణ వ్యవహారం.

1. A simple sentence has one subject and one predicate. Such a sentence which contains only one finite verb is called a simple sentence.

2. Compound sentence అంటే రెండో, రెండింటికంటే యెక్కువో independent sentences – వ్యాకరణంలో coordinate clauses – వున్న వాక్యం. Coordinating అంటే equal rank వున్నవి అని అర్థం. దీన్నే రెండు అంతకంటే యెక్కువ main clauses వున్న వాక్యం అనీ అంటారు. Two coordinate clauses వున్నదాన్ని double అనీ, రెండింటికంటే యెక్కువ వున్నవాటిని multiple అనీ వ్యవహరిస్తూ వుంటారు. యిలాంటి clauses ని coordinating conjunctions కలుపుతాయి. Coordinating conjuncts అంటే యేమిటైందీ conjunctions లో చూశాం

He is strong but he is a coward.
She must weep or she will die.

యీ వాక్యాల్లో but, or రెండు equal rank వాక్యాల్ని కలుపుతున్నాయి. అవి వాటికిగా independent sentences.

3. Complex sentence లో main clause వొకటే వుంటుంది. దానిమీద ఆధారపడి వొకటో, వొకటికంటే యెక్కువో subordinate clauses వుంటాయి. సరే, subordinating conjunctions వాటిని కలుపుతాయి.

Tell me where you have put it.

యిప్పుడు simple, compound, complex sentences లక్షణాలు మరోసారి తెలుసుకుందాం.

Simple sentence లో one finite verb
Compound sentence లో two or more finite verbs, coordinative conjunctions
Complex sentences లో two or more finite verbs, subordinating conjunctions.

యిలా coordinating conjunctions, subordinating conjunctions అని compound, complex sentences వేర్పాటుగా వున్నాయి. అయితే కొన్ని సందర్భాల్లో relative pronouns or adverbs కూడా coordinating clauses ని కలుపుతాయి. కాని ఆ relative pronouns or adverbs continuative sense లోనే వుంటాయి, restrictive sense లో కాదు. అంటే ఆ relative pronouns ని, adverbs ని 'and he', 'and it,' 'and this' 'and then' వగైరాలుగా విడగొట్టచ్చు.

She gave me a message which (and it) is this.
I went to Hyderabad, where (and there) I stayed a week.

యిదేమాదిరి కొన్ని సందర్భాల్లో compound sentences contracted form లో వుంటాయి, వాకే పదం అనవసరంగా repeat కావడం తప్పుతుంది. యిలా contracted form యెప్పుడు వస్తుంది?

(1) When there are two or more predicates to the same subject

He came, and (he) sang a song.
I came, and (I) saw and (I) conquered.

(2) When there are two or more subjects to the same predicate

Either he (is guilty) or his brother is guilty.
She (danced) her daughter (danced) and her sister danced.

Conjunction ని బట్టి మాత్రమే అది యే తరగతికి చెందిన వాక్యమో నిర్దుష్టంగా చెప్పలేకపోవచ్చు, యెక్కువ శాతం చెప్పగలిగినా. యేమంటే two or more subordinate clauses coordinating conjunction కలిపి complex sentence యేర్పడచ్చు, పైన relative conjunction వున్నా coordinate sentence అయినట్టు.

No one knows when he will come, or whether he will come at all, or whether he is even alive.

యిక్కడ 'or' తో కలిసిన clauses చూడండి.

యిదేవిధంగా a compound sentence is often found with a number of subordinate clauses dependent on its principal or coordinate clauses:-

She loved me for the dangers I had passed and I loved her that she did pity them.

అంచేత coordinating conjunctions వున్న వాక్యం complex sentence గా వుందా లేక compound sentence గా వుందా తెలుసుకోవాలంటే coordinating clauses principal clauses గా వున్నాయా లేక వొకదానికొకటి subordinate గా వున్నాయా చూడాలి. Principal అయినట్లయితే ఆ వాక్యం compound, subordinate అయినట్లయితే ఆ వాక్యం complex.

## Synthesis of Sentences

Synthesis of sentences అంటే అర్థం అనేక సాదా sentences ని కలిపి పొందికైన పెద్ద వాక్యాలుగా చెయ్యడం. అవి simple sentence కావచ్చు, compound కావచ్చు, complex కావచ్చు. Analysis of sentences లో వాక్యాల్ని విడగొడతాం. Synthesis లో కలుపుతాం.

చిన్న చిన్న వాక్యాల్ని కలిపి simple sentence గా చేసే పద్ధతులు ఆరు రకాలు వున్నాయి.

1. By using participles
2. By using absolute phrase
3. By using prepositions with nouns or gerunds
4. By using infinitives.
5. By using nouns or phrases in apposition
6. By using adverbs or adverb phrases

**1. By using participles**

He had finished his work He went out for a walk దీన్ని Having finished his work he went out for a walk అని మార్చి simple sentence చెయ్యొచ్చు.

**2. By using absolute phrase**

The agreement was signed. All were satisfied.

The agreement having been signed, all were satisfied

యింకో ఉదాహరణ:

The rain at last stopped The clouds dispersed. The sun appeared in the sky. The traveller again took to his journey. యిన్ని చిన్న చిన్న వాక్యాలుగా వున్నాయి. వీటన్నిటినీ absolute phrase చేసుకుని simple sentence చెయ్యొచ్చు. చూడండి, At last, the rain stopping, the clouds dispersing and the sun appearing in the sky, the traveller took to his journey again

**3. By using preposition with nouns or gerunds**

He is very rich. He is still discontented యీ రెండింటినీ for all his riches (లేదా inspite of his riches) he is discontented అని simple sentence చెయ్యొచ్చు. యింకో ఉదాహరణ: The sun went down. The work was not yet completed. యిది The sun went down before the completion of the work

She was happy. She passed in the exam

She was happy on passing the examination.

**4. By using infinitives**

I have a problem It must be finished before breakfast

I have a problem to finish before breakfast.

యింకో ఉదాహరణ చూద్దాం – మరింత చిక్కుగా వుండే ఉదాహరణ. A disease may be cured. A disease may be prevented. The second is

the better of the two. ఇక్కడ మూడు విడి వాక్యాలున్నాయి. వీటిని యీ infinitive usage పద్ధతిలో కలిపి simple sentence చెయ్యచ్చు

Of the two things - to cure a disease or to prevent it - the second is the better

**5. By using nouns or phrases in apposition**

'Apposition' అంటే పొందిక, తగివుండడం. యీ spelling జాగ్రత్తగా చూడండి apposition (not opposition) వ్యాకరణంలో వొక నామవాచకానికి అన్వయించే పదంగా దీనికి వ్యవహారం. యిలా వో noun ని గాని, వో phrase ని గాని apposition లో వుంచి చిన్న చిన్న వాక్యాల్ని simple sentence చెయ్యవచ్చు.

This man was once very rich. He is now ruined.

దీన్ని This man, once very rich, is now a ruined man అని phrase apposition తో simple sentence చేశాం

Mahatma Gandhi was the saviour of India He is generally known as 'Bapu'.

Mahatma Gandhi, generally known as Bapu, was the saviour of India

**6. By using adverbs or adverb phrases**

Adverb phrases అంటే adverb పనిని చేసేవి. Adverb phrases గురించి మొదట్లో చూశాం. యీ adverb phrases ని వాడి చిన్న చిన్న వాక్యాల్ని simple sentence చెయ్యచ్చు.

He tried his best to console her in her grief.

It was all in vain

యీ రెండు వాక్యాల్నీ

In vain he tried his best to console her in her grief అని simple sentence చెయ్యచ్చు

She was ill. She went to a doctor.

Because of her illness, she went to a doctor.

యిలా simple sentences ని పైన చూపించిన పద్ధతుల్లో వ్యాకరణరీత్యా సాధిస్తాం. అయితే పైన చూపించిన పద్ధతుల్లో అనేకం వొకే వాక్యంలో రావచ్చు, అలాకూడా simple sentence వ్యాకరణ రీత్యా యేర్పడవచ్చు. ఉదాహరణ చూద్దాం.

Raghu was fond of children This was one strong point in his character. His fondness for learning was another strong point. In other respects his character was devoid of any commendable quality

యిన్ని చిన్న చిన్న వాక్యాలుగా వున్న దీన్నంతట్నీ పైన చూసిన పద్ధతుల్లో combine చేస్తే simple sentence యిలా యేర్పడుతుంది.

But for two strong points - his fondness for children and learning - the character of Raghu was devoid of any commendable quality.

మరో వాక్యం చూసి యీ "simple sentence" చాలిద్దాం.

The English were inferior to the French in number. They defeated the French. The battle was long. It was well contested. No other battle fought during the war was so desperate.

వీటిని simple sentence గా combine చెయ్యడం:

Though inferior to the French in number, the English defeated them in a long and well contested battle – perhaps the most desperate battle fought during the war

## Compound sentence

Compound sentence, coordinate clauses (అంటే equal or independent) coordinating conjunction కలిపితే యేర్పడుతుంది.

Coordinating conjunctions నాలుగురకాలు అవి cumulative, alternative, adversative, illative conjunctions, వీటితో compound sentences యేర్పడ్డం చూద్దాం.

1. *Cumulative conjunctions* - and, as well as, both, not only but also, too లాంటివి

She sang and danced.
The poor suffer as well as the rich.

2. *alternative conjunctions* - or, either..or, else, otherwise లాంటివి.

She must weep or she will die.
Walk quickly, else you will miss the train.

Adversative conjunctions - but, yet, still, nevertheless, while లాంటివి.

He is slow. He is sure.
వీటిని కలిపి
He is slow, but he is sure.
Wise men love truth. Fools shun it
While తో కలిపితే యివి
Wise men love truth; While fools shun it.

Illative conjunctions - illative అంటే inference అనిగానీ, conclusion అనిగానీ తెలియజేసేవి. Therefore, so, for, లాంటివి

I was unwell. I could not attend the function.
I was unwell, so I could not attend the function.
I cannot write. I have hurt my hand.
I cannot write, for I have hurt my hand.

సరే, compound sentences తరచూ contracted or shortened form లో కనిపిస్తూ వుంటాయి ఒకే subject కి రెండు predicates వున్నప్పుడు, ఉదాహరణకి

The sun rose The sun reddened the clouds. అనే వాక్యాలు The sun rose and reddened the clouds అవుతాయి, రెండవసారి 'sun' రానక్కర్లేకుండా

ఒకే predicate కి two subjects వున్నప్పుడూ యిలా shortened form వస్తుంది

Some love work. Others love play.
Some love work, others play

యిలా contract అయినట్టే conjunction 'and' omit కావచ్చు.

I came, (and) I saw, (and) I conquered.
He wailed, (and) he wept, (and) he went away.

Compound sentence equal clauses తో వుంటే complex sentence యెలావుంటుందో చూద్దాం.

## Complex sentence

Complex sentence లో ఒక principal or main clause, one or more subordinate clauses వుంటాయి. Noun clause, adjective clause, adverb clause అని విభజించుకున్న clauses తో complex sentences చెయ్యొచ్చు.

*1. By using a noun clause*

You want something. I know it.
I know what you want.
My wife prepared some sweet. She will show you the method.
My wife will show you how she prepared a sweet.

*2. By using an adjective clause*

You gave me a pen, It is a very good one.
The pen which you gave me is a very good one.

He appeared to be a saint He was charged with disturbing the peace.

The man who appeared to be a saint was charged with disturbing the peace.

*3. By using an adverb clause*

He has not done his work. I want to know the reason
I want to know the reason why he has not done his work.
The bell rang. The boys left left the room.
No sooner did the bell ring than the boys left the room.
I told her not to do it. Yet she did it.
Although I told her not to do it, she did it.
You may kill me; I speak the truth
I speak the truth even if you kill me.

*Complex sentences* లో main clause, subordinate clauses వుంటాయన్న మేరకి మాత్రమే యిక్కడ ప్రస్తావించుకున్నాం. కాని noun, adjective, adverb clauses యెన్నిరకాలో వున్నాయి అన్నింటికీ ఉదాహరణలు యిక్కడ యివ్వడం పడలేదు. స్థూలంగా యీ అంశాన్ని తెలియచెయ్యడమే యిక్కడ ఉద్దేశించాం కాబట్టి లోతుల్లోకి వెళ్లడం లేదు అదీకాక sentence structure లేదా pattern పద్ధతిలో నేర్చుకోవడం మరింత సులభంగా వుండబట్టి ఆ అధ్యాయంలో వాక్య విధానాన్ని తెలుసుకుందాం కొన్ని simple, complex, compound sentences చూసి యీ అంశాన్ని ముగిద్దాం

1. He saw me. He ran away.
   On seeing me, (Having seen me) he ran away (simple)
   He had seen me and ran way (compound)
   When he had seen me he ran away (complex)

2. He was vexed with his job. He resigned.
   Being vexed with his job, he resigned (simple)
   He was vexed with his job, therefore he resigned (compound)
   Because he was vexed with his job, he resigned (complex)

3. He ran fast. He did not miss the train.
   But for his running fast he would have missed the train. (simple)
   He ran fast and so he did not miss the train. (compound)
   If he had not run fast he would have missed the train. (complex)

4. He worked hard. He failed in the exam.
   Inspite of working hard, he failed in the exam. (simple)

He worked hard and yet he failed in the exam. (compound)
Though he worked hard, he failed in the exam. (complex)

5. The doctor arrived on time. The patient survived.
But for the doctor's arrival on time, the patient would have died (simple)
The doctor arrived on time and so the patient survived. (compound)
Had not the doctor arrived on time the patient would not have survived (complex)

# 12 Punctuation and Capital Letters

Direct, Indirect speech గురించి చదివినప్పుడు quotation marks అనీ, inverted commas అనీ, exclamation marks అనీ పేర్లు తగిలాయి యివన్నీ యేమిటి? భాష మాట్లాడేభాష, రాసేభాష అని రెండు విధాలుగా వ్యవహారంలో వుంటుంది. మాట్లాడే భాషలో మాట్లాడేతీరుని బట్టీ, హావభావాల్నిబట్టీ వాక్యాల్ని అర్థం చేసుకోవచ్చు. అది statement అవుతుందో, ప్రశ్న అవుతుందో, పొగడ్త అవుతుందో వెటకారం అవుతుందో మాట్లాడే తీరునిబట్టి గ్రహించగలం. రాతలో ఆ 'హావభావ విశేషాలు' యెలా వస్తాయి? 'They are all honourable men!' అని మార్క్ ఆంటోని తిరుగుబాటుదార్ల గురించి 'జూలియస్ సీజర్' నాటకంలో అంటున్నప్పుడు అది అధిక్షేపం అని గ్రహించేటట్టుగా రాతలో వెల్లడవాలి కదా. మామూలుగా చెప్పేదానికీ అధిక్షేపానికీ వాక్య నిర్మాణంలో తేడా యేం వుంది – అదే subject, predicate order. 'You help us a lot.' '(oh!) you help us a lot!' యిలాంటి సందర్భాల్లో రాతలో అధిక్షేపమో, మామూలుగా అన్న మాటో తెలిసేటందుకు word order లేకపోతే syntax మాత్రమే కాకుండా (!) లాంటి గుర్తులో మరోటో వాడతారు.

యెవళ్లైనా ధాటీగా, అడ్డూ ఆపు లేకుండా మాట్లాడుతూవుంటే 'గుక్క తిప్పుకోకుండా మాట్లాడుతున్నా' రని తెలుగు నుడికారం ప్రకారం అంటాం. 'ఫుల్ స్టాప్, కామా లేకుండా మాట్లాడుతున్నా' రనడమూ వినిపిస్తూవుంటుంది. అయితే మాట్లాడేటప్పుడు ఫుల్ స్టాప్, కామాలు వుండవు – రాతలో వుంటాయికాని. కాని అలా అనడంలోని భావం మాత్రం మనకి బోధపడుతుంది కదా, విరామం అనేది లేకుండా అని మాట్లాడే భాషలోని ఆ సౌకర్యాల్ని రాతలో సాధ్యమైనంత మేరకు అందించేవే యీ 'విరామ' చిహ్నాలు. వాటినే punctuation అంటారు

She says Gopal is a fool.
"She", says Gopal, "is a fool"

యీ రెండు వాక్యాలూ చూడండి. మొదటిదాంట్లో quotation marks లాంటివి లేవు. రెండవదాంట్లో వున్నాయి. ఆ వుండడం వల్ల యేం జరిగింది. అర్థంలో కొంప మునిగేటంత మార్పు వచ్చింది. మొదటి వాక్యాన్నిబట్టి గోపాల్

fool అని ఆమె అన్నట్టు అర్థం వస్తోంది. Quotation marks వున్న రెండోవాక్యం ఆమె fool అని గోపాల్ అన్నట్టు తెలియజేస్తోంది. 'Comma kills' అని కథ వొకటుంది. వో ఖైదీకి ఉరిశిక్ష వేశార్ట. శిక్ష అమలు జరిగేరోజు వచ్చింది. పై అధికార్లనుంచి వర్తమానం అందాలి. జైలు అధికార్లు శిక్ష అమలు జరపాలి. యీ లోపున అధికార్లు ఉరిశిక్ష నిలుపు చెయ్యాలని అనుకున్నారు – యేదో కారణంవల్ల. అప్పుడు telegram పంపేరు. Hang him not release him అని telegram. అయితే జైలు అధికార్లు ఉరిశిక్ష అమలు జరిపేశారు. యేమంటే telegram లో comma స్థానం తారుమారయింది Hang him not, release him అని అక్కడ comma వుంటే ఖైదీ బతికి వుండేవాడు. అలాకాక telegram లో Hang him, not release him అని comma కొంచెం ముందుకు జరిగి వాడి జీవితం full stop అయిపోయింది.

సరే, యిదంతా నిజమా యిలా జరుగుతుందా అన్న అనుమానాలు కాదు యిప్పుడు మనం చూడాల్సింది. యీ చిహ్నాలు యెంత శక్తివంతమైనవో గ్రహించడమే ముఖ్యం.

పైన సరదాగా కనిపించిన వాక్యాలనుంచి స్పష్టమయేదేమిటంటే 'stops may alter the sense of a sentence' Punctuation అంటే రాతలో right use of such stops అని అర్థం.

ప్రధానమైన చిహ్నాలు :

1. Full stop ()
2. Comma (,)
3 Semicolon (;)
4. Colon (:)
5. Interrogation mark (?)
6. Exclamation mark (!)
7. Inverted commas (" ")
8. Apostrophe (')
9. Dash (-)
10. Hyphen (-)
11. Brackets ()
12. Dots (..)

యిప్పుడు వొక్కొక్కదాన్ని గురించీ వివరంగా తెలుసుకుందాం

**1. Full stop :**

(i) వాక్యం పూర్తయినందుకు చిహ్నం. Assertive sentence గాని Imperative sentence గాని end అయినట్టు సూచించే గుర్తు యిది.

Honesty is the best policy.

Stand up.

(ii) Abbreviations ని, initials ని సూచించేందుకు

M.A., M.P., I.A.S., I.P.S., Mr., Ms., Viz., i.e., e.g.,

**2. Comma :**

దీని చిహ్నం (,) దీన్ని short pause కి వాడతారు. Full stop వాక్యం పూర్తి అయినందుకు, పూర్తి pause అయితే comma తక్కువ pause కి, విరామానికి, గుర్తు. అంతేకాక దీన్ని చాలా విధాలుగా వాడడం వుంది.

(i) to mark words in apposition; యెలాగంటే
Tagore, the founder of Santiniketan, was a great poet.

(ii) after nominative address, సంబోధన తర్వాత; యెలాగంటే,
Friends, Romans, countrymen, lend me your ears.
Madam, I want your help.

(iii) to separate two or more parts of speech that come together; యెలాగంటే,
He is wise, prudent, honest, industrious and tactful
'and' కి ముందు యీ మధ్యకాలంలో comma ని వదిలేస్తున్నారు.

(iv) absolute construction తర్వాత, యెలాగంటే,
Having done his work, he went to bed.
The sun having set, we returned home.

(v) to separate each pair of words of the same class or kind; యెలాగంటే,
Rich and poor, high and low, young and old, all must die.

(vi) after an adverb phrase in the beginning of a sentence; యెలాగంటే,
In fact, Pandit Nehru was a great scholar
In the end, we were all cheated.

(vii) to separate words, phrases, or clauses inserted into the body of a sentence; యెలాగంటే,
My student could not, however, succeed in the examination.
Your behaviour, to say the least, is bad

(viii) వొక qualifying phrase ని విడదీసేందుకు; యెలాగంటే,
Tenali, the Paris of India, is in the Guntur District

(ix) before and after infinitives, యెలాగంటే,
She, to tell you the truth, is a good cook.

(x) to mark off a direct quotation from the rest of the sentence; ఎలాగంటే,

"Try, and try again", said the teacher.
The Principal said, "Mr. Rao is a good teacher".

(xi) to avoid repetition; ఎలాగంటే,

He is a singer; his sister, a dancer.
Hari is an Andhra, Murugan, a Tamil.

(xii) to separate a subordinate adverb clause from the rest of the sentence, ఎలాగంటే,

If you go there, you will receive the prize.
When the cat is away, the mice will play

(xiii) to separate short coordinate clauses of a compound sentence; ఎలాగంటే,

I came, I saw, I conquered
Men may come, and men may go, but I go on forever.

(xiv) to separate certain words from the rest of the sentence; ఎలాగంటే,

No, I am not a fool.
I am well, thank you

(xv) to separate date from the year; ఎలాగంటే,

January 26, 1948.

**3. Semicolon :**

దీని చిహ్నం (;) comma కంటే ఎక్కువ pause ని సూచిస్తుంది.

(i) to separate larger clauses from one another దీన్ని వాడతారు; ఎలాగంటే,
He left the village for good; for he wanted to go abroad to make a fortune.

(ii) coordinate clauses ని divide చేసేందుకు; ఎలాగంటే,
Reading maketh a full man; speaking a ready man; writing an exact man. – Lord Bacon

(iii) different clauses ని emphasise చేసేందుకు వాటికి commas వుంటే; ఎలాగంటే,

As Caesar loved me, I weep for him; as he was fortunate, I rejoice at it; as he was valiant, I honour, him; but as he was ambitious, I slew him.

**4. The colon :**

దీని చిహ్నం (:) దీన్ని semicolon కంటే longer pause కి వాడతారు.

(i) before enumaration;

The great rivers of India are: The Ganges, the Godavary, the Krishna and the Kaveri.

(ii) వొక quotation ని introduce చెయ్యడానికి, వొక illustration ఉదాహరణ, యివ్వడానికి, argument చెప్పేందుకు;

*Bacon says :* "He who lives in solitude is either a beast or an angel".

The main parts of speech in English are: Noun, Pronoun, verb, adverb, adjective, preposition.

*Man proposes :* God disposes.

**5. Interrogation :**

చిహ్నం (?) దీన్ని direct question కి వాడతారు. Indirect speech లో వాడరు.

Where is this town?
She said, "What is your name?" అయితే indirect లో
She asked him what his name was.

**6. Exclamation :**

దీని చిహ్నం (!). దీన్ని exclamatory phrases కి, interjections కి, exclamatory sentences కి వాడతారు

How it rains! Well done!
Alas! Ah! Oh!
Go to Hell! O, what a fall was there!

**7. Inverted commas or quotation marks :**

దీని చిహ్నం (" ") Exact words of the speaker యేమిటో తెలియచేసేందుకు, వో quotation ని చూపించేందుకు యీ marks వాడతారు.

The teacher said, "Do these excercises thoroughly".

"I would rather die," she exclaimed, "than live a life of dishonour and shame."

యిక్కడ వో విషయం గమనించండి. Quotations లో quotation వచ్చే సందర్భాలుంటాయి. అప్పుడు వాటికి singular inverted commas వాడాలి.

"He told me", my friend said, "to abide by the command 'Don't move' at all costs".

అదేరకంగా వ్యాసాలు రాసేటప్పుడో మరో సందర్భంలోనో వేరే quotations యెత్తి రాస్తూ వుంటారు ఆ యెత్తి రాసే భాగాలు paragraph లుగా వుంటాయనుకోండి. మొదలుపెట్టడం inverted commas తో మొదలు పెట్టినా, paragraph పూర్తవగానే quotation ముగించకుండా, కొత్త paragraph ని మళ్లీ inverted commas తో మొదలు పెట్టాలి మొత్తం quote చెయ్యదలచుకున్నదంతా అయేకనే quotation marks పూర్తి చెయ్యాలి దీనికి ఉదాహరణని చదివేటప్పుడు passages లో చూడండి

**8. Apostrophe** దీని గుర్తు (') దీన్ని

(i) Possession- కలిగివుండడం – తెలియచేసేందుకు వాడతారు. అంటే genitive case ని తెలియచేసేందుకు,

Mohan's book is not here.
The king's crown has fallen.

(ii) వొక అక్షరంగాని, అక్షరాలుగాని omit అయి contracted word యేర్పడినట్టు సూచించేందుకు,

I've gone there. (I have)
Don't come here (do not)
It's a wonder. (It is)

(iii) అక్షరాలకీ, అంకెలకీ plurals form చేసేందుకు

Mind your P's and Q's.
Add two 6's and four 8's

**9. The Dash** దీని చిహ్నం '–'

(i) దీన్ని parenthesis, అంటే వొకరకంగా స్పష్టతకోసం, మధ్యలో చేర్చే మాటలకి వాడతారు; ఇది వో రకంగా brackets function చేస్తుందిక్కడ.

Our two countries - India and Russia - are good friends.

(ii) హఠాత్తుగా వాక్యంలో మార్పువస్తే

Our teacher - a fat, amiable man - also became serious

**10. Hyphen** దీని గుర్తు '–'

యిది dash కంటే చిన్నది. Compound words form చెయ్యడానికి వాడతారు.

Commander - in - chief; father - in - law; writing - table;

**11. Brackets :**

దీని గుర్తు ( ); యీ బ్రాకెట్స్‌లో [ ] గుర్తుకూడా వుంది.

వీటిని words ని enclose చెయ్యడానికి, phrase ని, clause ని enclose చెయ్యడానికి వాడతారు

At the age of ten (such is the power of genius) he wrote poetry.
Abu Ben Adhem (may his tribe increase)

**12. Dots :** అంటే ....,

అచ్చులో పెట్టేందుకు వీలుకాని వాటిని సూచించేందుకో, లేకపోతే దేన్నైనా omit చేసేందుకో వాడతారు.

He spoke such vulgar words .., better not to repeat them

**The use of capital letters :**

Capital letters అంటే పెద్ద అక్షరాలు

(i) ప్రతివాక్యాన్నీ మొదలు పెట్టేటప్పుడు మొదటి మాట మొదటి అక్షరం capital letter తో ఉండాలి.

Mind your business Never come late

(ii) Poetry లో ప్రతిపాదం Capital letter తో మొదలవాలి

Youth is full of pleasure,
Age is full of cares

(iii) Proper nouns ని, వాటితో form అయిన adjectives నీ capital letter తో రాయాలి

Shakespeare, Kalidasa, Delhi, London,
Shakespearean; Indian Women, Sunday;

(iv) First person pronoun 'I' యెప్పుడూ వాక్యంలో యెక్కడ వచ్చినా capital letter గానే వుంటుంది

(v) God ని indicate చేసే nouns కి, pronouns కీ capital letters వుంటాయి Religious names కీ యింతే

God; By His grace, the Bible, the Ramayana,

(vi) Interjections ని, quotations ని ప్రారంభించేందుకు capital letters నే వాడాలి

Oh! Hurrah!
He said, "Study well".

(vii) వారాల పేర్లకి, నెలల పేర్లకీ, పండుగలకీ capital letters వస్తాయి.
Saturday, February, Holi; Ugadi;

(viii) Degree లకీ, బిరుదులకీ (titles) కీ,
M.A., D.Litt, Sir, Rao Bahadur;

(ix) ఉత్తరాల్లో ప్రారంభానికీ, conclusion కీ
Sir, Dear sir, Yours sincerely,

(x) Interjection 'o' capital letter తో వుంటుంది.

యిప్పటిదాకా punctuation marks యేమిటో capital letters యెక్కడ వాడాలో చూశాం. యిప్పుడు కొన్ని examples చూద్దాం.

ఆ మాదిరి అభ్యాసాల్ని సొంతంగా చెయ్యండి.

1. There was a miracle in the village yesterday she said lame pela geya has been ill a whole year no doctors or medicine were any use and yesterday a wise woman whispered over her and she isnt ill any more thats nothing i said we ought not to look for miracles when people are ill or old isnt health a miracle itself and life everything we dont understand is a miracle

దీనికి Punctuation marks capital letters పెట్టిన జవాబు:

"There was a miracle in the village yesterday", she said "Lame Pelageya has been ill a whole year, no doctors or medicines were any use, and yesterday a wise woman whispered over her, and she isn't ill any more."

"That's nothing," I said. "We ought not to look for miracles only when people are ill or old Isn't health a miracle itself? And life? Everything we don't understand is a miracle."

2. youre right she said with a shudder this is foolish nerves then with calm matter of factness very well lets feed our patient

జవాబు .

"You're right," she said with a shudder. "This is foolish. Nerves." Then with calm matter - of - factness, "Very well, let's feed our patient."

3. no i was in jail answered the girl with a smile with nikolai remember him oh yes exclaimed the mother

జవాబు ·

"No. I was in jail," answered the girl with a smile. "With Nikolai. Remember him?" "Oh, yes!" exclaimed the mother.

4. good bye feodor he cried and all the rest of you god bless you

జవాబు :

"Good-bye, Feodor!" he cried. "And all the rest of you! God bless you!"

5. the traveller said can you tell me the way to the nearest inn yes said the peasant do you want one in which you can spend the night no splied the the traveller i only want a meal

The traveller said, "Can you tell me the way to the nearest inn?" "Yes" said the peasant. "Do you want one in which you can spend the night?" "No", replied the traveller. "I only want a meal."

6. Whats that great big book on the table she asked, that o thats my greek dictionary your what she cried its all right it wont bite you are you learning greek yes why i though id like to

"What's that great big book on the table?" she asked. "That? Oh! that's my Greek dictionary" "Your what?" she cried "It's all right. It won't bite you." "Are, you learning Greek?" "Yes", "Why?" "I thought I'd like to."

7. telugu tamil kannada and malayalam are dravidian languages

Telugu, Tamil, Kannada and Malayalam are Dravidian languages.

8 We have to buy these things rice dal and tamarind

We have to buy these things rice, dal and tamarind.

9 when are you going perhaps i shouldnt ask why not i am going tomorrow

"When are you going – perhaps, I shouldn't ask." "Why not? I am going tomorrow."

10. thank you she murmured and added it was the least you could do

"Thank you," she murmured, and added. "It was the least you could do"

ఈ మాదిరి అభ్యాసాలు సొంతంగా చెయ్యండి.

# 13 Verb Patterns and Structures

ప్రతి వాక్యానికీ వొక నిర్మాణ పద్ధతి వుంటుంది. Sentence గురించి మొదట్లో చూసినప్పుడే వొక విషయం గమనించాం. మన భాషల్లో subject వాక్యం మొదట్లో వస్తుంది. ఇంగ్లీషులోనూ అంతే. కాని మన వాక్యాల్లో verb ఆఖర్న వస్తుంది. ఇంగ్లీషులో అలాకాక subject ని అనుసరించి వస్తుంది. "ఆమె నిన్న ఉదయం వచ్చింది" యిది ఇంగ్లీషులో she came yesterday morning. అంటే వాక్యనిర్మాణంలో, sentence structure లో sub+verb, యిక వాక్యాన్ని పూర్తిచెయ్యడానికి అవసరమైన direct object గాని, indirect object గాని, complement గాని మిగతా మాటలుగాని తర్వాత వస్తూ వుంటాయి. The order of words in a sentence గురించి తర్వాత అధ్యాయంలో చూద్దాం. అది general గా వుండే structural arrangement. కాని కొన్ని వాటికి కొన్నిరకాల structure మాత్రమే వుంటుంది. ఉదాహరణకి if-clauses, no sooner...than, Had..better, too-to లాంటివాటితో వాక్యం వుండే పద్ధతి. conditional sentences గురించి tense అధ్యాయంలో కొంత చూశాం. Structure అంటేనే way of putting something together. Tense ల గురించి తెలుసుకునేటప్పుడు Present tense, Present continuous tense వగైరాలు యెలా వుండేదీ చూశాం. Sub+verb third person singular కి 's' చేరుతుంది, యిది Present tense అవుతుంది. Sub+is/am/are+ Present Participle (or v+ing) present continuous tense అవుతుంది. యీ మాదిరీ tense ల పద్ధతి గురించి structure table కూడా వేసుకున్నాం.

ఇంగ్లీషుభాషలో sentence patterns అన్నీ verb చుట్టూతా యేర్పడ్డవే. Verb-Pattern వాక్యంలో verb మిగిలిన మాటలతో కలిసి వుండే యేర్పాటుగురించి తెలియచేస్తుంది. యింతవరకూ చదివిన వ్యాకరణంలో యీ యేర్పాటు లేదా, యీ verb pattern గురించి అధ్యయనం చేస్తేనే ఆ సులువు పట్టుబడుతుందా అనచ్చు. అదికాదు, యింత వరకూ చదివిన వ్యాకరణం అంతా వాక్యనిర్మాణ పద్ధతి వున్నటువంటిదే. Simple, complex, compound sentences గురించి కూడా చూశాం కదా. Tense sequence దగ్గర్నుంచి transformation of sentences దాకా వాక్యనిర్మాణ విధానం యేమిటో తెలియచేస్తూనే వున్నాయి. కానైతే

ఇంగ్లీషుభాషని వో Foreign language గా అధ్యయనం చేసేటప్పుడు analogy ని బట్టి వాక్యాలు కూర్చేస్తూ వుంటాం దానివల్ల తప్పులు దొర్లే ప్రమాదముంది ఉదాహరణకి తెలుగుని నేర్చుకునే విదేశీయులు usage లో యిలాంటి analogy అలవాటు వల్లనే తప్పులు చెయ్యడం చూడండి. మనం negative form చేసేటప్పుడు 'లేదు' అంటాం కదా వాడు యిచ్చేడు వ్యతిరేకంలో వాడు యివ్వలేదు. వాడు తిన్నాడు. వాడు తినలేదు యీ మాదిరీ form చేసే analogy తో "వాడు వచ్చేడు" అనేదానికి, తెలుగు నేర్చుకునే విదేశీయులు "వాడు వచ్చ లేదు" అని ప్రయోగించి వ్యాకరణం చదువుకోని తెలుగువాళ్లకి కూడా నవ్వు తెప్పిస్తారు.

అంచేత ఇంగ్లీషు నేర్చుకునే మనం verbs ని యెలా వాడాలో కొంతేనా తెలుసుకుంటే తప్పులు తప్పించుకోవచ్చు. ఉదాహరణకి 'Please show me the way', 'Please tell me the meaning అన్న ధోరణిలో Please explain me the meaning అని అనేస్తాం. కాని 'please explain to me' అనే pattern లో యీ verb వుండాలి. show, tell అనే verbs వున్న pattern లో కాదు. యింకా వేరే patterns కూడా యీ verb కి usages వున్నాయనుకోండి అది వేరే విషయం యిక్కడ మాత్రం యీ usage సరికాదు అదేరకంగా ఇండియాలో common గా want, propose లాంటి verb ల pattern లో suggest వాడేస్తూ వుంటారు. Suggest pattern లో want వాడేస్తూ వుంటారు. 'I want that you should come' అనేస్తారు, I suggest to come అనేస్తారు. Suggest, propose, want అనేవాటి patterns వొక్కలానే రావు. Want, propose లు 'to' infinitive construction తో వుంటాయి. 'I want you to meet me tomorrow'. అయితే suggest తర్వాత that clause వుండాలి. I suggest that you should meet me tomorrow.

యీ మాదిరి పొరపాట్లు లేకుండా చూసుకుందుకు verb patterns ని అధ్యయనం చెయ్యడం మంచిది. వొకే verb అనేక patterns లో రావచ్చు. Tense sequence లో structural pattern వేసుకున్నట్టు 'sub+v+etc.' విభాగించుకుంటే చాలా verbs usage పట్టుబడుతుంది. మామూలు dictionaries లో pattern గురించిన guidance వుండదు. The Advanced Learner's Dictionary of current English (ELBS) verb ల దగ్గర అర్థవివరణతో బాటు అ verb యే patterns కిందకి వస్తుందో అంకెలు వేసి వివరిస్తుంది. అంకెల వారీగా మొదట్లోనే Summary of verb patterns యిచ్చి verb ల దగ్గర ఆ అంకెల సూచన చేసింది.

అయితే patterns విషయంలో variations వున్నాయి. ఆ నిఘంటువులో సులభ అవగాహన కోసమే verb pattern 1, verb pattern 4 అంటూ సంఖ్యలు యిచ్చేరు గాని అన్ని grammar పుస్తకాల్లోనూ అదే అంకెల నిర్దేశకత్వం arbitrary గా వుండదు. అసలీ formulation of verb patterns విధానమే యిటీవలికాలంది కాబట్టి చాలా వ్యాకరణ గ్రంథాల్లో యీ విభాగమే వుండదు. సులభంగా భాషని నేర్చుకుందుకు, errors ని తప్పించుకుందుకు అనుకూలించే పద్ధతి కాబట్టి యీ

నాటి వ్యాకరణ పుస్తకాల్లో చేరుస్తున్నారు. యీ అంశం గురించి యింకా విపులంగా అధ్యయనం చెయ్యవచ్చు. ప్రస్తుతానికి కొన్ని ముఖ్యమైన verb patterns గురించి మాత్రం తెలుసుకుందాం. ఆయా నమూనాల్లో విద్యార్థులు వాక్యాలు యెక్కువగా రాసుకుని అభ్యాసం చేస్తే యెక్కువ ఉపయోగం వుంటుంది.

Sentence గురించి మొట్టమొదట్లో చూసినప్పుడు వాక్యంలో subject + predicate వుంటాయని తెలుసుకున్నాం Subject తర్వాత ఇంగ్లీషు భాషావాక్యంలో verb వచ్చి తీరుతుంది అని కదా పైన చెప్పుకున్నాం. ఆ verbs యే patterns లో వస్తాయోనన్నదే యిప్పుడు చూడబోయే విషయం. యిక్కడ యిచ్చుకుంటున్న verb pattern నంబర్లు పూరికే వరసక్రమం నిమిత్తం యిచ్చేవేకాని సర్వే సర్వత్రా వర్తించే standard కాదు

1. Subject+verb+Direct object
   I like coffee.
   She cooks food.
   He does not like cold weather.

యీ pattern సర్వసామాన్యంగా కనిపించేదే. అన్ని transitive verbs నీ simple direct object తో వాడే తీరుయిది. ఆ object గా వొక noun గాని, pronoun గాని వుంటాయి.

2. వాక్యంలో verb కి two objects వుండచ్చు (active voice, passive voice ల గురించి చదివినప్పుడు యీ విషయం వచ్చింది). వొకటి indirect object, యింకొకటి Direct object.

యీ pattern మూడు విధాలుగా వుంది. అంచేత Group A,B,C అని విభజిద్దాం. Group A లో వుండే verbs ని 'to' preposition తో కూడా వాడచ్చు Group B లో వుండే verbs ని 'for' preposition తోనూ వాడచ్చు. Group C లో వుండే verbs ని అసలు preposition తో వాడరు, వొకవేళ వాడినా అరుదు. యిలా prepositions తో వాడే pattern ని కూడా యీ తర్వాత చూద్దాం.

**Group A**

| Sub | verb | indirect object | Direct object |
|---|---|---|---|
| The Principal | gave | us | a holiday. |
| She | told | her daughter | a story. |
| The students | wished | their principal | 'Good morning'. |
| He | handed | me | a book. |

teach, pay, lend, read, deny, promise, pass, throw, offer లాంటి verbs యిలాంటివి (యీ verbs తో పై నమూనాలో వాక్యాలు అభ్యాసం చెయ్యండి)

### Group B

| Sub | Verb | Indirect object | Direct object |
|---|---|---|---|
| He | bought | his wife | a ring |
| He | got | me | a copy of the book |
| I | choose | my son | a birth day gift |
| She | made | herself | a cup of coffee. |
| He | ordered | himself | a new suit. |

Spare, leave, do లాంటివి యీ విభాగం కిందికి వస్తాయి.

### Group C

| Sub | Verb | Indirect object | Direct object |
|---|---|---|---|
| | Forgive | us | our sins |
| She | asked | me | many questions |
| That | will save | you | a lot of trouble. |
| He | struck | the thief | a heavy blow |

అయితే ask ని కొన్ని సందర్భాల్లో 'of' అనే preposition తో వాడచ్చు. యీ pattern 'C' లో, పైనే చెప్పుకున్నట్టు, preposition usage రాదు, వచ్చినా చాలా అరుదు.

A,B Group verbs కి prepositions తో కూడా usage వుందని కదా అనుకున్నాం. Indirect object, direct object లని అటూ యిటూ మారిస్తే prepositions వస్తాయి. 'for whom' అని అడిగే వీలు వుంటే 'for', 'to whom' అని అడిగే వీలుంటే 'to' వస్తాయి.

Group 'A' లో వున్న verbs కి 'to', Group 'B' వాటికి 'for' వస్తాయి.

(i)

| Sub | Verb | Direct object | Prep to | Prepositional object |
|---|---|---|---|---|
| I | gave | the money | to | my friend. |
| They | told | the news | to | everybody. |
| He | handed | a book | to | me. |
| He | offered | it | to | her. |

పైన చూసిన Group 'A' verbs ని యిలా వాక్యాల్లో రాయండి యిక Group 'B' verbs

(ii)

| Sub | Verb | Direct object | Prep.for | Prepositional object |
|---|---|---|---|---|
| He | bought | a ring | for | his wife. |
| Have | you left | any food | for | me? |
| They | save | money | for | their sister. |

పైన Group 'B' లో యిచ్చిన verbs ని యిలా వాక్యాల్లో రాయండి. యిలా preposition తో వచ్చే verbs పైనున్న Group 'A,B' verbs మాత్రమే కాదు యింకా వున్నాయి. అయితే వీటిని Group A, B verbs లాగా అటూ యిటూ మార్చి పైన చూపించిన మాదిరీ వాక్యాలు చెయ్యడం కుదరదు. అంటే "2 pattern" A,B ల మాదిరీ చెయ్యడం కుదరదు అవేమిటో చూద్దాం వీటిని 'iii' అని రాసుకుందాం అనేక prepositions యిక్కడ వస్తాయి.

(iii) Sub+verb+Direct object Prep. Prepositional object

We congratulated them on their success

They spend money on suits.

You should not throw stones at birds.

The judge excused him for his crimes.

The teacher compared him to a vulcano

They compared this map with the original

She prevented her husband from attending the function.

యిదేమాదిరీ accuse, waste, thank, protect, remind explain, excuse అనే verbs ని వాక్యాల్లో రాయండి.

3. Subject + Verb + (for) Complement

'Complement' అంటే పూర్తిచేసేది అని తెలుసుకున్నాం కదా. యీ pattern లో verbs కి distance, duration, weight, price తెలియచేసే complement follow అవుతుంది కొన్ని verbs కి 'for' అనే preposition వస్తుంది. కాని దాన్ని వదిలెయ్యొచ్చు కూడా.

We came a long way.

The rain lasted all day

The meeting lasted (for) eight hours.

We waited (for) three hours.

యిదే మాదిరీ walk, stretch, march, fall, live, weigh, cost, stay, go(up) అనే verbs ని వాక్యాల్లో రాయండి

4. Subject + Verb + Subject complement

చాలా intransitive verbs కి అర్థపూర్తికోసం subject complement కావాలి. యీ complement noun కావచ్చు, pronoun కావచ్చు, adjective కావచ్చు, adverb కావచ్చు, adjective కి equivalent అయిన prepositional phrase కావచ్చు.

Subject + Verb + Subject complement
This is a pen.
His mother is a teacher.
His dream came true.
That will be enough.
The weather has become warmer.
The plan proved useless.

యిదేమాదిరి is, are ('be' రూపాలతో), become, turn, prove లాంటి verbs ని వాడండి.

5. Subject + Verb + Noun or Pronoun + (to be) + Complement

యీ pattern లో 'to be' ని చాలా సందర్భాల్లో వదిలెయ్యవచ్చు.

| | | | | |
|---|---|---|---|---|
| I | believe | him | (to be) | honest. |
| Do you | consider | him | (to be) | innocent? |
| We | proved | her | (to be) | wrong |
| They | proved | him | (to be) | guilty. |

వీటికి Passive: He was believed (to be) honest
He is considered (to be) innocent,
She was proved wrong అంటూ వస్తుంది

యీ మాదిరి think, suppose, find అనే verbs తో వాక్యాలు రాయండి. వీటిలో verbs ని that clauseతో ఉపయోగించవచ్చు, ఉదాహరణకి I believe he is honest. యీ పద్ధతిని చూడండి.

We proved (that) she was wrong.
Do you consider (that) he is innocent?
I have found that Raghu is a good friend.

యీ 'that' clause pattern తర్వాత చూద్దాం.

6. వాక్యంలో intransitive verbs కి subject complement లాగానే object వున్న వాక్యాల్లోనూ complement అవసరం అయే verbs వున్నాయి. అక్కడ దాన్ని object complement అంటారు.

Subject + Verb + Object + Object complement (adjective)

| | | | | |
|---|---|---|---|---|
| I | find | the | purse | empty. |
| We | painted | doors | green. | |
| They | made | the | clothes | dirty. |

యిదేమాదిరీ set, break, keep, turn, hold, with లాంటి verbs వాడండి

యిలా object complement గా noun వచ్చే verbs ని చూద్దాం.

7. Sub + Verb + Object + Object complement (noun)

| | | | |
|---|---|---|---|
| They | elected | him | President. |
| They | call | the dog | Johnny. |
| We | choose | him | Chairman. |

యిదే మాదిరీ make, appoint, nominate, name, crown అనే verbs వాడి వాక్యాలు రాయండి.

వీటికి Passive He was elected President,
The dog is called Johnny అంటూ వస్తుంది

8 Sub + Verb + (not) + to-infinitive etc.

యిక్కడ to infinitive ని సాధారణంగా verb కి object గా పరిగణిస్తారు.

He wants to go to the station.
I promised to help them.
Try to do better next time.
I forgot to post your letter.
They decided not to go there.

యిదేమాదిరీ refuse, decide, intend, agree, pretend, like, remember, care అనే verbs ని వాక్యాల్లో వాడండి.

యీ 8 pattern లో చూపినవి transitive verbs. Intransitive verbs కి 'to infinitive' వచ్చే ఉదాహరణలు చూద్దాం. నమూనా యిదేకాబట్టి యిక్కడ్నే ఆ verbs నీ చూద్దాం. వొక purpose, aim అనే అర్థంలో వుంటుందిది.

He went to learn.
She came to teach
I wait to hear your opinion.
He lived to be ninety.
They seemed to notice it.
Do you happen to know where he is?

ఈ మాదిరే get, awake, cease, stop లతో వాక్యాలు రాయండి. 'Be' form verb finites తోనూ రాయండి ఉదాహరణకి Is he to stand here? Am I to come there?

ఈ verb కి 'to infinitive' వస్తుందని కదా యిక్కడ చూశాం. వీటిలో కొన్నిటికి to infinitive బదులు gerund ని పెట్టవచ్చు. అర్థంలో యే మార్పూ లేకుండానే అలా చెయ్యచ్చు.

He began talking (to talk)
I like swimming (to swim)
He started packing his books (to pack)

ఈ gerund కిందికి వచ్చేవి యింకా వున్నాయి. వాటిగురించి to infinitive pattern అయేక చూద్దాం

యిప్పుడు 'To-infinitive' ని have తో వాడడం చూద్దాం. 'have to/has to' అంటే must, obligation అన్న అర్థం వస్తుంది.

I have to study this అంటే నేను దీన్ని చదవాలి అన్న obligation ద్యోతకం అవుతోంది.

Sub + Verb + to-infinitive etc

I have to help her
They have to go to school this Sunday, haven't they?
Have you to do all this work?

Verb కి తర్వాత వెంటనే to-infinitive యిక్కడ వస్తోంది. అలాకాక verb కీ to- infinitive కీ మధ్య noun గాని pronoun గాని రావడం యెలా వుంటుందో చూద్దాం.

Sub + Verb + Noun/Pronoun + (not) to-infinitive

| | | | |
|---|---|---|---|
| He | wants | you | to see him. |
| He | bids | you | not to do it |
| I | told | her | to get coffee. |
| The commander | ordered | his soldiers | to shoot. |
| Who | advised | you | to accept this job? |

యిదేమాదిరే ask, allow, warn, expect, teach, with, help, beg, desire, request లాంటి verbs ని వాడండి

9. యిక్కడ to లేకుండా infinitive వస్తుంది

Sub + Verb + noun/pronoun + infinitive etc.

| | | | |
|---|---|---|---|
| They | made | me | write the essay again. |

| | | | |
|---|---|---|---|
| I | saw | them | go out. |
| They | watched | her | dance |
| We | cannot let | the matter | rest there |
| | Let | me | go. |
| Kindly | help | me | carry the box. |
| I | heard | her | come in. |

To-infinitive వచ్చే యింకొన్ని రూపాలు చూద్దాం.

10 యీ pattern లో ఏదో ఒక conjunctive (why తప్ప) వస్తుంది, to-infinitive వుంటుంది.

Sub + V + Conjunctive + to-infinitive

| | | | |
|---|---|---|---|
| I | do not know | how | to drive a car |
| I | wonder | how | to do it |
| He | does not know | what | to do. |
| She | is learning | how | to dance. |
| You | must know | when | to begin. |
| Will | you find out | how | to get there! |
| She | knows | when | to stop. |

11 యిలా conjunctive pattern లో verb తర్వాత, conjunctive కి ముందు (why తప్ప) noun గాని pronoun గాని వచ్చి, to infinitive వుంటుంది

Sub + Verb + noun/pronoun + Conjunctive + to-infinitive

| | | | |
|---|---|---|---|
| He | showed | me how | to do it. |
| She | advised | him which | to buy |
| | Tell | me | whether to go or not |
| He | told | her when | to start. |

దీనికి Passive పద్ధతి I was shown how to do it.
She was told when to start.

inform, teach, ask లాంటి verbs తో యిలాంటి వాక్యాలు రాయండి.

(d) To infinitive ని వాక్యానికి subject గా వాడచ్చు.

To steal is wrong.

To err is human

To learn English is easy.

అయితే యిలాంటి వాక్యాల్ని preparatory 'it' ని subject గా చేసి రాయడం మంచిది

It is wrong to steal
It is human to err

దీని pattern

It + to be + Subject complement + Subject

It is easy to find fault
It is a pleasure to talk to her
It is an offence to bribe public servants
It is delightful to see him.
It would be a mistake to ignore your father's advice.

To climb this mountain is difficult
To waste your money is foolish
To bribe a public servant is an offence
To call people names is not polite.
To cheat others is wrong

యీ వాక్యాల్ని పైన చూపించిన 'It' పద్ధతిలో రాయండి.

యిలా 'it' ని preparatory subject గా వుంచి రాసే మరికొన్ని patterns చూద్దాం.

12 It + to be + Subject complement + for + noun/pronoun + infinitive

It was hard for him to live on his small income.
It is impossible for you to follow my speech.
It is difficult for a blind man to see.
It is a shame for you to talk ill of us.
It would be a pity for us to cancel the party

యిదేమాదిరీ యింకా మరిన్ని వాక్యాలు రాయండి.

యీ preparatory 'it' లేకుండా ఫలానా టైమయింది, ఫలానా యింతదూరం, యిదిగో యింత బరువు వుంది అని చెప్పగలిగే వాక్యాలు రాయడం కుదరదు. ఆ వాక్యాలు చూడండి.

It is 10 A.M. It is 10 o'clock. It is too early. It is time. It is Monday.

It is spring. It is near. It is very far. It is at a stone's throw. It is heavy.

It is light. It is raining. It is sultry. It is melodious.

యిదేరకంగా seem, appear అనే verbs కి infinitive phrase subject గా వచ్చేటప్పుడు preparatory 'it' వుంటుంది.

It seemed impossible to go on
It seems a pity not to make use of this chance
It appears a bold plan to capture the enemy now.

'To infinitive' ని ముగించే ముందు యింక వొకటి రెండు అంశాలు చూద్దాం. 8వ pattern లో యీ to-infinitive తో యేర్పడే intransitive sentences ని గురించి కొంచెం తెలుసుకున్నాం. To-infinitive ని co-ordinate clause equivalent గా చేసే పద్ధతి వుంది, అదేమిటో చూద్దాం:

He awoke to find himself famous
I rejoice to hear your success
We shudder to think of the tragedy

వీటిని He awoke and found himself famous అనీ We shudder when we think of the tragedy అనీ వివరించుకోవచ్చు.

యిక ఇంగ్లీషుభాషలో 'go' అనే verb ని continuous tense లో వాడేటప్పుడు మీదన్నా జరగబోయే దాని అవకాశాన్నీ, వొక intention నీ, future time నీ సూచించడం కనిపిస్తుంది. అప్పుడు to-infinitive వాక్య నిర్మాణంలో వస్తుంది ('go కి continuous tense అంటే I am going now అనేలాంటి వాక్యం అని తెలుసుకదా).

Sub + be going + to-infinitive etc.
It is going to rain in the evening
I am afraid I am not going to carry out the work
We are going to buy a new TV set.
Are you going to marry her?
He is going to find out the truth
She is going to have a baby

13 యిప్పుడు noun/pronoun, present participle వచ్చే verbs ని చూద్దాం.

Sub + Verb + Noun/pronoun + Present Participle.
We saw the thief running away
I heard her giving orders
She felt her heart beating fast.
They left me wondering
She kept me waiting.
We caught the student copying
We shall soon get things moving
Keep the pot boiling.

